శ్రీ రామచంద్రాయనమః

# ఆర్యకథానిధి.

## చతుర్థ భాగము.



వావిలికొలను సుబ్బరాయ

విరచితము.



తొమ్మిదవకూర్పు ౧౦౦౦ ప్రతులు.

గుంటూరు:

శ్రీ కైలాస ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

౧౯౨౦.



[వెల రు. 0-8-0

# విజ్ఞాపన

ఆర్యమహాశయులారా!

శ్రీ ఆంధ్ర వాల్మీకి వావిలికొలను సుబ్బారావు (వాసుదాసు)గారు రచించిన గ్రంథముల ప్రభావమును క్రొత్తగా మేము తెలుపవలసినది లేదు. శ్రీవారు పరమపదించిన పది పంఁడెండు సంవత్సరములుగా వారి గ్రంథముల ముద్రణ ప్రచారాదులు సక్రమ వ్యవస్థలో నుండినవికావు. నేఁడు తిరిగి శ్రీ కోదండరామప్రభువు ననుమతితో శ్రీ కోదండరామ సేవక ధర్మసమాజము వారా కార్యమును బూనినారు. ఇది లాభమున కాశించి చేయుపనికాదు ఆ శ్రీ వాసుదాసవారి యాశయము, ఆర్యమత, నీతి ధర్మములు తెలుఁగువారిలోఁ బ్రచారమయి వా రుభయలోక సుఖములఁ బడయుటయే, ఆ యాశయము నెఱవేర్చుటయే యీ సంస్థకుఁ గర్తవ్యము. దీనివలన వచ్చు ద్రవ్యము శ్రీమదొంటిమిట్ట కోదండరామస్వామి కైంకర్యమున కును గ్రంథ పునర్ముద్రణమునకును మాత్రమే వినియోగపడఁ గలదు. తెనుఁగుసీమ వారీ కైంకర్యమునఁ దగిన సహాయ మొనరించెదరని విశ్వసించుచున్నాము.

దాసకుటి
అంగలకుదురు
12-11-1950

ఇట్లు విన్నవించు
పరమాత్మని వేంకటనారాయణదాసుఁడు,
అధ్యక్ష ప్రతినిధి,
శ్రీ కోదండరామ సేవక ధర్మ సమాజము.

---

గ్రంథములు దొరుకుచోటు:

శ్రీ కోదండరామ సేవక ధర్మసమాజము,
దాసకుటి–అంగలకుదురు పోష్టు, వయా తెనాలి.

ఆపదా మపహర్తారం

దాతారం సర్వసంపదామ్



లోకాభిరామం శ్రీరామం

భూయో భూయో నమామ్యహమ్.

కం. నీపాదకమలసేవయు
నీపాదార్చకులతోడి నెయ్యమును నితాం
తాపార భూతదయయును
దాపసమందార నాకు దయసేయఁగదే.

శ్రీ రామచంద్రాయనమః.

# ఆర్య కథానిధి.

## నాలుగవ భాగము.

### ౧. ఏ దానము మేలనిన నిదానమే మేలు.

గౌతముఁడని ప్రసిద్ధికెక్కిన యొకమునిగలఁడు. అతని భార్య అహల్య. చిరకారి యనువాఁడు వారల కడగొట్టు కొడుకు. అతని కేపని చెప్పినను చక్కఁగ ఆలోచించి నిదానముగ చేయునుగాని తొందరపడి చేయఁడు. అటులని నిష్కారణముగఁ గాని సోమరితనముచేతఁ గాని అతఁడు కాలహరణము చేయువాఁడు కాఁడు. ఆకారణముచే నతఁడు చిరకారి యని పిలువఁబడుచుండెను.

ఇట్లుండ నొకనాఁడు అహల్య యొకానొక చేయరాని పని చేయఁగా కోపించి మేలు గీళ్ళు విమర్శింపక గౌతముఁడు చిరకారిని పిలిచి దీనితల తెగగొట్టుమని అహల్యను జూపి యేదియో పనిమీఁద అరణ్యమునకుపోయెను.

అహల్యయును తాను జేసిన యకార్యమునకు దుఃఖము లజ్జ తన్ను బాధింప నెదురుగ నిలిచి "నాయనా! నీ తండ్రి యాజ్ఞ నీవు నెరవేర్పుము శిక్షచేత నేను పవిత్రురాల నయ్యె

దను. అపకీర్తి సంపాదించి అవమానపడి భూమిమీఁద బ్రతుకుటకంటె మరణము నొందుటే మేలు. తండ్రియాజ్ఞ నీవు నెఱవేర్చితివేని నాకు మేలుచేసినవాఁడ వగుదువు" అనెను. చిరకారియుఁ దండ్రియాజ్ఞ నెఱవేర్ప చేతఁ గత్తినెత్తుకొని యిట్లు లాలోచించెను. అయ్యో! నా తండ్రి నాకెట్టికార్యము చేయ విధించెను. తండ్రియాజ్ఞను నే నెట్లుచేయుదును? కన్న తల్లిని వధించి యధర్మ మను సముద్రమున నెట్లు మునుఁగకుందును.

పితృవాక్య పరిపాలనము పరమధర్మమే అయినను మాతృరక్షణము సమస్తజీవులకు స్వధర్మముకదా. పుత్రత్వము అస్వతంత్రము. స్త్రీవధయే మహాపాతకమన నిఁక మాతృవధను చేసినవాఁ డెట్లు ఉభయలోకముల సుఖింపఁగలఁడు? తండ్రిమాటచొప్పున నడవనివాఁడు మాత్ర మెట్లు ప్రతిష్ఠ కాంచగలఁడు? తల్లిదండ్రు లిరువురిపట్ల సమముగ ప్రవర్తింపవలసిన పుత్రుఁడందు నొకరికి కీడుచేసి యెట్లు ధర్మము నతిక్రమింపకుండఁ గలఁడు? స్వశీలము, చారిత్రము, గోత్రము, కులము వృద్ధిపఱుపఁగోరి తానేకదా తన భార్యయందు మరల జన్మించును. జాతకర్మమందును సమావర్తనమందును తండ్రి వచించు వాక్యములు తండ్రి గౌరవమును స్థిరీకరించుచున్నవికదా. పోషణముచేతను, విద్య నేర్పుటచేతను, తండ్రియే గురువులందు శ్రేష్ఠుఁడనియుఁ దద్వాక్యపరిపాలనంబు పరమ ధర్మమనియు వేదములు వచించుచున్నవి. పుత్రుఁడు తండ్రికి ప్రీతిమాత్రమే కలిగించును. తండ్రి పుత్రు

నకు సర్వము నై యున్న వాఁడు. శరీరము మొదలుకొని సమ స్తము పుత్రునకు తండ్రి యిచ్చినవేకదా కావున లేశ మైన అట్టిట్టనక తండ్రియాజ్ఞ నొనర్పఁ దగు. అట్లు లొనర్చువాఁడు సర్వపాప విముక్తుఁ డగును. భూమిపై శిశువు జన్మింపక ముందు దాని మేలునకై సీమంతోన్నయనాదు లొనర్చు వాఁడు తండ్రియేకదా. భూమిపై జన్మించిన యనంతరము ఆహారాదులును, భోగ్య పదార్థములును, విద్యయు, జ్ఞాన విజ్ఞానము లొసఁగువాఁడు తండ్రియేకదా. తండ్రియే ధర్మము, తండ్రియే స్వర్గము, తండ్రియే పరమతపము. తండ్రి సంతో షించిన సమస్త దేవతలు సంతోషింతురు. జనకువాక్యంబు లన్నియు దీవనలై పుత్రునికి మేలు చేయుచుండును. కావుననే కదా ప్రతిదినము నుదయమున తండ్రికి నమస్కరించి దీవనలఁ పొందుమని వేదములు ఘోషించుచున్నవి. తొడిమె పుష్ప మును, చెట్టు ఫలమును విడుచుట కలదుగాని ఎట్టి కష్టదశ యందును తండ్రి పుత్రుని విడువఁడు. ఎచ్చటనోతప్ప తండ్రిపై ద్వేషించువాఁ డా తండ్రికి జనించువాఁడు కాఁడు. ఇన్ని కార ణములచే తండ్రి గౌరవింప నర్హుఁడు కావున తండ్రియాజ్ఞ నెట వేర్తునా యనఁ దల్లిమాత్రము తండ్రికంటె నేమిట తక్కువ? అగ్నికి అరణివలె నా పుట్టువునకుఁ దల్లియేకదా కారణము. అన్ని యార్తులకు నిర్వృతి తల్లియేకదా. తల్లి కలవాఁడే దిక్కు గలవాఁడు. తల్లి లేనివాఁడు దిక్కు లేనివాఁడు. ఎంతటి దరిద్రుఁడైనను అమ్మా యని పిలుచుచు నింటిలోనికి వచ్చు వాఁడు దుఃఖితుడుకాఁడు. వాడు ముదుకయైనను ముదుక

గాఁడు. పుత్రపౌత్రవంతుఁడైనను నూఱుసంవత్సరముల ప్రాయము గలవాఁడైనను తల్లిగలవాఁడు రెండేండ్ల బాలుఁడే. సమర్థుఁడైనను అసమర్థుఁడైనను కృశుఁడైనను కానున్నను పుత్రుని రక్షించునది తల్లియే. తల్లినిమించిన పోషకులు లోకంబున లేరు. ఎప్పుడు తల్లి మరణించునో అప్పుడే పురుషుఁడు వృద్ధుఁడు, దుఃఖితుఁడునగును. అప్పుడే వానికి సర్వప్రపంచముశూన్యము. తల్లికంటె నిలువ నీడగాని గతిగాని రక్షణముగాని ప్రియ పదార్థముగాని లోకంబున లేదు. గర్భమున ధరించుటఁజేసి ధాత్రి యనియు, జననము కలిగించుటచేసి జనని అనియు, అంగము వర్ధిల్లఁ జేయుటఁజేసి అంబ యనియు, వీరుఁడగు పుత్రుఁ గాంచుటఁ జేసి వీరసువు అనియు, శిశువునకు శుశ్రూషచేయుట శుశ్రువనియుఁ దల్లికి నామంబులు. తల్లియన తన మఱియొక దేహమేకదా. ఏమె కరుణచే తాను వీధి వెంటలోని వెంట గాకున్నాఁడో అట్టి తల్లికి అప్రియము చేయువాఁ డెట్టివాఁడు' దంపతు లిరువురును మనకు పుట్టెడు బిడ్డఁడు సుందరుఁడుగా నుండవలెను, అని కోరువారేకాని అందు తల్లికోరికయె ఫలవంత మగును. నేను చెడుకోరికలు గలదాన నగుదునేని నా గర్భమున శిశువు దురాలోచనము కలవాఁడగును. నేను దుష్ట పదార్థము తింటినేని నా శిశువునకు దేహారోగ్యము చెడును. నేను గుడిప్రక్కఁ బరుండితినేని శిశువునకు రాపిడిచే నంగ వైకల్యము గలుగును. నేను బీభత్సపుఁ బదార్థము చూచిన బిడ్డనికి హానికలుగును. అని యడుగడుగునకు తన లోపము వలన బిడ్డ కేమగునో యని గట్టిగ నడచుటకును జంకునది

తల్లిగాక మఱియెవరు ? గర్భధారణము నిశ్చయమైనది మొదలు తన కత్యంత ప్రియమైన పతి సాంగత్యమును వదలి భిన్నశయ్యఁ బరుండునది తల్లిగాక మఱెవ్వరు ? పుత్రుఁ డుదయించిన పిమ్మట వానికి నీతిమతి కులహీనయగు దానిచే స్తన్య మిప్పించిన యెడల దాని గుణములు బుద్ధి పట్టువడునని వెఱచి తనకుఁ బ్రియతరమైన యౌవన సౌందర్యము దగ్గుట కును జంకక తన రొమ్ముల మీఁదనే పెంచునది తల్లిగాక మఱియెవరు ? తన తనయుని కులగోత్రములను దండ్రికి తల్లికి మాత్రమే తెలియును. కావుననేకదా సన్న్యాసికిఁ దండ్రి వందనీయుఁడు కాకున్నను తల్లి వందనీయ యగుచున్నది. ప్రమాణపూర్వకముగ గ్రహించిన తన తల్లినివిడిచి పరస్త్రీ సాంగత్యము చేసెనేని తండ్రి తండ్రియను గౌరవమునకు దగిన వాఁడుకాఁడు. అట్టివానిమాట పుత్రుఁడు పాటింపఁ బనిలేదు. పురుషుఁడు భార్యను భరించుటచే భర్తయు, పాలించుటచే బతియు నగుచున్నాఁడు. ఈ గుణములను వదలినవాఁడు భర్తయును గాఁడు, పతియును గాఁడు. ఆ గౌరవము వాని నంటదు. ఎప్పటికిని అపరాధులు పురుషులేకాని స్త్రీలుగారు. పురుషుల వివేక హీనతచేతనే స్త్రీలు సాపరాధు లగు చున్నారు. పాపకార్యము చేయువాఁడును, చేయించు వాఁడును, ప్రేరకుఁడు నగుటచేత సమస్తదోషములు పురుషు లను బాధించునేకాని స్త్రీలను బాధింపవు. అబలులగుట చేతను, వారింప సాధ్యపడువా రగుటచేతను, పురుషుల వశ మున నుండువా రగుటచేతను, స్త్రీల నేదోషము లంటవు.

స్వభావ దుర్బలులనియు, ప్రార్థనా సులభలనియు నెఱింగి వారిని వంచించి యకార్యములకు లోపఱుచు పురుషులే సర్వదా పాపులుగాని స్త్రీలుగారు. పుత్రులవలన తల్లి కేమి సుఖమో నే నూహింపఁ జాలను. గర్భము నిలిచినది మొదలు వేవిళ్ళ లోనగు సంకటములచే బాధపడును. ప్రాణగొడ్డమైన ప్రసూతికష్టము చెప్పనలవిగాదు. తదనంతరమైనను సుఖమా యన నదియును లేదు. శిశువులకై నిద్రయు ఆహారము వదలి మనస్సు నెమ్మదిలేక వారి కేవేళకు నేమివచ్చునో యని భయపడుచు వారు నవ్వినఁ దాను నవ్వుచు వారిమోము వాడిన తా మేడ్చుచు తమ నోటిదైన వారికిపెట్టి తమకడుపు కట్టియైన వారికిచ్చి తా మేది భుజింపరానిది భుజించిన శిశువు నకు రోగము వచ్చునోయని భయపడుచు రక్షించు తల్లి ఋణం బెన్నఁడు తీర్చుకొనఁ గలఁడు? భగవంతుఁడును శిశు రక్షణభారము తల్లియం దుంచినవాఁడే గాని తండ్రియం దుంచినవాఁడు గాఁడు. గర్భము భరించు భారము తల్లియందే కదా భగవంతుఁ డుంచెను. నేలమీఁదఁ బడి కావుకావని యేడ్చు శిశువున కాహారము తల్లియందేగదా భగవంతుఁడు కల్పించెను. చంపుమని తండ్రి నా కాజ్ఞాపించిన దెవరిని? స్త్రీని. ఆ స్త్రీ యెవతె? నా తల్లి. అట్లు స్త్రీయు, తల్లియు, దండ్రికంటె గౌరవంబున నధికురాలు నగుదాని నేను తండ్రి మాటవిని యెట్లు హింసింతును? పశువులుకూడ తమ తల్లిని బరులనుండి రక్షించుచుండ మనుష్యుడనై నే నెట్లు మాతృ వధ మొనర్తును? దేవతాసమూహమే తండ్రియనియు తండ్రి

సంతసించిన దేవతలందఱు సంతసింతురనియుఁ జెప్పుదురు. తల్లియో, మర్త్యులయు అమర్త్యులయు సమూహముకదా? తల్లి సంతసించిన దేవతలు మనుష్యులుకూడ సంతసింతురు. అని దీర్ఘకాల మాలోచించుచు తల్లియెదుట నిలువఁబడి యుండెను.

చిరకారి యివ్విధముగ నాలోచించుచుండ నడవికి పోయిన గౌతముఁడు కోపము చల్లార శాంతము వహించి యిట్లు లాలోచించెను. అహా! తొందరపడి నే నెంతటి పాప మున కొడిగట్టితిని. కార్యాకార్యములు చక్కఁగ విమర్శింప నైతిని.

స్త్రీయును అందు భార్యయునై సుఖాసుఖములు పంచుకొనుటచే వాసితయునై భర్తవ్యయగు నిల్లాలిని చంప నుద్యమించితిని. ఇంతకన్న ఘోరపాతక మింకెద్ది కలదు? దీనినుండి విడివడుటెట్లు? ఇంతకు చిరకారి తనకు చెప్పినపని చేసియుండునేమో? చిరకారి యనుపేరు సార్థకముగా నీ విష యమున వర్తించిన నే నెంత ధన్యుఁడ నగుదును. చిరకారీ! నీ వీ సమయంబున చిరకారివై నిన్ను, నన్ను, నీ తల్లిని రక్షిం పుమా అని యనుకొనుచు శీఘ్రముగ నింటికి వచ్చి చేతఁ గత్తిని గొని తల్లియెదుట నిలువంబడియుండు కొడుకును జూచెను. చిరకారియు తత్క్షణము కత్తిని నేలపై జాఱవైచి తండ్రి పాదములపైఁ బడి యనుగ్రహింపుమా యని వేఁడు కొనెను. దుఃఖతప్తుఁడై వేఁడుకొను పుత్రుని, లజ్జచే నిరా కారయై నిలఁబడిన భార్యనుజూచి సంతసించి పుత్రుని కౌఁగ లించుకొని యిట్లనియె. చిరకారీ! నీ చిరకారితనమువలన

నన్ను ఘోరపాపమునుండియు, దీర్ఘశోకము నుండియుఁ దప్పించితివి. చిరకారీ! నీవు చిరంజీవివగుము. అని దీవించి భార్య చేసిన దోషమునకై యామెను శపించెను.

కం. చిరముగ మిత్రునిఁ గూర్పుము;
చిరముగ యోజించి విడువు చేసెడిపనులన్;
చిరముగ సాగును స్నేహము
చిర మాలోచించి పిదపఁ జేసినయేనిన్.

కం. చిరముగ నాలోచింపక
సరిగా దప్రియము కిల్బిషద్రోహరుషా
గురుదర్ప రాగములకుం
బరవశుఁడయి యాచరింపఁ బరులకు నెపుడున్.

కం. హితులకు భృత్యులకును స్త్రీ
తతికిని బాంధవులకుఁ గీడు తలఁచెడిపట్లన్
మతిమంతులు చిరకారిత
స్తుతియింతురు వ్యక్తపడని దోషములందున్.

## ౨. ప్రీతితో నిచ్చినది పిడికెఁడే చాలు.

ధర్మరాజు కౌరవరాజ్యమునకు పట్టాభిషిక్తుఁడైనపిమ్మట బంధువులఁ జంపిన పాపము తొలఁగించుకొన నశ్వమేధయాగ మొనర్చెను. దానియందుఁ జేయవలసిన షోడశమహాదానములు లోనైనవి యథావిధి యే లోపము లేకుండున ట్లొనర్చెను. యజ్ఞము ముగియవచ్చిన దినమున నొకముంగిస సభామధ్యమున నిలిచి యందరు వినుచుండ నిట్లనెను. ధర్మరాజా! సభాసదులారా! నా వాక్యమును గోపింపక యాలకింపుఁడు. నేను సత్యము పలుకుచున్నాను. ఈ యాగమున నీ పాండవాగ్రజుం డొనర్చిన దానము సక్తుప్రస్థుఁ డొనర్చిన దానములోని రేణువునకును సరిపోలదు. అనిన ఆ వాక్యములు విని సభ్యులు "ఓ నకులమా! యీరాజు చేసిన దానమునం దే లోపము గంటివి? సక్తుప్రస్థుఁ డెవఁడు? అతఁడు చేసిన దానమునం దేమి విశేషము? చెప్పుము. కారణము చెప్పక గొప్పవారినిగాని గొప్ప కార్యములనుగాని దూషింపరాదుగదా" అనిన ముంగిస అటులైన సక్తుప్రస్థు చరిత్రమును అతని దానము మహిమయుఁ జెప్పెద వినుఁడు. మహాపురుషులు చేసిన కార్యములందు దోషము లారోపించి ప్రసిద్ధికి రాఁదలఁచిన పురోభాగిని నేనుగాను" అని యిట్లు చెప్పఁ దొడఁగె.

కొంతకాలముక్రింద కురుక్షేత్రమందు సక్తుప్రస్థుఁడను నొక బ్రాహ్మణుఁడును అతని భార్యయుఁ గొడుకును కోడలును వసించుచుండిరి. అన్నిటిలోను యాచన కడునీచము. యాచన

గార్హస్థ్యనాశన మొనర్చును. స్నేహితులను బంధువులను చిన్న చూపున చూడఁజేయును. ఇంతయేల? యాచనకంటె లఘు పదార్థము మఱియొకటి లేదు. యాచకున కందఱు కనబడు చుందురుగాని అతఁడుమాత్ర మొకరికిని గానరాడు. సమీపిం చిన తన్నేమి యాచించునో యని గాలియు దూరమందు తొలఁగిపోవుచుండును.

కం. తల లెత్తి చూడ వెఱతురు
వెలవెలనై మాఱుపలుక వెఱతురు భీతిన్
జలియించి పఱతు రిన్నీ!
కొలపగతురు కారె యాచకులు లోభులకున్.

దాతలనే యాచింతమా యనిన

ఉ. దాతలు దాతలంద్రదది యతథ్యము, లోకమునందు లేఁడుపో
దాత, యతండు గల్గినను దాతృతఁదా సకలార్థులందు నే
లా తులతూగకుండు? నచలస్థితి నింతదలంచి యే నహో
దాతఋణానుబంధము గదా యని చిత్తమునం దలంచెదన్.

అని యాలోచించి యుత్తమ విప్రునకు పరిగ్రహము నిషిద్ధమనుట స్మరించి తిరిపెమెత్తక కోసివిడిచిన చేలలోను మడులలోను పడియుండు గింజలను గడ్డిగింజలను పావురము వలె నొక్కొక్కటి యేఱియు, చెట్లనుండి రాలిన ఫలముల సేకరించియుఁ దెచ్చి వానిని పాకముచేయించి భగవంతునకు నివేదించి దినమునం దాఱవభాగము వేళఁ దక్కిన ముగ్గుర తోడ భుజించుచుఁ గాలము గడుపుచుండును. ఇట్లుండ పెద్ద

వఱపువచ్చెను. వానచినుకు భూమిమీఁదఁ బడదయ్యెను. కారుచిచ్చులు ప్రబలి యడవుల దహించెను. తోమిన రాగి చెంబులవలె కొండలు కనుపట్టుచుండెను. దోకిస పెట్టినట్లు పొలము లుండుటచే మేయఁబోయిన పశువులు రెండుజాము లకే యిల్లుచేరుచుండెను. నీటికై పోయినవారు మూఁడు జాములైనను గృహములు చేరకుండిరి. ఇట్టి దుర్భిక్ష సమయ మున వారికి కొన్ని దినములవఱకు కందమూలములుగాని కాయగసులుగాని ధాన్యపు గింజలుగాని యేవియు దొరక లేదు. కొన్నిదినముల నందఱు నుపవాసముండిరి. అందరు కొంచెము కొంచెముగఁ జేర్పగా గొన్నాళ్ళకు ఒక కుంచె డయ్యెను. ఈ దినమైన కడుపుచిచ్చు కొంచెమైన నార్తమసి దానిని పిండిగొట్టి భగవంతునకు నివేదించి నలుగురు నాలుగు తూనికలుగఁ బంచుకొని ఆఱవభాగమువేళ విస్తళ్ళలో నుంచి భుజింపఁబోవు సమయమున వెన్నంటు డొక్కతో, దివ్వెదీసిన గూళ్ళవంటి కన్నులతో, నెంచఁగూడిన బక్కెముకలతో, నొండొంటి ముద్దిడ నుంకించు లోదవడలతో నొక యతిథి వృద్ధబ్రాహ్మణుఁడు “అయ్యా! ఆఁకలి యగుచున్నది. ప్రాణ ములు పోవునట్లున్నవి. చెవులు గడియలు పడినవి. కొంచె మాహార మిచ్చెదరా” యని వచ్చెను. ఆయనను వెంటనే గారవించి యర్ఘ్యపాద్యములిచ్చి సక్తుప్రస్థుఁడు తన మానెఁడు పిండిని సంతోషముతో ఆయన కిచ్చెను. దానితో ఆయనకు ఆఁకలి సమయలేదు. అది తెలిసికొన్న సక్తుప్రస్థుఁడు “అయ్యో! బ్రాహ్మణునకు కొఱకడుపునకు పెట్టవలసి వచ్చెనుగదా!' ఈ

జన్మమేల కాల్పనా? ఏమిచేయుదును." అని యాలోచించుచు తలవ్రాల్చి యుండెను. అతిథియాఁకలియుఁ బెనిమిటి చింతయు నుపలక్షించి యతనిభార్య తనపాలి పిండిని భర్తముందరనుంచి దీనిని అతిథికిండని వేఁడుకొనెను. సక్తుప్రస్థుఁడదిచూచి భార్యతో నిట్లనియె.

లోకములో పశువులు పక్షులుకూడ తమకు దొరికిన యాహారమును దాము తినక భార్యలకు బిడ్డలకు నిచ్చు చుండును. అది జీవి స్వభావము. తన కున్నను లేకున్నను తన్నాశ్రయించి యుండువారిని బోషింపవలసినది గృహస్థు విధి. న్యాయమిట్లుండ నేను నీభాగము నెట్లు గ్రహింతును? నీవు అబలవు. ఎక్కువ దేహకష్టము చేయుదానవు. కావున నీకు నాకంటె నెక్కువ యాహార మియ్యవలసి యుండఁగా నటులిచ్చుటకు లేకపోయెఁగదా యని నేను పరితపించుచుండ నీపాలి పిండియు నాకిచ్చిన నా మనస్సునం దెట్లుండునో నీ వూహింపవలదా? నా యాఁకలికంటె నీ యాఁకలి గొప్ప దనియు నాకంటె మిక్కిలి డస్సియున్నదానవనియు నే నెఱుఁగుదు. లేకలేక యెన్నాళ్ళకో ఆహారము దొరక దానిని నీవు దానముచేసిన బ్రతుకు తెరువేది? నీబాగేగదా నాబాగు, నీవు బాగుండినఁ గదా నాకు అన్ని వ్రతములు తపములు జపములు సాగును. భార్యయేకదా భర్తకు ఆహార మిడి యతని పోషింపవలసినది. భర్తను దయతో గారవించు నది భార్యయేకదా? "లేబరముగాదె యిల్లాలు లేనిబ్రదుకు" అన్నట్లు భార్యలేని వానిబ్రదుకు శూన్యమేకదా. భార్యలేని

వాఁ డన్నివిధముల పరాధీనుఁడేకదా. భార్యవలననే కదా పురుషుఁడు ధర్మము అర్థము కామము సాధింపఁ గలిగి యుండును. భార్యవలననేకదా పురుషుఁడు తన్నుఁ దన పూర్వు లను నరకమునుండి తప్పించు సంతానము గలవాఁ డగు చున్నాఁడు. అట్టి భార్యను రక్షింపనివానికి నిహముగాని పరముగాని గలదా?" భార్యవలన సమస్త సౌఖ్యములు పడ యుచు ఆమెను సుఖముగ రక్షింపక యుపేక్షించువాఁడు మనుష్యుఁడగునా? యనెను.

ఆ పలుకులువిని భార్య యిట్లనియె. ప్రాణేశ్వరా! మీరు చెప్పినది నేను కాదననుగాని మఱి యించుక నావిన్నప మాలకింపఁ గోరెదను. సతిని పాలించువాఁడు కావున పురు షుఁడు పతియయ్యె. భరించువాఁడు కావున భర్తయయ్యె. అట్టి పతిని విడిచి పత్ని ధర్మార్థకామము లెట్లు సంపాదింపఁ గలదు? భర్త లేకుండిన భార్యగతియేమి? పతి బాగుండిననే భార్యకు అన్నివిధముల బాగు. కావున మగనిని చక్కఁగ విచారించుటే భార్యకు ప్రథమ కర్తవ్యము. భార్యకు భర్త కన్న దైవము లేదు కావున దేవతా నివేదనముగాక ముందు భుజించుట యెట్లు దూష్యమో యట్లే భర్త భుజించుటకు ముందు సతి భుజించుటయు దూష్యము. కావున మీరు భుజింపకుండిన నేనుమాత్రము భుజింతునని తలఁచితిరా? మీ రుపవాసములచే శుష్కించియు మీ భాగము నతిథికీయఁగా నేనుమాత్ర మీయరాదా నాకు బతివై భర్తవై యెన్నివిధ ములనో యుపకారము చేయుచుండ నావలన మీరు పిడికెఁడు

పిండి గ్రహింపరాదా? భార్య యెప్పటికి భర్తకు సహధర్మచారిణియై యుండవలయును. మీ రేధర్మమందు వర్తింతురో ఆ ధర్మమందు వర్తింపవలసినది నాకును విధి. ఇందు నాకు స్వాతంత్ర్యము లేదు. న న్నాధర్మమందుఁ బ్రవర్తింపఁ జేయ నీయకుండుట మీకును ధర్మము గాదు” అనిన సక్తుప్రస్థుఁడామె భాగము పిండిని అతిథి కిచ్చెను గాని దానిచేతను ఆయన యాఁకలి యణఁగ లేదు. అది యెఱిఁగి కుమారుఁడు తనభాగము పిండి తెచ్చి తండ్రిముందిడి యతిథికిమ్మని వేఁడుకొనెను. దానినిజూచి తండ్రి కొడుకున కిట్లనియె.

“పుత్రకా! నీకు నూఱుసంవత్సరముల ప్రాయమైనను నీవు నాకు పసిపిల్లవాఁడవే. బిడ్డలను రక్షింపవలసిన విధి తల్లిదండ్రులది. తమకు లేకుండినను తల్లితండ్రులు బిడ్డలకు ఆహారము కల్పింపవలయును. బిడ్డలసంతోషమే తల్లిదండ్రుల సంతోషము. బిడ్డలు దుఃఖింపఁగాఁ తల్లిదండ్రులు సుఖింపరు. నీవు బాగుండినవే మా బాగు నీవలననే మేము ఊర్ధ్వలోకములను పొందవలసినవారము. నీవలననే మేమిందును సుఖింపవలసినవారము. ఎన్నిదినములకో నీ కింత యాహార మీయఁగలిగితిని. మరల నీకిఁక నెన్నాళ్ళకు ఆహార మీయఁగలనో తెలియదు. ఈ కొంచెము నీకు లేకుండఁ జేసిన నీవు ప్రాణ మెట్లు భరింతువు? మేము ముసలివారము. ఆఁకలిని సహింపఁగలము. బాలుర కాఁకలి మెండు. సహింపలేరు. బాలుర నోటికడిని దీయు తల్లిదండ్రులు రాక్షసులుగాని మనుష్యులుగారు. ఆఁకలి కోపక నే నొకవేళ నీ కన్నులయెదుట మరణించినను

వ్యసనములేదు. నాయనా! తలఁదడుపు కోడలు నీళ్ళువిడుచు కొడుకు కావలయునని తల్లిదండ్రులు దైవములను ప్రార్థించుచుందురు. మీరిరువురు క్షేమముగ నుండుటే మాకు పదివేలు కావున నీయాహారము నీవు భుజింపుము" అనిన కొడుకిట్లనియె.

"తండ్రీ! మీరిటులనరాదు. బాలురకు యుక్తవయస్సు వచ్చువఱకు వారిని తల్లిదండ్రులు భరింపవలయు ననుట న్యాయ్యమే కాని శక్తియుండినను లేకుండినను కలకాలము భరింపవలయు ననుట ధర్మ్యముకాదు. యుక్తవయస్సు వచ్చినది మొదలు కుమారుఁడు తల్లిదండ్రులను తప్పక భరింపవలయును. అట్లు భరింపని కృతఘ్నుఁడు పితృద్రోహి, యుభయలోక భ్రష్టుఁడై రౌరవాది నరకముల పాలగును. తల్లిదండ్రులు బిడ్డలను ప్రతిఫల మపేక్షింపక పోషింతురు. అట్టివారిని మరల భరించుట తనవిధి తానుచేసి ఋణవిముక్తుఁ డగుటకే కాని వారి నుద్ధరింపఁ గాదు. వృద్ధులుగ నుండు మీ రుపవాసము చేయ నేనా భుజింతును? చేతికెదిగిన కొడుకు కోడలు ప్రాప్తించిన పిమ్మట కుటుంబరక్షణ విచారణ భారమంతయు వారియందున్నది. అతిథి నభ్యాగతిని గౌరవింపవలసినవారు వారే. వారికిఁ దెలియని విషయము చెప్పుచు వారిచే సత్కరింపఁబడుచుఁ బుణ్యకార్యము లొనర్చుచు తల్లిదండ్రులు భగవంతుని ధ్యానించుచు సుఖముగ కాలము గడుపుచుండ వలయును. అట్టి భారము నాయందుండ ముందు నాహార మీ యతిథికీయవలసి యుండఁగ మీరిచ్చుచుండ నూరక చూచు

చుంటిని. ఆ పాపమునుండి నే నెట్లు విముక్తుడుదునో తెలియదు. ఈ బ్రాహ్మణుం డరకడుపుతో లేచిపోయె నేని నీ వా దుఃఖము తోనే మరణింతువు నేను నీ మృతికి కారణమగుదును గదా. ఈ పితృద్రోహ మహాపాతకము నేను దప్పించుకొను టెట్లు? తండ్రియే కదా కొడుకు. కొడుకు తండ్రిసొత్తయినప్పుడు కొడుకుసొత్తు తండ్రిదికదా ? కావున దీనిని నీ సొత్తుగనే గ్రహించి యీ యతిథి కిడుము" అనిన దానిని గ్రహించి యతిథి కిచ్చెను గాని దానిచేతను ఆయన సంతుష్టుండు కాడయ్యె. అదిచూచి కోడలు తన భాగము మామగారి ముందటనుంచి నాయం దనుగ్రహించి దీనిని అతిథి కీయుండని వేడుకొనెను. అప్పుడు సక్తుప్రస్థుం డామెతో నిట్లనియె.

"పుత్రీ! నీవిట్లు చేయ సాహసింపరాదు. నీవు బాలికవు. ఆంకలిదప్పుల కోర్వంజాలవు. అదియునుగాక మాకందఱ కుప చరించుటచేతను, గృహకృత్యములనెల్ల నిర్వహించుటచేతను నీకు కాయకష్టము మెండు. న్యాయ్యముగ విచారించిన మా కందఱికన్న నీకు ఎక్కువ యాహారమిచ్చి నిన్ను చక్కంగ పోషింపవలయును. నా దారిద్ర్యదేవత నాకట్టి పుణ్యము కలిగింపకున్నది. ఆహారము కొంచెమగుటచే నీకు ఆకలివలన కన్నులలో ప్రాణములున్నవి. మూర్ఛపోవుదానివలె నున్న దానవు. నీవు బాగుండిననే మే మందఱము బాగుండువారము. నీవలననే మావంశము వృద్ధికావలసి యున్నది. నీవలననే మాకు కీర్తిప్రతిష్ఠలు రావలసియున్నది. మగండెంత సమర్థుం డైనను మగువ గుణవతి కాదేని వాం డుభయలోక భ్రష్టుం

మనల్ని నెదికి పట్టుకో లేరు" ఇవీ ఇర్విన్ చెప్పిన పథకాలు. అయితే ఇవేవీ అయిదేసి నిముషాలకంటె ఎక్కువ నిలవ లేదు. ఇవేవీ సాధ్యమయ్యేవి కావని తేలిపోయింది.

పోనీ ఇంటి దగ్గరే ఉండిపోయి...ఏమీ జరగనట్టు నటిస్తే...? పోయిన వస్తువు సంగతి వెంటనే తెలియదుకనక-దూరదర్శిని పెట్టుకునే తోలుపెట్టె యథాప్రకారం మేకున వేళ్లాడుతూనే ఉంటుంది కనుక-అది ఖాళీగా ఉందని ఎవరను కుంటారు? అబ్బె, దీని మూలన పెద్దలాభం ఏమీ లేదు. మహా అయితే రెండు మూడు రోజులు ఇలా గండం గడుస్తుంది. అసలువిషయం బైటపడదా? ఆ తర్వాత మాత్రం నిజ విషయం దాగుతుందా? దూరదర్శిని ఏమైందో గ్రెగినీ సంజా యిషీ చెప్పుకోవడం మానుతుందా, తాను చదీచప్పుడు కాకుండా వూరుకుంటే దీనిని మరొకరు కాజేశారని తండ్రి అనుకుంటాడేమో, అది మరీ తలవంపులుగా ఉండదూ?

చిట్టచివరికి గ్రెగినీ ఒక నిశ్చయానికి వచ్చేసింది. "ఏమీ దాచకూడదు. జరిగినదంతా తండ్రికి చెప్పేయాలి" అని. "పోనీ మా నాన్నను మీ నాన్నకు సర్దిచెప్పమని అడుగుదామా?" అని ఇర్విన్ సలహా చెప్పాడు. గ్రెగినీ ఈ సలహానుకూడా త్రోసివేసింది. దీనికంతకూ జవాబుదారీ తానే వహిస్తుంది. చెప్పుకోవలసిన సంజాయిషీ అంతా తనే చెప్పుకుంటుంది.

గ్రెగినీ తన తండ్రికి ఈ విషయం చెప్పేసరికి మొట్ట మొదట ఆతడు నమ్మలేకపోయాడు. వెంటనే చిలకకొయ్యకు తగిలించిన తోలుపెట్టె తీసి లోపల ఏ మూలనో ఉంటుం

ధ్వన్నట్టు ఆశతో వెతికాడు. ఆ తర్వాత కూతురుదగ్గరకు వెళ్ళి "ఏమిటి అమ్మా! ఏడుస్తున్నావా? ఛ...ఛ...అంతమాత్రానికే ఏడవాలా? పోతే పోయిందిలే! ఇదిగో...నా కళ్ళు వున్నాయి చూశావూ? అది లేకపోయినా మహా చక్కగా కన్పిస్తాయి. దూరాన్నున్న జంతువునైనా సరే చూడగలను. నాతోటివాళ్ళకు నాపాటి చూపు కూడా లేదు. దూరదర్శిని లేకపోయినా సరే...నా కేమీ యిబ్బంది లేదులే."

"మరి...వేటకు వెళ్ళేటప్పుడు ఎల్లప్పుడూ తీసుకువెడుతూండేవాడవుగదా!"

"అవుననుకో! అమ్మాయీ...ఏదో నామకార్థం తీసుకొని వెళుతూండేవాడిని. నిజంగా దాని అవసరం నా కెన్నడూ కల్గనేలేదు. పైపెచ్చు వేటాడుతూంటే ఈ దూరదర్శిని మెడలోనే వేలాడుతూంటె మహా చికాకుగాకూడా ఉండేది. ఇదిగో...వేటాడేటప్పుడు ఎంత బాదరబందీ తక్కువవుంటె అంత హాయిగా ఉంటుందనుకో..."

ఇదంతా తనను ఓదార్చడానికే తండ్రి చెబుతున్నట్టు ఔగ్రినీ గ్రహించింది. దీనితో ఏడుపు ఇంకా ఎక్కువైంది కన్నీళ్ళు మరీ కాల్వలు కట్టాయి.

"పిచ్చిదానా...బాగానేఉంది...నువ్వునీఏడుపూను!" అని వృద్ధమేమిల్ కసురుకున్నాడు కోపం నటిస్తూను. "ఏం నువ్వు చిన్నపిల్లవా! వస్తువు ఏదైనా పోతే మూర్ఖుల్లాగ ఏడుస్తూ కూచుంటారేమిటి ఎవరైనా?"

"అదికాదు...నాన్నా...నీతో చెప్పకుండా తీసుకుపోయాను" అంది వెక్కి వెక్కి ఏడుస్తూ ఔగ్రినీ!

"చాలు...చాల్లెద్దూ...ఇక వూరుకో...నువ్వు అడిగి తీసుకొనివెళ్ళి ఉండాల్సిందే... అయితేనేం? నేను తండ్రిని. నువ్వు కూతురవు. మనకున్న సామాను ప్రతీదీ నాదీ నీదీ కూడాను. అందుచేత ఇపుడు నీ వస్తువు పోతేనే నువ్వు ఏడుస్తున్నావన్న మాట! బెగ్రినీ! ఇదిగో...ఎవరైనా వింటె నవ్విపోతారు కాని...ఇకచాల్లే, ఇలారా...కళ్ళుతుడుచుకో. ఇంతకీ అసలు సంగతి చెప్పావు కావు...ఏమేమి నాచు మొక్కలు సంపాదించుకొచ్చావు...చెప్పు"

కూతురును చివరికి వృద్ధమేమిల్ ఏదోవిధంగా బుజ్జగించి వూరుకోబెట్టాడు. ఇక బెగ్రినీ తన మామూలుధ్యాసలోపడింది. తాను సేకరించుకొచ్చిన మొక్కలు, వాటి లక్షణాలు... ఇవన్నీ చెప్పడం మొదలుపెట్టింది. కొన్ని రకాల నాచు మొక్కల్లో ఐరయొడిన్, కొన్ని రకాల్లో బ్రోమైన్ మొదలైన రసాయనిక పదార్థాలుంటాయని చెప్పింది. కొన్ని రకాల నాచు మొక్కలను పొటాసియం ఎరువులకు బదులు ఏ విధంగా వాడవచ్చునో చెప్పింది.

ఈ చెబుతూన్నంతసేపు...తన తండ్రి ఇదంతా తన్ను వేరే ధ్యాసలో పెట్టడానికే చేస్తున్నాడని బెగ్రినీ గ్రహించక పోలేదు. ఈ సొద అంతా తాను నిజంగా వినాలనే వింటు న్నాడా? అయితే దూరదర్శిని పోయిందన్న చింత ఈ వృద్ధుని మనస్సులో లేనేలేదా? మేమిల్ సాధారణంగా అన్నీ పట్టిం చుకునే మనిషికాదు. కాని కూతురు వలెనేమేమిల్ నిజంగా ఏదైనా జరిగిన తరువాతగాని దాని విషయం అంతగా పట్టించు కోడు.

అసలు ఈ దూరదర్శిని తండ్రి చేతికి ఎల్లాగ వచ్చిందో సెర్గీని జ్ఞాపకం తెచ్చుకోసాగింది. అప్పటికి తాను ఇంకా చాలా చిన్నపిల్ల, పది పదకొండేళ్ళుంటాయేమో తనకు.

ఒకనాడు సమష్టిక్షేత్రానికి ఒక పరిశోధకుడెవరో జానపద గేయాలు, కథలు, గాథలు సేకరించుకోడానికి వచ్చాడట. ఆయనను మేమిల్ దగ్గరకు పంపించారు. మేమిల్ ఆ వూళ్ళో కంతకూ బాగా కథలు చెప్పగలడని ప్రతీతి. రోజు రోజల్లా మేమిల్ చెప్పిన కథలు గాథలతో పరిశోధకుడు తెచ్చుకున్న నోటు పుస్తకం అంతా నిండిపోయింది. ఆయన అన్నాడు గదా:

"ఇన్నాళ్లు అయిందికాని ఇంత అద్భుతంగా కథలు చెప్పగల్గేవారిని ఎప్పుడు చూడలేదు. నీ పేరు నిలబెట్టుకున్నావయ్యా! కాని ఇదంతా జానపదవాఙ్మయం అనుకోడానికి వీల్లేదే? నువ్వు చెప్పినవన్నీ అనుభవాలతో కూడిన కథలు తప్పితే జానపదగాథలుకావు. అసలు...నీ జీవితంలో జరిగిన కొన్ని కొన్ని సంఘటనలే మహాద్భుతమైన కథలుగా కన్పిస్తాయి. నీవు విని మళ్ళీ చెప్పే కథల్ని కూడా బాగారక్తి కట్టిస్తావు. ఇందులో కొన్ని రష్యన్ కథలనుపోలి ఉన్నాయి. కొన్ని గోర్కీ కథల్లాగ ఉన్నాయి. కొన్ని గోగోల్ చెప్పిన వాటివలె ఉన్నాయి. కాని నీ అంతట నీవు సృజించిన కథ ఏదైనా ఉంటె చెప్పు. లేకపోతే మీ ప్రజలు చెప్పుకొనే కథ ఏదైనా చెప్పు. అది జానపద గాథమాత్రం అయివుండాలి. ప్రజల్లో అనుశ్రుతంగా వస్తున్నదై వుండాలి.

"మహా బాగుంది...నేనేమైనా కథా రచయితనుగనుకనా?" అని మేమిల్ నవ్వాడు. "నేను చెప్పిన కథలన్నీ మా

అమ్మాయి నాకు చదివి వినిపించిన కథలనుబట్టి అల్లినవే. రష్యన్ పుస్తకాల్లోని కథలంటే మా యిరుగు పొరుగు వాళ్ళందరూ చెవులు కోసుకుంటారు. ఎందుకంటె వాటిల్లో జీవిత యదార్థం అంతా ఉంటుంది. చుక్చీ భాషలో అసలు పుస్తకా లేవీ? ఏవో ఒకటీ అరా తప్పితే ఏమీలేనేలేవు. కాని జానపద గేయాలు, గాథలు అంటారా? ఓ! మీకు కావలసినన్ని. మా ప్రక్క 'యరాంగా'లో వాళ్లదగ్గర వినవచ్చు. రేపు నేను మిమ్మల్ని మా ముసలి ఆట్నిక్ దగ్గరకు తీసుకొనివెడతాను. అతనంతట అతనే పదాలు, పాటలు కడతాడు. ఈ తీరప్రాంతంలో ఇటువంటి జానపద వాగ్గేయకారుణ్ణి మరొకణ్ణి మీకు చూడను.

ఆ రాత్రి ఆ పరిశోధకుడు ఆ గ్రామ ప్రజలతోనే ఉండి పోయాడు. వాళ్ళెవరికీ ఇబ్బంది కల్గకుండా ఉండేందుకుగాను సత్రవులో పడుకుంటానని ఆయన అన్నాడు. కాని మేమిల్ ఒప్పుకో లేదు.

''మా చుక్చీలకు ఒక సంప్రదాయం ఉంది. ఎవరైనా అతిథివస్తే చలిమంట వేయడానికి కట్టెపుల్లలు లేకపోతే... స్లెడ్జి బండి విరగదీసి పొయ్యిలోపెట్టు. స్లెడ్జిలేకపోతే గుడిసెలో నాల్గు వాసాలైనాలాగి మంటబెట్టు అని మా సామెత. అందుచేత మిమ్మల్ని సత్రవుకు వెళ్లనీయను." అని మేమిల్ అన్నాడు.

కెగ్రినీ తమ యింట్లో ఈ అతిథికి పడక ఏర్పాటు చేసింది. ఒక ఎలుగు గొడ్డుచర్మం ఒకమూల పరిచారు. ఆ ఏలుగుగొడ్డును రెండేళ్ళక్రితం మేమిల్ వేటాడాడు. చిన్న వొత్తి దీపం వెలుగులో ఆ పరిశోధకుడు పడుకొని ఏదో

చదువుకోవడం మొదలుపెట్టాడు. "ఆ పుస్తకం ఏమిటి? అని మేమిల్ అడిగాడు. అందుకు సమాధానం చెప్పడానికి బదులు ఆయన దానిని పైకి చదవడం మొదలుపెట్టాడు. నెకర్ సాబ్ రచించిన గేయాలివి. ఆ గేయాలంటే మేమిల్, ల్రెగ్రీలకు ఎంతో అభిమానం. ఈ గేయాలను ఇద్దరూ చెవులు దోరగాపెట్టుకొని విన్నారు. మళ్ళీమళ్ళీ చదవమని చదివించుకున్నారు. ఒకటి, రెండు రోజులైన తరువాత ఆ పరి శోధకుడు వెళ్ళిపోతూ వెళ్ళిపోతూ ఆ పుస్తకాన్ని బహుమా నంగా యిచ్చివెళ్ళాడు.

మేమిల్ తీసుకో నిరాకరించలేదు. "మీ రీ పుస్తకాన్ని ఇంతదూరం తీసుకొని వచ్చారంటే మీరు ఎంతో అభిమా నంగా చూసుకుంటున్నారన్నమాట. అందుచేత ఇదిగో! ఈ ఎలుగుచర్మం తీసుకొని వెళ్ళండి" అని మేమిల్ ప్రతి బహు మతిగా యిచ్చాడు.

"చాలా సంతోషం, ఇది తప్పక తీసుకుంటాను. అయితే ఈ పుస్తకాన్ని మీ అమ్మాయి ల్రెగ్రీ కివ్వండి. మీరు యీ దూరదర్శిని తీసుకుందురుగాని" అని పరిశోధకుడు మారు మాటాడనీయలేదు.

మేమిల్ చేతికి దూరదర్శిని వచ్చిన కథ యిది. దూర దూరాలు వుండే వస్తువుల్ని సైతం అతిస్పష్టంగా చూడగల్గిన ఈ యంత్రాన్ని అప్పటినుండి అతిజాగ్రత్తగా మేమిల్ వాడు కుంటూవచ్చాడు. చివరికి ల్రెగ్రీ నాచుమొక్కల సేకరణ మహాకార్యక్రమాని కిది అంకితమైపోయింది!

దూరదర్శిని కోసం సముద్రం మంచుజలాల్లో మునిగి నెతకడంతో ఔగ్రినీ శరీరమంతా చల్లబారిపోయింది కాని – మొక్కల జాతులను సేకరించాలనే కోర్కె మాత్రం చల్లబడ లేదు.

రెండేళ్లు గడిచిపోయాయి. సెకండరీ స్కూలు చదువును ఔగ్రినీ పూర్తిచేసింది. ఇప్పుడామె చదువుతున్నది వృక్ష శాస్త్రం మాత్రమే కాదు...వ్యవసాయ – జీవశాస్త్రం! అయితే పూర్వం సేకరించిన నానాజాతుల వృక్ష సంతతులను చూస్తూ గంటలు గడిపేసే అలవాటు ఆమెకు పోలేదు. ఎప్పుడూ చూడని ద్రాక్షతోటల గురించి గుక్క తిరక్కుండా ఆమె చెప్పగలదు. వివిధజాతుల పండ్ల వృక్షాల గురించి, ఆర్కిటిక్ మండలాల్లో కూడా పెంచడానికి వీలుగా కనిపెట్టిన పండ్లజాతుల గురించి ఎప్పుడూ కలలుకంటూ వుంటుంది.

సెకండరీ స్కూలు చదువు తరువాత ఉన్నతవిద్య శిక్షణాసంస్థకు వెళ్ళవలసిందని అందరూ సలహా యిచ్చారు. ఔగ్రినీ అభిలాష కూడా అదే. కూతురు తన్ను విడిచి వెళ్లి పోతుందని లోలోపల బెంగగా వున్నప్పటికి వృద్ధనేమిల్ కోరేది కూడా అదే. అనాదిర్ కంటె ఖబరోవస్క్ చాలా దూరం. అనాదిర్ నుండి సంవత్సరానికి కనీసం రెండుసార్లు వేసవిలోను, శీతాకాలపు సెలవుల్లోను ఔగ్రినీ యింటికి వచ్చేది; వృద్ధ నేమిల్ చాలాసార్లు అనాదిర్ వెళ్లి చూడకుండా వుండే వాడూ కాదు. ఇప్పుడు ఖబరోవస్క్ వెడితే సంవత్సరానికొక నారి వేసవి సెలవుల్లో మాత్రం ఔగ్రినీ యింటికి రావడానికి వీలుపడుతుంది. శీతాకాలపు సెలవులు చాల కొద్దిదినాలే

అవడంవలన ఖబరోవస్క్ నుండి రావటం పోవటం పడదు. ఉత్తరాలు కూడా చాలా ఆలస్యంగానే అందుతాయి. వృద్ధ అట్యాక్ కొడుకు ఎక్కడో లెనిన్‌గ్రాడ్‌లో చదవటం లేదూ? ఖబరోవస్క్ కంటె ఎన్నోరెట్లు దూరంలో వుంటున్నాడు ఆ కుర్రవాడు. అయితేం? అట్యాక్ భార్య బతికే వుంది. ఇంకా పిల్లలుకూడా వున్నారు. వాళ్ళకు కాలక్షేపానికి లోటు ఏమీలేదు. తన తండ్రి సంగతి అది కాదుగదా! తను ఒక్కర్తే తప్ప వృద్ధ మేమిల్‌కు యింకెవరున్నారు?

అయినప్పటికీ వృద్ధ మేమిల్ తన కూతురును చదువుకు పంపడానికి వెనుదీయలేదు. వృద్ధాప్యం, ఒంటరితనం అని కూతురు చదువు చెడగొడతాడా? అల్లా ఎన్నటికీ జరగవీలులేదు. ఆమె తప్పక చదువుకోవలసిందే, అన్నీ తెలుసుకోవలసిందే! మేమిల్ చదువుకోలేదు. ప్రపంచంలో విషయాలన్నీ తెలుసుకోలేదు. అసలు తన చుక్చీ జాతిలోనే చదువు సంధ్యలు లేవు. చుక్చీ జాతి ఇన్నాళ్ళుగా నోచుకోని విజ్ఞాన సంపద ఔగ్రినీకైనా లభించాలి. తన జాతికి ఇన్నాళ్లుగా చొరరాని విజ్ఞానపు బాటల్లో ఆమెకిప్పుడు ప్రవేశం కావాలి.

ఔగ్రినీ ప్రయాణానికి మేనత్త నుతనాయుత్ సీలు చేప కొవ్వుతో తయారు చేసిన రొట్టెలను కొన్నింటిని సిద్ధం చేసింది. సెలవు తీసుకోడానికి ఔగ్రినీ వచ్చేసరికి రొట్టెలు కూడా సంసిద్ధమైపోయాయి. మేనమామ గెమాల్కాప్ రొట్టెలను శుభ్రమైన గుడ్డలో చుట్టి కొవ్వు కరిగి కారి పోకుండా ఆపైన తోలుతో చుట్టాడు.

"అన్ని ఎందుకులెద్దురూ" అని ఔగ్రినీ అంది.

“ప్రయాణంలో ఫలహారాలు బసువటమ్మా. ఒకరోజు ప్రయాణం అయితే వారం రోజులుకు సరిపడేవి పట్టుకెళ్ళమని శాస్త్రం.”

“సముద్ర ప్రయాణం అయితే ఒక్కడూ ముగ్గురకు సరిపడేది తీసుకువెళ్ళాలి” అన్నది మేనత్త నుతనాయుత్.

“తీసుకెళ్ళవమ్మా! తీసుకెళ్ళు... నీకు ఇవంటే చాలా ఇష్టం కూడాను. నీకేమిటి! మీా నాన్నకు కూడా ఇవంటె మహా యిష్టం. నీవు చేయవలసిన ప్రయాణమూ, చాలా దూరం. నీకు దోవలో ఎంతో ఉపయోగపడతాయి”

“అనాదిర్ వరకే నేను సముద్రంమీాద ప్రయాణం చేస్తున్నాము. అంతవరకే మా నాన్న వస్తాడు. అక్కడ నుండి నేను విమానంమీాద వెళ్ళాలి. పరీక్షలో నెగ్గినందుకు నాకు పతకం యిచ్చారు. అందుకు నన్ను విమానంమీాద తీసుకువెళతా మన్నారుకూడా” అన్నది జెగ్రనీ.

“ఏమిటీ విమానంమీాదనే ?” అని ఆశ్చర్య సంభ్రమాలతో నుతనాయుత్ అమాంతంగా పీటమీాద చదికిలబడింది, ఆ పీట తిమింగలం ఎముకలతో చేసింది. జెగ్రినీకేసి బిత్తర చూపులు చూస్తూ “విమానంమీాద వెడతావుటే తల్లీ! ఎంత అదృష్టం! నీ తల్లే వుంటేనా? ఎంత సంబరపడిపోను? చదువుకోసం ఖబరోవస్క్ దాకా వెళ్ళడం...ఆ తర్వాత విమానంమీాద ప్రయాణం చేయడం...ఇవన్నీ చూసుకుందుకు ఆమెకు అదృష్టం లేకపోయిందికదా!”

విమానంమీాద ప్రయాణం చేయడమంటె ఎంత ఘనంతో కూడుకున్న విషయమో ఈ మాటలతో గెమ

ల్యాప్, సెగ్రినీ, నుతనాయుత్ - అందరికీ తెలిసివచ్చింది. విమానాలంటె ఇప్పుడు అంతా మామూలైపోయింది కాని ఇరవై యేళ్ళక్రితం సెగ్రినీ తల్లి తువార్ బ్రతికిఉన్నప్పుడు అసలు విమానా లెక్కడివి ? విమానంమీద సెగ్రినీ వెడు తుందంటె తువార్ ఎంత కంగారు పడిపోయేదో! కాని తన కూతురికి పట్టిన అదృష్టం చూసి ఎంత గర్వపడిపోయేదో ?

ఈ ఇనుపడేగ సెగ్రినీని యెక్కించుకుని ఖబరోవస్క్ దాకా తీసుకుని వెడుతుం దన్నమాట ! ఒఖోటస్క్ సముద్రం, అనేక సముద్రపు పాయలు, జుగ్జూత్ పర్వతాలు, మైదానాలు ఇన్నిటినీ దాటుకుంటూ ఎగిరిపోతుందా ? ఎంత విచిత్రం ! !

సెగ్రినీ అప్పుడే అనుకుంది - "ఖబరోవస్క్ చేరిన తర్వాత తన తండ్రికి మంచిరకం దూరదర్శిని కొనాలి" అని. తండ్రిని తలుచుకునేసరికి విమానంలో కూచున్న సెగ్రినీకి చిరునవ్వు వచ్చింది. "ఎంత ఖరీదైనా సరే మునుపటిదానికంటె చాలా మంచిది కొనాలి" అని తనలో తాను అనుకుంది.

* * *

అంతవరకు బుర్రలో అనేక ఆలోచనలు వచ్చి పోయాయి. ఏమేమిటో అనుకుంటూ సెగ్రినీ మానసిక ప్రపంచంలో విహరించింది. ఇప్పుడిక మాగన్నుగా నిద్ర కూడుకుని వస్తున్నట్టు అనిపించింది. కునుకు పడుతూంది. తన ఎదురుగా కూచున్న స్థూలకాయుడికి కునుకు వస్తూండేసరికి తనకూ అది పట్టుకునేటట్టు వున్నది. అతడంతే నిశ్చింతగా నిద్రపోతాడు. బహుశా ఏ ఇరవైసార్లు ప్రయాణం చేశాడో !

కాని తానో? ఇదే మొదటిసారి కదా! ఒక్క నిముషం కూడా వృథాపోకుండా అంతా చూడాలి. ఒక్కసారి కళ్ళు మూసిందా...ఎన్ని వింతలు, విశేషాలు కనబడకుండా జారి పోతాయో!”

ఈ స్థూలకాయుడి వాటం...వ్యవహారం అంతా చూస్తే భూగోళశాస్త్రజ్ఞుడిలా వున్నాడు...లేదా భూగర్భ శాస్త్రజ్ఞుడై వుండాలి...బహుశా ఏదో పరిశోధన దళానికి చెంది వుండాలి. అటువంటి దళానికి నాయకుడేమో కూడా. కానిపక్షంలో అతనిచేతికి దిక్సూచి ఎందుకుంటుంది? అందరూ తలా ఒక సూటుకేసు సామాన్ల గదిలో పడవేయడానికి యిస్తే ఇతగాడు ఒక చిన్న సంచి మాత్రం అందులో పడేశాడు. జుట్టు నెరుస్తోంది; మనిషి తొణకడు బెణకడు; తెలివితేటలు కొట్టొచ్చే ముఖం...ఇతడు తప్పక భూగర్భశాస్త్రాచార్యుడై వుండాలి. తప్పదు” అని బెగ్రినీ నిర్ధారణకు వచ్చింది.

“ఇతని పరిశోధన దళం బహుశా ఒక కొత్త గనిని కనిపెట్టి ఉండాలి. అది చాలా ముఖ్యమైనదై ఉండాలి. ఏ బంగారపు గనో, నూనె గనో, మరే ముఖ్య లోహమో అయిఉండాలి. ఈ లోహం విషయం గురించి ప్రభుత్వానికి తెలియజెప్పడానికి బహుశా ఈయనను మాస్కోకు పిలిచా రేమో? కళ్ళు మూసుకుని అతను యిదే విషయం ఆలోచించు తున్నాడు కాబోలు” అని అనుకుంది బెగ్రినీ.

ఇదంతా నిజం గాకపోవచ్చు. అతడు భూగర్భ శాస్త్ర జ్ఞుడు కావచ్చు. ఒక ఇంజనీరు కావచ్చు, లేదా ప్రభుత్వ ఆడిటర్ కావచ్చు. అనాదిర్‌లో ఏ సంస్థ జమా ఖర్చుల

నైనా తనిఖీ చేయడానికి వెళుతూండవచ్చు. మంత్రిమండలికి ఇతగాడు తయారుచేసి ఇవ్వవలసిన నివేదిక ఎల్లా ఉండాలో ఆెగ్రినీ ఆలోచించసాగింది. అతడి తరఫున తాను స్టాలిన్‌తో యిలా చెబుతుంది : "ప్రియమైన కామ్రేడ్ స్టాలిన్ ! గౌరవ నీయులైన మంత్రులారా ! మనదేశ సరిహద్దు ప్రాంతాలలో ఒకానొక ప్రాంతానికి అమూల్య సంపద సమకూర్చగల ఒక పరిశోధన జరిగిందని మీకు సగర్వంగా చెబుతున్నాను. ఈ పరిశోధనల్లో బయల్పడిన లోహం ఈ జిల్లాలో యింకా చాలా చోట్ల ఉన్నట్లు మాకు తోస్తోంది. వాటిని తప్పక పరిశోధిం చాలి. పరిశోధించబడతాయికూడా. ఈ పనిని చేయగల సమర్థులు కూడా స్థానికంగా అభివృద్ధి చెందుతున్నారు. నేను ప్రయాణం చేసిన విమానంలోనే ఒక చుక్చి జాతి బాలిక ప్రయాణం చేస్తున్నది. ఆమె ఖబరోవస్క్ చదువుకోసం వెడుతూంది..."

ఆెగ్రినీ ఆ క్షణంలో తాను వ్యవసాయ – జీవశాస్త్రం చదువుకోడానికి వెడుతున్నాననీ, భూగర్భశాస్త్రం నేర్చుకో డానికి కాదనీ ఇంచుమించు మరిచిపోయి తన ఆలోచనలతో కొట్టుకొనిపోయింది.

మిగిలిన ప్రయాణీకులు కొందరు ఆెగ్రినీకి విమానాశ్ర యంలోనే పరిచయమయ్యారు. ఈ స్థూలకాయుడు ఆఖరు క్షణంలో వచ్చాడు. మధ్యలో విమానం ఆగి నూనెపోయించు కుంటున్న సమయంలో ఇతగాడు అక్కడ పది నిమిషాలు అటూఇటూ తిరిగి ఒకచోట కాళ్ళు పారజాపి కూచొని నోటు పుస్తకంలో ఏదో వ్రాసుకోవడం మొదలుపెట్టాడు. మళ్ళీ

వైమానికుడు ప్రయాణీకు లందరిని విమానంలోకి రావలసిం దని కేక వేసేవరకు అక్కడ వ్రాసుకుంటూనేఉన్నాడు.

అందుచే అతడి వృత్తి గురించి తానూహించినది సరి అవునో కాదో తెలియలేదు.

ప్రయాణీకులలో యిద్దరు ఉత్తరధృవ మండల నౌకా సంస్థలో పనిజేస్తూ కమిషన్‌నుండి తిరిగి వస్తున్నారు. అందులో ఒకరు ప్రఖ్యాత వైమానికుడు. అతనికి "సోవియట్ యూని యన్ వీరుడు" అనే బిరుదు వుంది. ఔగ్రినీ యింకా అప్పటికి చిన్నపిల్లగా వుండగా ఈ వైమానికుడు ప్రపంచ రికార్డు లను అధిగమిస్తూ విమానం నడిపాడు. అతని కిప్పుడు నడివయస్సు వచ్చింది.

చేపల పరిశ్రమల్లో నిపుణులైనవారి ప్రాంతీయ సమా వేశానికి ఒక చుక్చీ కార్మికుడు బయలుదేరి వెడుతున్నాడు.

మరొకతడు తోళ్ల వర్తక సమాఖ్య ప్రతినిధి. మనిషి పొట్టిగా వున్నాడు. చురుకైన కళ్ళు, వంటినిండా కావలసినంత రోమసంపద వున్నవాడు. అతనికిఅసలు విమానంలో, మేఘాలమధ్య వెడుతున్నట్టే లేదు. 'ఆఫీసులో ఉన్నట్టే బోలె డన్ని ఫైళ్లు ముందు వేసుకుని కూర్చుని ఏవేవో లెక్కలు చూస్తూ ఎర్రపెన్సిలుతో గుర్తులు పెడుతూ కూర్చున్నాడు.

అనుభవం గల్గిన ప్రయాణీకుల్లా కన్పడేవారు ఇంకా ఇద్దరున్నారు. అందులో ఒకరు ప్రాంతీయ పార్టీ కార్యవర్గ సభ్యుడు. మరొకడు వార్తాపత్రిక విలేఖరి. వారిద్దరూ చద రంగం ఆడుకుంటూ కూర్చున్నారు. ఔగ్రినీ ఇంతవరకు చద రంగం ఎప్పుడూ చూడలేదు. చదరంగం బల్లకు బదులుచిన్న

తోలు చదరపు ముక్క, దానిమీద తెలుపు నలుపు గడులూ ఉన్నాయి. పావులు ప్లాస్టిక్‌తో చేసినవి. మట్టంగాఉన్నాయి. వాళ్ళు ఆటలో ఎంత మునిగిపోయారంటే కిటికీలోంచి ఎప్పుడూ చూడటానికైనా తల ఎత్తడంలేదు.

జెన్నీ కాలక్షేపం చేయాలంటే ఏదో చేయగలదు. ఇప్పుడు విమాన ప్రయాణం కొన్ని గంటలు పాతబడిందికదా!

తన సంచిలోంచి ఒక పుస్తకం తీసి జెన్నీ చదవడానికి ప్రయత్నించింది. కాని ఏం లాభం? దృష్టి అంతా కిటికీ మీదే వుంది. క్రింద అనుక్షణం అపూర్వమైన, సుందరమైన దృశ్యాలు ఎన్నో వెళ్ళిపోతున్నాయి.

విమానం కొద్దిగా ఎడమదిక్కుగా తిరిగేసరికి చదరంగపు ఆటగాళ్ళు వంచుకున్న తలల మధ్యగుండా కిటికీలోంచి చూస్తే, ఎండలో తళతళా మెరుస్తున్న విశాల సముద్రం కన్పించింది. అప్పుడప్పుడు ఒక చిన్న ఓడ కన్పిస్తూండేది. మిగతా సమయంలో అంతూ దరీలేని సముద్రం, సూర్యకాంతిలో మిలమిలలాడుతూ లేచిపడుతున్న కెరటాలు కన్పించేవి.

జెన్నీ కూచున్నదానికి కుడివైపు చూస్తే అన్నీ పర్వతాలే! మంచుతో కప్పబడిన శిఖరాలు తెల్లగా, దూరానికి ఎంతో మనోహరంగా ఉన్నాయి. ఎత్తయిన పీఠభూములు, పర్వతశ్రేణులు చూస్తే, ఇది బహుశా ఒయ్‌మేకన్ పీఠభూమి ప్రాంతమై ఉండాలి. కాదుకాదు. బహుశా, ఈపాటికి తాము ఈ పీఠభూమిని దాటిపోయి వుండొచ్చుకూడా.

స్థూలకాయుడు ఇప్పుడు కళ్ళు తెరిచాడు. జెన్నీ యీ అవకాశం జారవిడవ దలచుకోలేదు.

"విమానంలోనించి క్రిందకు చూస్తూంటే క్రింద భూమి వున్నట్టుగానే లేదు. అంతా ఒక భూగోళపటంలా వుంది కదూ!"

"అవును. క్రిందకుచూస్తే పటంలాగే వుంటుంది. ఇంకా పైకి యెగిరినప్పుడు పటం స్వరూపం మరింత స్పష్టంగా వుంటుంది.

"మనం యిప్పుడు ఎక్కువ యెత్తున ఎగరడంలేదా?"

"ఇప్పుడా?" సూలకాయుడు క్రిందకు చూచి బహుశా ఒక మైలు ఎత్తున మనం ప్రయాణం చేసూ వుండవచ్చు."

"భూమిమీద ఒక మైలు ఎత్తునే?"

"అవును. విమానంమీద ప్రయాణం చేయడం ఇదే మొదటిసారా?"

"నేను, ప్రయాణానికి కొత్తని బైటపడిపోయానన్న మాట!

"లేదులే...అంతమరీ కొత్తగా ఉన్నట్లు కన్పడటం లేదులే. ఇకపోతే క్రిందకుచూస్తే పటంలా కన్పిస్తోందన్నావేం? అదంత సులువైన విషయం కాదు నిర్ధారణ చేసి చెప్ప డానికి! విమానాలు రాకముందే భూగోళపటాలు తయారు చేసే పద్ధతి కనిపెట్టారు. అందుకు కొన్ని నిర్దిష్ట మార్గాలు సూచించారు. ఈనాడు మనం విమానంమీద ప్రయాణం చేస్తూంటే కన్పడే పటం స్వరూపం ఏ విధంగా ఉంటుందో, పూర్వం తయారుచేసిన పటాలుకూడా అదే విధంగా ఉండేవి. దీనినిబట్టిచూస్తే పూర్వీకులు భూగోళపటాలు తయారుచేయ డానికి అవలంబించిన పద్ధతి సరిఅయినదేనని ఋజు అవుతూంది."

"ఆఁ! ఇతడు తప్పక భూగోళ శాస్త్రవేత్త అయి ఉండాలి." అని అత్యాసక్తితో స్థూలకాయుడి సంభాషణ వింటూ ఔగ్రిసీ అనుకుంది. ఈ ప్రశ్న వేసేముందు తన బుర్రలోకి ఇదేమీ రానేలేదు.

మళ్లీ కిటికీలోంచి తొంగిచూసింది. ఈ సారి కన్పించిన పర్వతాలు ఉత్తరాది పర్వతాలవలెలేవు. ముదురు ఆకు పచ్చరంగుగా ఉన్నాయి. ఒక చోట మరీ దట్టంగాను మరొక చోట శ్వేతవర్ణంగాను కన్పిస్తున్నాయి. ఇది పర్వతాల రంగేనా ? పర్వత సానువుల్లో గుంపు గుంపులుగా వేలకొలది వింత జంతువులు మేతమేస్తూ నిలబడి ఉన్నట్టు అన్పిస్తోంది. ఈ ఆకుపచ్చని మంద మందలు ప్రాణంతో ఉన్నట్టు అని పించింది. "ఆఁహాఁ... తెలిసింది. తెలిసింది...అది అరణ్యం ! అరణ్యమే అయి వుండాలి !" పక్కనున్న వారిని ఆతురతగా అడిగింది. "ఇవి అరణ్యాలేనా ?"

"అవును నిజమైన పర్వతారణ్యాలు, టండ్రా బయళ్ళను దాటి ఎప్పుడో ముందుకు వచ్చేశాము."

"అరణ్యాలు ! నిజమైన అరణ్యాలు !!" పలుసార్లు ఎంతో ఆప్యాయంగా అనుకుంది ఔగ్రిసీ. ఎన్నాళ్ళనుంచి తాను చూడాలనుకుంటోంది యీ అరణ్యాలను !

తన స్వస్థలంలో 'యరంగా' యిళ్ళతో బాటు ఇప్పటి కప్పుడే కలపతో కట్టిన యిళ్లు లేచాయి. చుకోట్కా ప్రాంతానికి స్టీమర్లతో యీ కలప తీసుకొనివచ్చారు. ఒక్కొక్క ఓడమీద వందలాది కర్రదుంగలు వచ్చేవి. వీధుల్లో ఎలక్ట్రిక్ స్థంభాలుగా వీటిని పాతారు. లైట్లు

పీఠెనుంచి వేలాడుతూ, గాలికి వూగుతూ వెలుగుతూండేవి. ఈ దుంగలన్నీ ఒకప్పుడు బ్రతికివున్న చెట్లే! ఈ చెట్లకు కొమ్మలు, రెమ్మలు, ఆకులు గుబురుగా వుండి ప్రక్కనున్న చెట్లతో గుసగుసలాడుతూ వూగుతూ వుండేవన్నమాట! బెగ్రినీ యిటువంటి చెట్లగురించి అనేకసార్లు పుస్తకాల్లో చదివింది. అడవుల చిత్తరువులను చూసి యెంతో సంబరపడేది. తన గ్రామంలోవున్న చెట్ల దుంగలన్నీ వున్నట్టుండి చెట్లు క్రింద అయిపోతే? నిటారుగా నిలబడి, మళ్ళీ వేళ్ళుతన్ని, ఆకులు, చిగుళ్ళు ఎత్తితే...ఒక అరణ్యం అయిపోదూ?

వసంతరుతువులో వచ్చే * తుపానులకు చెట్లు మొదళ్ళంటా కూలి, ఒడ్డుకు కొట్టుకువస్తాయి. వాటికి ఆకులు రాలిపోతాయి. కొమ్మలు విరిగిపోయి ఉంటాయి. కాని, ఇంకా చచ్చిపోయి ఉండవు ఆ చెట్లు.

ఇల్లా కొట్టుకువచ్చే దుంగలను గంటలకొలది బెగ్రినీ పరీక్షిస్తూ కూచునేది. దాన్ని వృద్ధ మేమిల్‌గాని లేక యితరులెవరైనాగాని వచ్చి కమ్మలక్రింద కోసి స్లెడ్జి బండక్రిందో, కయాక్ చట్రంక్రిందో తయారు చేశేవారు.

బెగ్రినీ ఇప్పుడు వందలమైళ్ళ మేర దట్టమైన అరణ్యప్రాంతాలమీదుగా ఎగురుతూ వెడుతోంది. "చెట్లు చేసే ధ్వని ఎల్లా ఉంటుంది?" అని బెగ్రినీ వింతపడింది. హోరుమని వీస్తూన్న మంచుతుపానులా ఉంటుందా? సముద్రపు ఘోషలా ఉంటుందా? లేకపోతే విమానం ఇంజను హోరుమని చేసే ధ్వనిలా వుంటుందా?

* ఉత్తర దేశాల్లో తుపానులు రావడం మామూలు.

ఖబరోవస్క్ విద్యా కేంద్రంలో చేరిన వెంటనే దగ్గరలో వున్న ఏదైనా అడవిని చూసేందుకు వెళ్లాలను కుంది ఒల్గినీ. దగ్గరకాకపోతే బస్‌మీాదనైనా వెళ్ళాలి. సజీవంగా వున్న చెట్ల మ్రానులను చేతులతో తడమాలి. కొమ్మలుగాలికి వుయ్యాల లూగుతూంటే తనివితీర చూడాలి. రెమ్మలు, ఆకులు అల్లాల్లాడుతూ చెప్పుకునే గుసగుసలు వినాలి.” అనుకుంది.

ఖబరోవస్క్ దగ్గర ఏమైనా అడవులున్నయేమో తన సరసన వున్న ప్రయాణీకులను అడగాలనుకుంది ఒల్గినీ. కాని అతడు అప్పుడే మళ్ళీ జోగిపోతున్నాడు. లేదా కళ్ళు మూసుకుని ఆలోచిస్తున్నడా? తన ప్రశ్నలతో అతన్ని బాధించడం ఏమీా బాగుండదు.

ప్రయాణం ఆద్యంతాలూ అచ్చుగుద్దినట్టు స్మృతిపథంలో ఉంచుకోవాలని ఒల్గినీ మహోముచ్చటపడింది. కాని తీరా ఖబరోవస్క్ విమానాశ్రయంలో విమానం దిగేసరికి ఒల్గినీ గాఢనిద్రలోఉంది. పక్కన కూచున్నవాడు తట్టి లేపవలసి వచ్చింది. పాపం ఆమెచాలా అలసిపోయింది. రేపు ప్రయాణం అనగా రాత్రి తెల్లవార్లు ఒల్గినీ తన స్నేహితురాలితో కబుర్లు వేసుకుని కూచుంది. అనాదిర్‌లో తాను తన తండ్రి ఆ పిల్ల ఒకే యింట్లో ఉండేవారు. తండ్రి ప్రక్కనున్న గదిలో నిద్ర పోయాడు. తాను, స్నేహితురాలుకలిసి ఇకస్వేచ్ఛగా కబుర్లలో పడిపోయారు. కంటిమీాద కునుకుంటే వొట్టు. తెల తెల్లవారు తుండగా ఒల్గినీ విమానం ఎక్కింది. రాత్రంతా నిద్రలేక పోవడం, స్నేహితురాళ్లను విడచివెడుతూండటం, ప్రయాణంలో

కొత్త కొత్త అనుభవాలు - వీటన్నిటితో ఒగ్రిగనీ నిజంగా అలిసిపోయింది.

"మన విమానం యిక నడవనంటోంది" అని నవ్వుతూ ఒగ్రిగనీ భుజంతట్టి లేపాడు స్థూలకాయుడు. "ఉపయాభి వందనాలు" అన్నాడు! బైటచూస్తే పొద్దు గూకుతోంది!

ఒగ్రిగనీ విమానం దిగింది. శీతాకాలంలోవలె అంతా చీకటిగా వుంది. చుకోట్కాలో ఆగస్టు నెలలో అర్ధరాత్రిళ్ళు కూడా అంత చీకటిగా వుండదు.

తోటి ప్రయాణీకులతో కలిసి ఒగ్రిగనీ విమానాలు దిగేచోటు దాటి విమానాశ్రయ భవనాల దగ్గరకు వెళ్ళింది.

"కామ్రేడ్స్' మీ కందరకు ఖబరోవస్క్ స్వాగతం!" అని విమానాశ్రయం అధికారి ఆహ్వానించాడు. "ఒక్క క్షణం యిక్కడ కూచోండి. ఇంకో అయిదు నిమిషాల్లో బస్ వస్తుంది. యుకీ నికొలెయ్ విచ్! మీ కారు ఇక్కడ అరగంటనుండి సంసిద్ధంగానే ఉంది" అన్నాడు. ఆయన ప్రాంతీయపార్టీ కార్యనిర్వాహకవర్గ సభ్యుడు. ఆయన ప్రయాణీకు లందరికేసి తిరిగి "కామ్రేడ్స్! మీలో ఎవరెవరు బయలు దేరుతారు. కారులో మూడుసీట్లు కాళీగా ఉన్నాయి" అని అడిగాడు.

"అబ్బెబ్బే, ఎందుకండీ! బస్ వచ్చేస్తుంది కదా. ఎందుకు మీకు శ్రమా?" అన్నాడు విమాన చోదకుడు.

"సరె, సరే! నిన్నెల్లాగూ తీసుకువెళ్ళను. ఈ వూరికి నువ్వు పాతకాపువేగదా! కొత్తగా వచ్చినవారినే తీసుకు నడతాను. ఎక్కడ దింపమన్నా నాకు అభ్యంతరం లేదు.

"హల్లో! ఇగోర్..." అంటూ, అప్పుడే వచ్చిన తన డ్రైవర్ను పిలిచి "ఇదిగో చూడు! కామ్రేడ్ రెంటుర్గిన్ సూటుకేసు కారులో పెట్టు. ఇదిగో, ఎ్రగినీ, నువ్వుకూడా లే — ఏమిటీ, ఈ పెట్టె యింత బరువుగా వుంది. పుస్తకాలేనా ?

"అవునండీ! అవన్నీ పుస్తకాలే"

"నేననుకున్నట్టే అయింది. చూశావా? ఇదిగో! కామ్రేడ్ ఖోల్మోగోరోవ్, నువ్వుకూడా మాకు అతిథివే, లే లే, నువ్వుకూడా మాతో రావాలి."

స్థూలకాయుడి పేరు ఖోల్మోగోరోవ్. అతడిలా అన్నాడు. "ఎందుకండీ! ఖబరోవస్కీ నాకు కొట్టిన పిండే. 'ఎప్పుడు వచ్చిపోతూనే వుంటాను. పైగా నేనువస్తే చిక్కు ఏమిటో చెప్పమంటారా? మీ కారులో మరెవరికీ చోటు మిగలదు!"

అయితే యురీనికోలయేవిచ్ వూరుకోలేదు. ఖోల్మోగోరోవ్‌ను చెయ్యిపుచ్చుకొని లాక్కొని వెళ్ళాడు.

పట్టణమంతా దీపాలతో వెలిగిపోతోంది. కాని ఎ్రగినీ కారులో మధ్యను ఇరుక్కుపోయింది. ఏమీ కన్పించడంలేదు. కుడివేపు కిటికీగుండా బైటకు చూద్దామంటె ఖోల్మోగోరోవ్ మహాకాయం అడ్డుగావుంది. ఎడమప్రక్క రెంటుర్గిన్ కూర్చున్నాడు. ఈ యిద్దరూ ఆమూర్ హోటల్ దగ్గర దిగిపోయారు. కారు రయ్‌ని విద్యాలయం హాస్టల్ కేసి నడిచింది. కారు మలుపు తిరిగి ప్రక్క వీధికి వెళ్ళింది. వీధిలో ఎక్కడా దీపాలు లేవు. కారు దీపాల కాంతిలో కాలిబాట మాత్రం తెల్లగా కనపడుతూంది.

"ఛీ, ఛీ, ఎంత అప్రతిష్ట" అని యురీ నికోలాయెవిచ్ విసుగు కున్నాడు. "కొత్త టెరం ప్రారంభం కావడానికి ఇక రెండు వారాలుకూడా లేదు. ఇంతవరకు వీధిలో దీపాలుకూడా వేయలేదు. కొత్తగా ఏర్పాటైన ప్రాంతమే...అయితేం–సెప్టెంబరు నాటికి విద్యార్థుల హాస్టలుకు నీటి సరఫరా, విద్యుద్దీపాలు, అన్ని సౌకర్యాలు సమకూర్చుతామని మా కమిటీకి భవన నిర్మాణం బాధ్యులు వాగ్దానం చేశారు. ఏమైనట్టు ఈ వాగ్దానం?" అనుకున్నాడు.

కారు ఆగింది. డ్రైవరు టెగ్రినీ సూటుకేసును తీసి గుమ్మందగ్గర పెట్టాడు. వెళ్లిపోడానికి కారులో కూచున్నారు. టెగ్రినీ తలుపుతట్టింది. వార్డెన్ "వస్తున్నా, వస్తున్నా" అని బద్ధకంగా నిద్రలేచి వస్తూ "ఎవరది" అని అడిగింది. టెగ్రినీ ఏదో జవాబు చెప్పిన తరువాత తలుపు తీయడానికి తాళం చెవుకోసం వెళ్లింది.

"సరే! టెగ్రినీ! ఇక వెళ్లి వస్తాం. గుడ్ బై!" అని చెయ్యి ఊపాడు యురీనికొలయెవిచ్. టెగ్రినీ కూడా 'గుడ్ బై' చెప్పింది.

కారు జాగ్రత్తగా మళుపుతిరిగి వెళ్లిపోయింది. టెగ్రినీ ఒక్కర్తే నిలబడివుంది. గాలి బాగా వీస్తోంది. 'యరాంగా' పైన కప్పిన తోళ్ళమీద దూదిపింజల్లా వున్న మంచు బలంగా వచ్చి కొడుతున్నట్టుగా వుంది. కాని ఆగస్టులో మంచు ఎక్కడనుండి వస్తుంది? క్రిందుగా పక్షులగుంపు ఎగురుతూంటే రివ్వుమన్న రెక్కల చప్పుడులా వుంది. ఏమిటో అది?

తాళంచేతులు పట్టుకొనివచ్చి వార్డెన్ తలుపు తీసింది.



*　　*　　*

ఇద్దరు బాలికలు అంతక్రితమే వచ్చి ఆ గదిలో నిద్రపోతున్నారు. వార్డెన్ ఆ గది బెగ్రిసీకి చూపించింది. అందులో ఒక బాలిక మాత్రమే నిద్రపోతూంది. ఇంకొక ఆమె బెగ్రిసీ పక్కపరచుకొని పడుకున్న తర్వాత, ఒకటి రెండు నిముషాలకు "ప్రియతమా! నిద్రపట్టిందా ?" అని అడిగింది.

"ఇంకా లేదు" అని బెగ్రిసీ అంది.

"నీ పేరేమిటి ?"

"బెగ్రిసీ"

"బెగ్రిసీ...ఎప్పుడూ వినలేదే, ఇల్లాంటి పేరు ! బలేగా ఉంది. నీవు చుకోట్కానుండి వచ్చావా ?"

"ఊఁ. నీ పేరేమిటి ?"

"నా పేరు స్వెట్లానా. స్వెటా అని పిలుస్తారు. ఏమి, ఇంత ఆలస్యంగా వచ్చావు ? పరీక్షలు కొద్ది రోజుల్లో అయిపోతాయిగదా !"

"నన్ను ఇదివరకే చేర్చుకున్నారు. పోస్టుద్వారా నా దరఖాస్తులు వగైరా ఇదివరకే అందజేశాం. నన్ను జేర్చుకున్నట్లు సమాధానంగూడా వచ్చింది."

"స్కూల్లో నీకు బహుమాన పతకం ఏదైనా వచ్చిందా?"

"అవును, రజత పతకం వచ్చింది"

"అయితే ఇక నేం? నువ్విక్కడ పరీక్షలేమీ యివ్వనక్కరలేదు, నువ్వు అదృష్టవంతురాలివే. అచ్ఛా! గుడ్ నైట్! ప్రయాణంలో బాగా అలసిపోయిఉంటావు. ఇక పడుకుందాం. ప్రయాణం చాలాసేపు పట్టిందా?"

"లేదు. నేను విమానంమీద వచ్చాను"

"ఏమిటీ! నీకు భయం వేయలేదూ?"

"భయంలేదు, ఏమీలేదు"

"అయితే చాలా సరదాగా వుంటుందన్నమాట. రేపు నాకంతా వివరంగా చెప్పాలి తెల్సిందా? నేనింతవరకు విమానం ఎప్పుడూ ఎక్కలేదు. సరే...ఇక పడుకుందామా? రేపు మాకు చిన్న పరీక్షకూడా వుంది..."

"గుడ్ నైట్"

అయితే...నిద్రపడుతుందా స్వెట్లానాకు! ఒక్క క్షణం వుండి మళ్ళీ మొదలుపెట్టింది బాతాఖానీ.

"ఇగ్రినీ...నిద్రపట్టిందా?...

"లేదులే..."

"నీ ప్రత్యేక పఠనీయాంశం ఏమిటి?"

"ప్రకృతి శాస్త్రం. నీది?"

"నేను 'సాహిత్యం' తీసుకున్నాను – రష్యన్ భాష... సాహిత్యమూను. అదుగో అక్కడ పడుకున్న అమ్మాయిని చూశావా? ఆమె కూడా సాహిత్యాన్నే తీసుకుంది. ఆమె పేరు వార్యా."

"నాకు సాహిత్యం తీసుకోవాలనే వుండేది. కాని రెండు సబ్జక్టులు ఒక్కసారిగా తీసుకోడానికి వీలులేదని అక్కడ చెప్పారు."

"నిజమే. ఒకేసారి రెండు సబ్జక్టులు తీసుకోడానికి వీలులేదు. ఒక్కటే తీసుకోవాలి."

"నువ్వు ప్రకృతి శాస్త్రం తీసుకో. కావలిస్తే సాహిత్య గోష్ఠి కేంద్రంలో కొంతవరకు నేర్చుకుంటూ వుండవచ్చు నన్నారు."

"అంతే...అదే బాగుంటుంది. గోష్ఠి సమయంలో కూడా సాహిత్యవిషయాలు నేర్చుకోవచ్చు. మరి...నేను ఏమి ఆలోచించానో తెలుసునా?"

"ఏమిటి?"

"విను. నాకు ప్రకృతిశాస్త్రం అంటేకూడా చాల యిష్టం. అందుచేత ఒక ఒప్పందం చేసుకుందాం. సాహిత్య విభాగంలో నేను నేర్చుకున్నదంతా నీకు చెబుతూ వుంటాను. ప్రకృతి శాస్త్రంలో నీవు నేర్చుకునేదంతా నాకు చెబుతూ వుండాలి. తెలిసిందా?"

"భేష్...బాగుంది. అల్లాగే చేద్దాం."

"మన సమస్య పరిష్కారం అయిపోయినట్టేగా! సరె, ఇక నిద్రపోదామా? ఇంకా మెలకువగా ఉంటే, రేపు మన ఒప్పందానికే మొప్పం వస్తుంది.

అయితే, అంతటితోనే ఈ పడుచులికి నిద్రపడుతుందా? ఒక్క నిముషం అయిందో లేదో మళ్ళీ మొదలు! ఈ సారి ఎుగ్రినీ ప్రారంభించింది.

"ఇదుగో! స్వెట్లానా" నెమ్మదిగా గుసగుస లాడింది ఎుగ్రినీ, పక్కన పడుకున్న మరోఅమ్మాయికి నిద్రాభంగం అవుతుందేమోనని.

"వూఁ ఏమిటి?"

"స్వెట్లానా ! ఒక చిన్న సందేహం. ఇక్కడ బైనాక్యులర్స్ (దూరదర్శిని) దొరకుతాయా ?"

"ఏమి దొరుకుతాయని అడుగుతావు ?"

"బైనాక్యులర్స్"

"బైనాక్యులర్లా". బహుశా దొరకవచ్చు. నేను షాపులు కొన్ని ఒకసారి తిరగవేశాను."

"ఈ వూరు నాకూ కొత్తే"

"అయితే మీ దేవూరు ?"

"కామోవ్స్కా మాత్క్స. సరే గాని నీకు బైనాక్యులర్స్ ఎందుకు ?.

"దానికో పెద్ద కథ ఉంది."

"నీ స్నేహితుడు పంపమని అడిగాడా ?"

"కాదులే - స్నేహితుడికోసం కాదు. ఆ కథంతా ప్రొద్దున్న చెబుతాను. ఇక పడుకుందామా ?"

చిట్టచివరికి బాలికలందరు గాఢనిద్రలో మునిగారు.

*　　　　*　　　　*

ప్రొద్దుపొడిచి ఎండ ముఖంమీద పడిన తర్వాతగాని ఎగ్రెనీ నిద్ర లేవలేదు. ప్రక్కనే ఉన్న కుర్చీమీద ఆమె బట్టలువేసి ఉన్నాయి. దానికి పిన్నుతో ఓ చీటి గుచ్చిఉంది. అందులో ఇలా ఉంది: "మేము మా పరీక్షకు వెళ్ళాం. (క్షమించు - రాత్రి నీ పేరు మర్చిపోయాను. పేరు మాత్రం చాలా బాగుందనుకున్నాం. కాని జ్ఞాపకం రావడం లేదు)

నీవు మైమరచి చాలాహాయిగా నిద్రపోతున్నావు. లేపడం ఎందుకని మానివేశాం. మా సంచుల్లో తినుబండారా లున్నాయి. తీసుకొని తిను. నువ్వు తప్పకుండా తినుసుమీ! అందులో మంచి రుచిగల్గిన పదార్థాలు కూడా ఉన్నాయి. ఇస్త్రీ పెట్టె కావాలంటే వార్డెన్‌ను అడుగు. ఆమె పేరు దున్యా అత్త. విద్యుచ్ఛక్తి సరఫరా కూడా ఇప్పుడు ఉంటుంది. అందుచేత నువ్వు ఎలక్ట్రికల్ ఇస్త్రీపెట్టె వాడవచ్చును. ఒక వేళ నువ్వు స్కూలుకు వస్తే మేము 62 వ నెంబరు పాఠాల గదిలో ఉంటాము."

— స్వెటా, వార్యా.

నిజమే ఔగ్రినీకి ఇస్త్రీపెట్టె అవసరమే. ఈవేళ ఎండ బాగా కాసేటట్లున్నది. అందుచేత తెల్లని జాకెట్ వేసుకో వచ్చు. ...సంచుల్లో ఏవో మంచి మంచి తినుబండారా లున్నాయన్నారు. ఏమిటో అవి? ఏదైనా యిస్తానంటే పుచ్చుకోకుండా ఉండకూడదు. కాని వీళ్లు తిరిగివచ్చిన తర్వాత తన అత్తయ్య నూతనాయుత్ ఇచ్చిన తియ్యని రొట్టెలు వాళ్ళ కివ్వాలి.

చేతులో వాళ్ళు వ్రాసి పెట్టిన చీటి అల్లాగే పెట్టుకొని తలగడపై వెల్లకిలాపడుకుని ఔగ్రినీ అటూ యిటూ దొర్లింది.

"ఈ కిటికీ తెరలు ఎంత అందగాఉన్నాయి...అన్నిటికి మధ్య మధ్య పెద్ద మచ్చలున్నాయి. పైగా ఈ మచ్చలు కదులుతాయికూడా ఏమిటి? ఉన్నట్టుండి ఒకోసారి ఈమచ్చలు మీాద ముదురు నలుపుగాను, ఒకోసారి లేత నలుపువర్ణంగాను ఉంటా యెందుచేత?"

ఫ్రెగ్రిసీకిది ఏమిటో బోధపడలేదు. చంటిపిల్లలా రెండు గుప్పిళ్లూ పెట్టి కళ్లునులుముకుంది. "ఓహో ఇవి మచ్చలుకావే వీధిలోంచి పడేనీడలన్నమాట. అవును...ఇవి తప్పక..."

—అకస్మాత్తుగా ఫ్రెగ్రిసీకి ఈ మచ్చలేమిటో తెలిసింది. ఇదే బాపతు దృశ్యాన్ని ఏదో సినిమాలో ఫ్రెగ్రిసీచూసింది. చెట్లఆకులు అల్లల్లాడుతూంటే ఎండ ఆకుల సందులనుండి పడుతూ వెలుగు – నీడ, నీడ – వెలుగు క్రింద మారుతుంది.

కాళ్ళకు చెప్పులుకూడా లేకుండా రాత్రి పడుకున్నది పడుకున్నట్టుగా అమాంతంగా కిటికీదగ్గరకు పరుగెత్తింది. ఫ్రెగ్రిసీ అమాంతంగా కిటికీతలుపులు తెరిచింది. రెండు పెద్దబర్చ్చెట్ల కొమ్మలు కిటికీలదాకా వచ్చి అల్లల్లాడుతున్నాయి. ఆకు పచ్చగా, చల్లగా ఉన్నాయి ఆకొమ్మల ఆకులు. చల్లని ఈ ఆకులను వేళ్ళతో తాకవచ్చు...చెంపకు చేర్చుకోవచ్చు... ముద్దుపెట్టుకోవచ్చు...

ఫ్రెగ్రిసీ క్రిందకు చూసింది. మేడ క్రిందిభాగం అది. దున్యా అత్త రాత్రి తనకు తలుపుతీయడానికి తాళాలకోసం వెళ్ళి నప్పుడు ఏదోవీచ్చినట్లు రంయ్ అనిపించింది కదూ? అపుడు పక్షు లెక్కడనుండి వస్తాయి? కొమ్మలు, రెమ్మలే రాత్రి గాలికి తలలూపుతూ చప్పుడుచేశా యన్నమాట! చెట్లు భూమికి చేరువుగా ఉన్నపుడే గాలికి అల్లల్లాడి చప్పుడు చేస్తా యని తాను పుస్తకాల్లో చదువుకుంది. కాని యిప్పుడు ఎత్తుగా, తననెత్తిమీదకు వంగి, కొమ్మలు వయ్యారంగా ఊగు తున్నాయి. అంటే రాత్రి తనకు స్వాగతం చెప్పింది బర్చిచెట్టు అన్నమాట!!

# అరుణరేఖలు

అది శనివారం సాయంత్రం. ఆనాడు క్లబ్ ఎప్పుడూ కిటకిట లాడుతూనే ఉంటుంది. సినిమా చూపించేది ఆ రోజునే. ఒక సంచార సినిమా ప్రదర్శన సరంజామా అప్పటికే వచ్చేసింది. సినిమా ప్రదర్శన అనంతరం నాట్యం ఉంటుంది.

'డాన్ ఖోల్కోజ్' లోని యువతీ యువకులందరూ క్లబ్‌కు వచ్చేశారు. వాళ్ళేకాదు; సంచార సినిమా వచ్చే రోజున ఇక పిల్లల కోలాహలానికి అంతే ఉండదు. తిండితిప్పలు మరిచిపోయి, తెల్లవారేసరికే పిల్లకుంక లందరూ మోటారు బోటుమీద సినిమా సరంజామా ఎప్పుడు దిగుతుందా అని సముద్రపు ఒడ్డుకు వెళ్ళి కూచునేవారు. బోటు రావాలి, ఆ సినిమా యంత్రా లన్నింటిని పోటీలుపడి క్లబ్‌కు చేర్చాలి, అప్పుడు ఇళ్ళకు వెళ్ళి చప్పున అన్నాలు తినేసి, మళ్ళీ క్లబ్ దగ్గరకు పరుగెత్తుకొని రావాలి. సినిమా ఆపరేటరు ఎట్రెలీన్ ఫిల్ము డబ్బాలను చేతులో పట్టుకొని వస్తూంటే అతని వెనక పడివచ్చేవారిని ఎవరడ్డుకోడానికి వీలు ?

వయసుతీరినవాళ్లు తాపీగా ఆఖరున వస్తారు. వేటకాడు మేమిల్, ఖోల్కోజ్ సామాగ్రి మేనేజరు గేమల్కాట్ లాంటి ఆసక్తిగల సినిమాప్రేక్షకులు మిగతా ముసలివాళ్ళందరికంటె

రెండు మూడు గంటలు ముందుగానే వచ్చేవారు. ఈలోగా నాల్గు చదరంగపు ఎత్తులు వేసుకోవడం, ఎట్టీలిన్‌తో పిచ్చాపాటీ మాట్లాడడం, సినిమాపేరు ఏమిటో, కథఏమిటో వాకబుచేయడం ఇత్యాది సహజంగా జరుగుతూండేవి. ఆ తర్వాత మాంచి నదరుగా కనబడే చోటు వెతుక్కొని కూచుని తీరికగా లోకాభి రామాయణం విడేసే వారు ఆ యిద్దరున్నూ. ఏవిషయం రానీ, మేమిల్ అందుకుని దానిమీద ఏదో కథ చెప్పకుండా ఉండే వాడు కాదు. తన దీర్ఘజీవితంలో అతడు ఎన్నెన్నో వింతలు, విశేషాలు చూశాడు. జీవితం ముప్పాతిక మూడువంతులు గడిచిపోయింది. అయినా మనిషికి పడుచుతనంలో వలెనే ఇంకా సరదాలు చచ్చిపోలేదు. ఆ వృద్ధుని కళ్ళలో ఇప్పటికీ చురుకుతనం తొంగిచూస్తూనే ఉంటుంది.

క్లబ్ హాలుకి ఆనుకునే మరొకహాలు ఉన్నది. అందులో గ్రంథాలయం ఉంది. చుక్చీభాషలోను, రష్యాభాషలోను గ్రంథాలున్న మూడు బీరువా లున్నాయి. ఇక్కడకూడా చదరంగం బల్ల, ఇతర ఆటవస్తువులూ ఉన్నాయి.

ఇద్దరు చదరంగపు ఆటగాళ్లు కూచుని ఆడుతున్నారు. చుట్టూ జనం మూగిఉన్నారు. 'ఔటు' పద్ధతిని ఆట జరుగు తోంది. ఓడిపోయిన ఆటగాడు 'ఔటు' అయి వెళ్లిపోతాడు. నెగ్గినవాడు యథాతథంగానే ఉంటాడు. ఓడిపోయిన వాని స్థానంలో ఇంకో ఆటగాడు వస్తాడు. వేటగాడు కెనిరీ ముందు ఇప్పటికప్పుడే అయిదుగురు ఓడిపోయారు. తానింతవరకు ఒక్క ఆటకూడ ఓడిపోలేదు. తరువాత ఎవరొస్తారు ఆటకి? ఆమాత్రం ధైర్యం ఎవరికుంటుంది వృద్ధమేమిల్‌కు తప్పితే!

గొనోమ్, గోడవార్తా పత్రిక అంటిస్తూండగా అక్కడ కొంతమంది జనం గుమిగూడారు. గోడ వార్తాపత్రికనుండి కొందరు పాత వ్యాసాలను తీసేస్తున్నారు. మరికొందరు కొత్త వ్యాసాల్లో ఏముందోనని ఆతురతగా చూస్తున్నారు.

"ఉండండయ్యా! ఉండండి. వ్యాసాలు అతికించనివ్వండి మీకు కావలసినంతసేపు చదువుకోవచ్చును. ఇదిగో యున్నసీర్! ఈ అంచు ఇలా పట్టుకో..." అనిగొనోమ్ అన్నాడు. దూరంగా వెళ్ళి నుంచుని పరకాయించి చూచి "కుడివేపు కొద్దిగా క్రిందకు దించు. ఆఁ...ఇప్పుడు సరిగ్గా ఉంది. అట్లాగే వుంచు" అని అన్నాడు.

గోడ వార్తాపత్రిక అతికించడం అయినతర్వాత అందరితో బాటే గొనోమ్ కూడా చదరంగపు ఆటగాళ్ళ చుట్టూ నుంచున్న వాళ్ళలోకలిసిపోయాడు. చదరంగం పోటీ దగ్గరకు వచ్చాడన్నమాటేగాని దృష్టి అంతా గోడా వార్తాపత్రిక మీదే ఉంది. అది చదివినవారు వెలిబుచ్చే అభిప్రాయాలూ గొనోమ్ గమనిస్తునే ఉన్నాడు. తాను ఎంతకష్టపడి తయారు చేశాడు! అదంతా తన శ్రమ ఫలితమేకదా!

గోడ వార్తాపత్రిక సంపాదకవర్గంలో గొనోమ్ కాక మరిద్దరు సభ్యులున్నారు. ఐసీస్ ఉపాధ్యాయుడు, మరొకతడు వేటగాడు రింటూఫ్గి. రెండో అతడు వ్యాసాలు సేకరించడంలో సహాయపడతాడు. ఐసీస్ వాటిని సంస్కరించి, సరిచేయడంలో తోడ్పడతాడు. కాని చేయవలసిన పని అంతా గొనోమ్‌దే. గొనోమ్ పెద్ద పండితుడేమీ కాదు. ఖోల్కోజ్‌లో అందరితోపాటు తాను ఒక సామాన్య సభ్యుడే. కాని

అతణ్ణే ముఖ్య సంపాదకుడుగా ఎన్నుకున్నారు. వ్యాసాలు సంపాదించడం, వాటిని సంస్కరించడం మొదలైన బాధ్యత లన్నీ చిట్టచివరికి అతనివే. శీర్షికలుకూడా గానోమ్ చేతు ల్లోనే తయారు కావాలి. మిగిలిన యిద్దరు సంపాదకవర్గ సభ్యులు ఆకర్షణీయంగా శీర్షికలు వ్రాయలేరు. అయితేం... తనకి చిత్రలేఖనం రాదు. శీర్షికలైతే బాగా పెట్టగలడు కాని, అచ్చు అక్షరాలు అన్ని రకాల పత్రికల్లోంచి చూసి కత్తి రించడం, అంటించడం – ఈ పనులన్నీ చేయలేడు. ఈసారి పత్రికలో ఎల్లాగో 'చచ్చిచెడి చేయంగల విన్నపాలు' అన్నట్టు ఒక వ్యంగ్య చిత్రం కూడా వేయగల్గారు. పత్రికకు ఎట్టకేలకు ఒక చిత్రకారుడంటూ ఏర్పడ్డాడు.

గోడ వార్తాపత్రిక దగ్గర జనం అంతా గొల్లున నవ్వు తున్నారు. ఇదంతా గానోమ్ వింటూనే ఉన్నాడు.

"అదిగో...అది కెనిరీ బొమ్మే! అవును ముమ్మాటికీ అతనిదే. ఏయ్...కెనీరీ! గోడ వార్తాపత్రికలో పడ్డావులే! రా! ఇటు రా!!" అని కడుపుబ్బ నవ్వుతూ యున్నెనర్ అన్నాడు.

కెనీరీ ఆటలోంచి లేచాడన్న మాటేగాని ధ్యాసంతా వేసిన యెత్తుమీదే ఉంది. మేమిల్ మంచి ఇరకు పడ్డాడు. తాను వేయవలసిన యెత్తుగురించి అయిదు నిమిషాలనుండి ఆలోచిస్తూనే ఉన్నాడు. ఇంకో అంతసేపు ఆలోచిస్తేగాని యెత్తువెయ్యానే వెయ్యలేడు.

కెనిరీ గోడ వార్తాపత్రిక దగ్గరకు వచ్చేసరికి ఒకరి కొకరు మొహం, మొహాలు చూసుకుంటూ నవ్వులు

మానేశారు కాని, ఇంతలోనే మేమిల్ తన యెత్తు నడిపాడు. చుట్టూ జనం కెనిరీని చప్పట్లు కొట్టి వెనక్కి పిలిచారు. కెనిరీ వెనక్కు తిరిగివచ్చాడు. మేమిల్ వేసిన యెత్తు చూసి "ఆఁహా...బాగానే ఉంది. బాగానే ఉంది...మంచి యెత్తే వేశాడే..." అంటూనే ఉన్నాడు...కొద్ది నిముషాలకే "ఆటకట్టు" అన్నారు జనం గొల్లుమంటూ. కెనిరీ పని అయిపోయింది. వృద్ధ మేమిల్ కెనిరీని 'గిజగిజ' అనిపించేశాడు.

"కెనిరీ పని అయిపోయిందిరా...అయిపోయింది..." అని చుట్టూ జనం కోలాహలంగా నవ్వులు...కేరింతాలు కొడుతూండగానే అనిష్టంతో కేనిరీ లేచాడు. ఆ స్థానంలో మరొక ఆటగాడు వచ్చికూచున్నాడు.

అసలు ఖాల్కోజ్‌లో కెనిరీని మించిన 'చెయ్యి' ఏదీ లేదు చదరంగంలో. అందరిలోకి అతడు ఆరితేరినవాడే. నా కళ్ళ ఎదురుగా ఏమి జరిగిందో యధాతథంగా వ్రాస్తున్నానన్నమాటే గాని,...కెనిరీ ఓడిపోవటం ఎల్లా సంభవించిందో చెప్పలేకుండా ఉన్నాను. మేమిల్ ఈసారి పోయిన పోకడలన్నీ చాలా గమ్మత్తుగా ఉన్నాయని కొందరన్నారు. "ఆఁ అదికాదు...కెనిరీ వరసగా ఆరు ఆటలు ఆడిన తర్వాత అలసిపోయాడు. లేకపోతే ఓడిపోతాడా?" అని మరికొంద రన్నారు. "గోడవార్తా పత్రికలో ఎక్కించేశారు...ఆ దెబ్బతో తలక్రిందులైపోయి, ఓడిపోయాడు" అని ఇంకా కొందరన్నారు. నాకు చదరంగపు ఆట అసలు చేతకాదు అందుచేత ఎవరి అభిప్రాయం నిజమో నేను చెప్పలేకుండా ఉన్నాను.

గానోమ్ సిగరెట్టు కాల్చుకుందామని బైటకు వెళ్ళాడు. అప్పటికప్పుడే చీకటి పడిపోయింది. క్లబ్ మాత్రం దీపాల కాంతుల మధ్య ప్రకాశవంతంగా ఉంది. కొంచం సేపటికి వెనకాలనుండి ఎవరో వచ్చి మాట్లాడ్డం మొదలుపెట్టారు :

"జనాన్ని వెధవాయుల క్రింద చిత్రించడానికి నీకు అధికారం ఎవరిచ్చారోయ్ ? నిన్ను సంపాదకుడుగా ఎన్నుకున్నారుగదా అని నీ యిష్టం వచ్చినట్టు రాయడమేనా ? నువ్విప్పుడు చేసింది తప్పా ? తప్పున్నరా ? ఇదిగో...గానోమ్ ! చెబుతున్నాను విను...నీ యిష్టం వచ్చినట్టు సాగదిక్కడ... తెలిసిందా ? జాగ్రత్తగా మసులుకో ! నీకు వార్నింగ్ ఇవ్వడం ఇదే. నన్ను అవమానించడానికి నీకు ఎన్ని గుండెలున్నాయంట ? ఇకనుంచి వళ్ళు దగ్గరపెట్టుకొని మసులుకో, జాగ్రత్త ! అది ఎవరో కాదు. కెనిరీ !"

"ఇదిగో ! కెనిరీ ! నీబెదిరింపులు కట్టిపెట్టు...నీ బెదిరింపులికి జడిసేవారెవ్వరూ ఇక్కడ లేరు ! గోడ వార్తాపత్రికలో ఎవరినీ అవమానించడం కాదు మా ఉద్దేశ్యం ! కార్మికులలో క్రమశిక్షణను పెంపొందించడం మన పత్రిక ఆశయం. శ్రమలో సోషలిస్టు పోటీని పెంపొందించడం దానిపని. సోషలిస్టు బాధ్యతలను విస్మరిస్తున్న వారిని ఖండించడం మాత్రమే పత్రిక లక్ష్యం" అని గానోమ్ ఘాటుగానే జవాబిచ్చాడు.

వార్తాపత్రిక పడికట్టు పదాలంటె గానోమ్‌కి మహా మోజు. ఈ మోజును కెనిరీ వేళాకోళం పట్టించకుండా ఉండేవాడు కాదు ఇతరధ్యాసల్లో పడకుండా ఉంటేను.

"నువ్వు దేనికోసమైనా పోరాడు. కాని ప్రజల్ని మాత్రం అవమానించడానికి వీలులేదు. నీకు అల్లా చేసే హక్కు లేదు" అన్నాడు కెనిరీ.

"పత్రిక ఎవరినీ అవమానించ లేదు. జనం నిన్ను చూసి నవ్వుతున్నారంటే అది నీ తప్పే. నువ్వు బేఫర్వా మనిషిగా తయారయ్యావు. నీ దళాన్ని చవటదళంగా తయారుచేశావు. నువ్వు బాధ్యతలేనివాడిక్రింద, సోమరిపోతులాగ తయారయ్యావు తెలిసిందా?"

"ఏమిటీ? నేను బాధ్యత లేనివాణ్ణని అంటావా? పైగా బేఫర్వా మనిషినా?..."

"అవును...నేను ఒక్కణ్ణేకాదు అల్లా అనుకుంటున్నది. సంపాదకవర్గమంతా అదేవిధంగా భావిస్తోంది. ఖోల్కోజ్‌లోని ప్రతీ కుర్రకుంకకు యీ విషయం తెలుసు. చవటదళం ఏదిరా...అంటె, "నీది" అని ప్రతీవాడూ అంటాడు. నీకేసే ప్రతీవాడూ "వేలెత్తి చూపిస్తాడు!"

"ఎవడి నోటికి వచ్చింది వాడు వాగుతాడు! ఆ వెధవలందరు చెబితే నువ్వు తలూపుతావా? చెప్పుకోవడం అంటె అది వేరే సంగతి! పేపరులో పట్టుకొని వేకడం అంటె అది చాలాదూరంపోయిన సంగతి; మహా దారుణమైన సంగతి!"

"ఊసుపోని కబుర్లగురించి పత్రిక అసలు పట్టించుకోదు పత్రిక చేసే విమర్శ ఎప్పుడూ ఖచ్చితంగా, ఉదాహరణలతో ఉంటుంది. ఇటువంటి ఖచ్చితమైన విమర్శ లేనిదే కార్మిక క్రమశిక్షణకోసం పోరాడటం అసాధ్యం. బేఫర్వా మనుషులను

పట్టుకొని పత్రిక నిశితంగా విమర్శించవలసిందే. వారి చర్యలను బట్టబయలు చేయవలసిందే. తప్పదు !"

గొనోమ్ ఉద్రేకంలో పడిపోయాడు. తాను సభలో ఉపన్యసించడం లేదనీ – ఎవరినైతే బేఫర్వా మనిషనీ, చాడీ కోరనీ ఖండించాలో, ఆ కెనిరీతోనే మాట్లాడుతున్నాననీ మరిచి పోయాడు. గొనోమ్ ఆఖరున అన్నమాటలతో కెనిరీ నిర్ఘాంత పోయి నోటమాట లేకుండా అయిపోయాడు. కొంచెంసేపు ఇద్దరు మౌనంగా కూచున్నారు.

"సరె...తప్పంటే విమర్శించవల్సిందే కాని, అవ మానించడానికి మీ కేం హక్కుంది ?" అని మళ్లీ అన్నాడు కెనిరీ.

"అందులో అవమానించటం ఏమీ లేదు." అని పునరుద్ఘాటించి, సిగరెట్ ముక్క క్రింద పడేసి కాలితో త్రొక్కి, గొనోమ్ హాల్లోకి వెళ్లిపోయాడు. కాపలా మనిషి "వచ్చేవారెవరో చప్పున రావాలి. సినిమా మొదలు పెడుతున్నారు" అని తొందరచేశాడు. కెనిరీ కూడా లోపలికి వెళ్ళాడు.

గొనోమ్ కూచున్నచోట ఖాళీసీట్లు ఏమీ లేవు. అందుచేత కెనిరీ వెళ్ళి అతని వెనకాల కూచున్నాడు. గంట క్రితం మంచిచోటే చూసుకున్నాడు గాని లాభం లేక పోయింది. గొనోమ్‌తో ఇంకా వాదన వేసుకోవాలని లోపలి నించి కెనిరీకి ఉక్రోషం పొంగుకొస్తూనే వుంది. వ్యంగ్యచిత్రం చూడ్డంతోనే వచ్చిన కోపతాపాలు ఈసారికి కొంత చల్లబడి నప్పటికీ మళ్ళీ అది లోలోపల రాజుకుని ఒక్కసారి భగ్గుమంది.

గానోమ్ చెవిలో నోరుపెట్టి ఆగ్రహం వెళ్ళగక్కుతూ "విమర్శగురించి ఉపన్యాసం దంచడం సులభమే. నీసంగతి మాత్రం ఏమిటి? గురువింద గింజలా మాట్లాడుతున్నావు. నీవుచేస్తున్నది విమర్శేనా? నువ్వు తోటికామ్రేడ్‌తో అవమానకరంగా మాట్లాడుతున్నావు. పైగా పెద్ద చిత్రకారుడిలా బయలుదేరావ్, బొమ్మలు గియ్యడానికి!"

"నే చెప్పేది విను...బొమ్మ గీసింది నేను కాదు."

"అయితే ఎవరు ఐనీసా?" "కాదు"

"మరి ఎవరు వేసింది? యిదంతా రింటుస్కీ మీదకు త్రోసివేస్తున్నారన్నమాట. నాకు తెలుసులే అతనికి బొమ్మలు గీయడం అసలే రాదు."

"నేను ఎవరిమీద త్రోసివేయనక్కరలేదు. సంపాదక వర్గ సభ్యులే వేశారని ఎందుకనుకోవాలి? బయటనుండి మాకు రచనలు పంపేవాళ్ళుకూడా ఉన్నారు.

"కాపాలామనిషి లైట్లు తీసివేశాడు. ఇక కొద్దిక్షణాల్లో సినిమా ప్రారంభమవుతుంది. కాని కెనిరీ గొణుగుడు మానలేదు.

"ఇదంతా నువ్వుచేసిన పనే. ఇంకెవరూ కాదు చేసింది. చెప్పడానికి ఎందుకు జడుపు?

"నేను ఎందుకు జడవాలి? సంపాదకుడుగా నాబాధ్యత ఉన్న విషయం నిజం సరె! ఎవరు వ్రాస్తే యేమిలే? నేను మాత్రంకాదు. వేసినవాడి పేరు వాల్కోర్..."

"ఏమిటీ? ఏమన్నావ్? ఎవడా "వాల్కోర్" వాడెక్కడ దొరికాడు నీకు? ఆ మనిషిపేరు మన ఈ వూళ్ళో

ఎప్పుడు వినలేదే? ఇదంతా నువ్వు అంటున్న మాయమాట తప్ప మరేంకాదు."

గానోమ్ దీనితో ఇక నవ్వు ఆపుకోలేకపోయాడు.

సినిమా ప్రదర్శకుడు ఎట్టివన్ స్విచ్ వేశాడు. తెరమీద బొమ్మలు రాసాగాయి. తెరమీద కెరటాలు లేచిపడు తున్న దృశ్యం వచ్చింది. అయితే, అది సముద్రం కాదు... నీరూ కాదు. ఒక ఖోల్కోజ్‌లో పంటసిరి తాండవించు తున్న దృశ్యం, చేలల్లో విరగపండిన ధాన్యం కంకులు గాలికి తలలూపుతూ కెరటాలుగా లేచిపడుతున్నాయి.

"నువ్వు దీనికి సంజాయిషీ చెప్పాలి." కెనిరీ గుర్రు మన్నాడు. 'ఎంత కష్టమైనా చెప్పితీరాలి. నీ ఉపన్యాసా లను అవతలపెట్టి ముందు సమాధానం యివ్వు"

"ఏమిటీ ఈ వెధవ నసుగుడు? నేను ఏమీ చెయ్య దలచుకోలేదు. ఏంచేస్తావు? అన్ని రుజువులు అయిన తర్వాతే నిన్ను పేపరులోకి ఎక్కించింది! నువ్వు ఇక గింజు కున్నా ఏమీ లాభంలేదు."

సరె, అల్లాగే ఎక్కించుదుగానిలే. ఆగు, తొందర పడకు!" అన్నాడు కెనిరీ.

"అబ్బబ్బ! ఏమిటా కాకిగోల...మేము ఇక ఏమీ చూడనక్కరలేదా? అని గామల్కాట్ అన్నాడు. "జనాన్ని నిశ్చింతగా సినిమా చూడనివ్వరా?"

చివరికి కెనిరీ నోరు మూసుకున్నాడు. చుక్చీజాతి వేట గాండ్రందరూ క్యూబన్‌కోసక్కుల గురించిన సినిమా చూస్తూ కూచున్నారు.

4 * * * *

తాను చాలా గొప్ప వేటగాణ్ణని కెనిరీకి మొదటి నుండీ చాలాగర్వం. ఎదటివాళ్ళు తన గురించి ఏమనుకుంటు న్నదీ అతనికేమీ పట్టేది కాదు. ప్రజలంటె లక్ష్యమూ లేదు. ఎందుకో అందుకు ప్రతివాడూ దుయ్యబట్టసాగేసరికి తన తెలివితేటలు చూసి కడుపు మంటకొద్దీ ప్రతివాడు అల్లా అంటున్నాడని అనుకోసాగాడు. తన సత్తా తెలియక అల్లా అంటున్నారని భావించేవాడు.

"పోనీ నీ వుద్దేశ్యం ప్రకారం నువ్వొక్కడవే తెలివి తేటలైన వాడవనుకొందాం. నీ దళంలో మిగిలినవాళ్ళందరూ ఎందుకు పనికిరాని మూర్ఖులనుకుందాము. అయితే ఈ మూర్ఖులే... తెలివిలేటలు గల్గినవాడికంటె బాగా పనిచేస్తు న్నారే? అదెలా సాధ్యమౌతుంది? అందరికంటె నీ సంపాదన తక్కువగా వుండటానికి కారణం ఏమిటి? నీ పిల్లలు కట్టుకున్న బట్టలన్నిటికీ మాసికలు వేసి వుంటాయి ఎందుచేత! ఆఖరికి నీ తండ్రి ముసలి ఒన్నా నీకంటె ఎక్కువ పనిచేసి చూపు తాడే? ఇదంతా ఏమిటి?"

ఈ అన్ని ప్రశ్నలకు కెనిరీ ఏవోకుంటిసాకులు చూపే వాడు. అవి ఏమాత్రం నమ్మదగినవికావని వాదిస్తాడు. అతని వాదనలు యివి:

"అసలు వేటాడ్డం ఫ్యాక్టరీలో పనిలాంటిది కాదు. వేటగాడికి ఒకోరోజున అదృష్టం కలిసివస్తుంది. ఒకోరోజున రాదు. ఒక్కొక్కడికి కలిసివస్తుంది. మరొకడికి కలిసి రాదు. కుర్రకుంకైనా అదృష్టం తగిలితే ... ఎలుగుగొడ్డును వెయ్యగలడు. మాంచి గడితేరిన వేటగాడు ఉత్తిచేతుల్తో

ఇంటికి రానూరావలసి వస్తుంది. నే చెప్పేది యింకొకటి వుంది : ఎవడికి చెప్పవలసినపని వాడికి చెప్పాలి. ఇష్టంలేనిపని చెబితే అటువంటిపని వాడు చచ్చినా సరిగ్గా చేయలేడు."

అయితే కెనిరీ చెయ్యదగ్గపనేమిటి ? ఏపనంటే అతనికి యిష్టం ? ఇంతవరకు మొత్తం ఖోల్కోజ్ సభ్యులెవరూ దీనిని తేల్చలేకపోయారు. అయితేం ఏమాట కామాటే చెప్పుకోవాలి. కెనిరీకి తుపాకిదెబ్బలో మాంచి గురివుంది. అట్టే వాళ్ళు కష్టపెట్టనక్కరలేని పని ఏదైనావుంటే అదిగాని... మరీ ధైర్యసాహసాలతో నిమిత్తంలేని పనిగాని ... అందరితో బాటే కెనిరీ కూడా మామూలుగానే చేస్తాడు.

ఇంకోవిషయం. అతని వుద్దేశ్యా లెప్పుడూ సరియైన దోవలోనే వుండేవి. అప్పటికప్పుడే అతనికి రెండు జోడాల కవల పిల్లలు, అంటె వెరసి నల్గురు పిల్లలన్నమాట...వారిని మాట వరసకేనా ఏమీ తిట్టేవాడుకాదు, అసలు కేకలేసేవాడేకాదు. వోడ్కా ఎప్పుడూ ముట్టుకొని ఎరగడు. అయితేం? ఇతరులకు త్రాగుడెంత దుర్వ్యసనమో...సోమరిపోతులా తిని తిరగడం ఇతనికి అంత దుర్వ్యసనం.

కెనిరీ చదరంగం బాగా ఆడగలడు. ఆ చుట్టుపట్ల అంతటి వస్తాదు లేడన్నమాటకూడా నిజమే. అసలు వున్నిటోపీ అలంకరణ మొదలుపెట్టింది కూడా అతడే, అంతకుముందు పవర్ స్టేషన్ మెకానిక్, కెలిల్జి ఒక్కడే ఉన్ని టోపీ పెట్టే వాడు. అదైనా బాగా వర్షాకాలంలో వర్షపు చినుకులు జుట్టుమీద పడకుంటూ రక్షణకోసమని పెట్టుకుంటూండేవాడు. కెనిరీ ఓరోజున ఇది చూసి పకాలున నవ్వాడు.

"ఉన్ని టోపీ అందచందాలను, ఆకర్షణీయంగా ఉండ టానికి తప్పితే జుట్టు తడవకుండా పెట్టుకోవడ మేమిటి ? ఈ టోపీ పెట్టుకుంటె గౌరవనీయుడులాగ, గొప్ప చదువుసంధ్యలు నేర్చినవాడిలాగ కన్పిస్తావు. దాన్ని పెట్టుకోడం ఎల్లాగో నా దగ్గర నేర్చుకో" అనేవాడు కెనిరీ.

కెనిరీ దళ నాయకుడు కెమిన్‌కు చదరంగం అంటె పెద్ద ఇష్టం లేదు. చెవులుకూడా కప్పివేసే ఒక బొచ్చుటోపీని పెట్టే వాడు. దళంలోని ప్రతీ సభ్యుడు నిజాయితీగా పని చేయా లని ఏవిధంగా కోరుతూవచ్చాడో కెనిరీనికూడా కెమిన్ అల్లాగే కోరుతూ వచ్చాడు. కాని కెనిరీ ఎప్పుడూ వళ్ళువంచి పని చేసేవాడుకాదు. కనికరం లేకుండా ఎదటివాడిచేత చావగొట్టి పనిచేయించేరకంగా కిమిన్‌ను కెనిరీ అర్థం చెప్పుకున్నాడు. కెనిరీ ఇటువంటి బద్ధకస్తుడవటంవలెనే గోడ వార్తాపత్రిక వ్యంగ్యచిత్రంలో ఎక్కవలసిన పరిస్థితి ఏర్పడింది.

ఒకసారి వూరికి దగ్గరలోనే మంచుపాతర నిర్మించ వలసిన పని కెనిరీ దళానికి యిచ్చారు. అది అసులభమైన పని కాదు. మంచుగడ్డతో బిగిసిన నేలను పగలగొట్టాలి. ఒక్కొక్క గడ్డ పెకలించే సరికి తన్నోడు బియ్యపు అన్నం అరిగిపోవలసిందే! వేసవిలోకూడా కరగకుండా, రాయికంటె గట్టిగా గడ్డకట్టిన మంచును పెకలించడం బహు కష్టం. ఏమై నప్పటికీ ఖోల్కోజ్‌కు సంవత్సరం పొడుగునా కావలసిన మాంసాన్ని ఆ మంచుపాతరలో వేసి ఉంచుతారు. ఈ పని ఎల్లాగైనా ఎగకొట్టాలని కెనిరీ ఎత్తువేశాడు. అందుకు అన్ని ఉపాయాలూ ఆలోచించాడు. చివరకి మంచు పగలగొట్ట

డానికి ఖోలోక్వెజ్ సామగ్రులనే నేజరు గామల్కాట్ ప్రేలుడు మందు తెప్పించాడ నేసరికి, అప్పుడు నేనూ వెళ్ళిపెద్దనే అంటూ కెనిరీ బయలుదేరాడు. ప్రేలుడు మందుతో సులభంగా మంచు పగలగొట్టవచ్చు. కష్టం ఉండదు. 'ఓ దళనాయకుడా! నేను మంచు త్రవ్వే కష్టమైన పనికి సంసిద్ధం. నాకుకూడా పనియివ్వండి!'' అని ఏమీ తెలియనట్టు కెనిరీ ఆఖరు క్షణాన వచ్చి అడిగాడు. తాను పెద్ద నిజాయితీపరుడనీ, కష్టించి పనిచేసేవాడనీ ఎదటివాళ్ళు అనుకోవాలి. అదీ కెనిరీ వ్యూహం. అనుకున్నట్టుగానే కిమిన్ చాలా ఆశ్చర్యపోతూ, కెనిరీని చూసి సంతోషపడ్డాడు.

కాని కెనిరీ ఆశలన్నీ తల్లక్రిందు లయ్యాయి. గునపం పట్టుకొని కెనిరీ ప్రదర్శన చేయనక్కరలేకుండానే ప్రేలుడు మందుతో మంచుగడ్డను పేల్చేశారు. కాని చేయవలసినపని మాత్రం యింకా వుంది. పెద్ద పెద్ద మంచు రాళ్ళను గోతుల్లోంచి తీసి బైట పడవేయాలి.

ఒక రోజు ఆ పని చేసేసరికి కెనిరీకి కాళ్ళు, చేతులు, నడుం లాగడం మొదలుపెట్టాయి. వెంటనే రెండు మైళ్ళ దూరంలో ఉన్న ఆర్కిటిక్ స్టేషనుకు వెళ్ళి అసిస్టెంట్ డాక్టర్ అలెగ్జి వాడిమిచ్ కి చూపించుకున్నాడు.

కెనిరీ ఈ ఆస్పత్రికి తరచు వచ్చేవాళ్ళలో ఒకడు. పైపెచ్చు డాక్టరుతో చదరంగం ఆడ నేర్చినవాడు కూడాను. ఈ 'రోగి' ని జాగ్రత్తగా పరిశీలించిన తర్వాత, అతను చెప్పు కొచ్చిన గాథంతా సవిస్తరంగా విన్నతర్వాత అసిస్టెంటు డాక్టరు ఇల్లా అన్నాడు :

"పాపం ! కండరాల బాధ కదూ...అవునవును. ఈ కండరాలున్నాయి చూశావూ......వూరికే కూచోబెడితే చెప్పిన మాట వినవు, తిన్నగా వుండవు...కొంచెం వాటికి పని చెప్పాలి. ఇంకొకరోజు నీవు గట్టిగా పనిచేశావో...ఈ నొప్పు లన్నీ మహా చక్కగా సర్దుకుంటాయి. పని మానేస్తివా...నీవు చెప్పినట్టు చస్తే వినవు...అంతేకాదు. నీకు కొద్దిరోజుల్లో బొజ్జ పెరిగిపోతుంది. ఏమంటావ్ ? సరె...ఇక మన చద రంగం ఆటసంగతేమిటి ? ఒక్క యెత్తు అయినా వెయ్యకుండా వెళ్ళిపోతావా ?"

మామూలు పరిస్థితుల్లో అయితే అయిదురోజులు ఆడ మన్నా ఆడేవాడు కెనిరీ. కాని డాక్టరు తన ఆరోగ్యంగురించి చెప్పిన ఎకసెక్కం మాట్లతో పచ్చి వెలగకాయ గొంతుకు పడ్డట్టుగాఉంది. "ఈ పాడు అనారోగ్యం ఉంది చూశారూ... మహా చెడ్డ బాధగా ఉందనుకోండి" అని కెనిరీ అంటూనే ఉన్నాడు. డ్రాయరులో వున్న చదరంగం బల్లను డాక్టరు బయటికి దీయడం, కెనిరీ ఇంకో స్టూలు జరుపుకొని ఎదురుగా చతికిలబడటం, యెత్తుమీద యెత్తులతో ఆట ప్రారంభం కావటం దానంతటదే జరిగిపోయింది. ఏకబిగిని అయిదు ఆట లాడారు. ఆట అయిపోయిన తరువాత కెనిరీ హుషారుగా యింటికి వచ్చాడు. అతని మనస్సు మేఘాలు లేని ఆకాశంలా నిర్మలంగా ఉంది. కాని, ఒక్క మూలమాత్రం ఒక నల్లటి మబ్బుతునక వచ్చికూచుంది. "తెల్లారితే మళ్ళీ ఆ మంచు ముద్దలు మోసి తగులడాలి. వెధవమోత...ఇది లేకపోతే

ఎంత హాయిగా ఉండును?" ఇదే కెనిరీ మనస్సులో కలక వేసిన బాధ!

మరుసటిరోజు మంచుపాతర దగ్గరకు వెళ్ళి, తవ్విన గోతిలోకి నెమ్మదిగా దిగాడు. అప్పటికప్పుడే అతని దళంలో వారంతా చకచకా పనిచేసుకుపోతున్నారు. వాళ్ళతోపాటు ఒక గంట పనిచేశాడో లేదో...అటుపైన దళనాయకుడి దగ్గరకు వెళ్ళి, కడుపు చేత్తో పట్టుకుని "ఇప్పుడే పది నిముషాల్లో వస్తా...కడుపు ఉబ్బుకొస్తోంది" అని అన్నాడు. సరేనని కిమిన్ తలవూపాడు.

చేతులతో కడుపు పట్టుకునే కెనిరీ వందగజాలు సముద్రపు ఒడ్డుకేసి నడిచివెళ్ళాడు. ఆ తర్వాత రాళ్ళగుట్టల వెనకాలకు పోయాడు. తిరిగివచ్చిన తర్వాత కొంచంసేపు పనిచేశాడు. మళ్ళీ దళనాయకుడి దగ్గరకు కడుపు చేత్తో పట్టుకొనివెళ్ళి...దీని నొప్పి తగలెయ్యా! కడుపులో ఏదోకుట్ర పెరిగింది కామోసు! మళ్ళీ బహిర్భూమికి వెళ్ళి రావాలయ్యా" అన్నాడు.

ఈ విధంగా ఆరోజల్లా కెనిరీ బహిర్భూమికి వెళ్ళివస్తూనే వున్నాడు. వెళ్ళిన ప్రతీసారి ఇరవై నిముషాలు పట్టేది. ఇదంతా చూసి "పోనీ...ఇంటికివెళ్ళి పోరాదూ?" అని కిమిన్ తనంత తనే అన్నాడు.

"నేనీవేళ ఇక్కడ ఎక్కువ వుపయోగపడలేను... అయినప్పటికీ అల్లాగే నెమ్మదిగా తంటాలుపడి ఓపికకొద్దీ చేస్తాను." అన్నాడు. ఇల్లాంటి వేషాలు వెయ్యడం కెనిరీకి బాగా తెలుసును. "ఇప్పుడు తన్ను సోమరిపోతని ఎవ

రంటారో అనమను చూద్దాం. ఒంట్లో బాగా లేకపోయినా తాను పని వదలిపెట్టకుండా చేస్తున్నవిషయం కళ్ళకు కనపట్టం లేదా ?"

అందరూ తన్ను "భేష్" అంటారని అనుకున్నాడు కెనిరీ లోలోపల. అందరూ తన్ను యింటికి వెళ్ళిపోవలసిందిగా బ్రతిమలాడతారని ఊహించుకున్నాడు. కాని వాస్తవం అది కాదుగా. అతనికి కడుపుబ్బనూ లేదు. కండరాలలోబాధ లేనూ లేదు.

బహిర్భూమికని పోయి రాళ్ళగుట్టల వెనుక 'హాయిగా కాళ్లుసాచుకొని కూచుని ప్రపంచం ఏమైపోతే నేం? అన్న ధోరణిలో కెనిరీ గడిపాడు. ఆ విధంగా కాలక్షేపం చేసి చేసి విసుగెత్తి ఏమి చేయడానికి తోచక తన వేటకత్తిని అటూ యిటూ ఎగరేసేవాడు. కత్తిని పైకి గాలిలో ఎగరవేస్తే వచ్చి నేలలో కూరుకుపోయేది. తనకు యెవరూ కనపడరు. ఒకానొకవేళ మంచుపాతరనుండి ఎవరైనా చూస్తే గుట్టల మీదనుంచి తలమాత్రం కనపడుతుంది...ఇక సముద్రపువైపు నుండి అంటారా? అక్కడంతా నిర్మానుష్యమే కదా! ఎక్కడో దూరంగా వలలువిప్పి ఆరేసుకునేవాళ్లు కాబోలు కొందరు కన్పిస్తున్నారు. ఆ వైపున ఇంకెవరూ లేరు. బహుశా ఆ దళం వృద్ధ మేమిల్‌ది కావచ్చు. వూహు మొదటి దళం ఎప్పుడూ ఆ ప్రాంతంలోనే వలలు ఆరేస్తూంటుంది. అయితే ఏమిటే...అంతదూరం నుండి మేమిల్ కెనిరీని చూడగలడా? ఒకవేళ చూశాడే అనుకుందాం. ఫలానా అని గుర్తు పట్టలేడుగా!

* * *

పిల్లి కళ్ళుమూసుకుని పాలుతాగుతూ, తన్ను ఎవరూ చూడటంలేదని అనుకున్నట్టు – కెనిరీ పని ఎగగొట్టి తన్ను ఎవరూ గమనించడంలేదని అనుకున్నాడు. కాని, రెండు విషయాలు మాత్రం! అతను మరచిపోయాడు.

మేమిల్ దగ్గర దూరదర్శిని ఉండటం పెద్దచిక్కు అయిపోయింది. అతని కూతురు ఇంగ్రిసీ అంతకు రెండురోజులు ముందే సెలవులకు ఖబరోవస్క్‌నుండి వస్తూ, నావికు లుపయోగించే దూరదర్శిని ఒకటి కొని తీసుకొనివచ్చింది. ఇది చాలా దూరం అనే దూరదర్శిని. మూర్ మార్కెట్‌లో కొన్నప్పటికీ, అది చాలా మంచిరకానికి చెందిన వస్తువ. తన తండ్రి దూరదర్శినిని తాను అనవసరంగా పోగొట్టిన విషయం ఆమె మరిచిపోకుండా, వచ్చేటప్పుడు జ్ఞాపకం పెట్టుకొని మరీ కొనుక్కొచ్చింది.

పాపం, ఈ విషయం కెనిరీకి ఏమి తెలుసు ? మేమిల్ చేతుల్లో దూరదర్శిని వుంటుందనీ, అతడు కెనిరీకి వచ్చిన కడుపునొప్పి ఎటువంటిదో వలలు ఆరేస్తు చూస్తాడని ఎల్లా వూహిస్తాడు ?

ఇక రెండో విషయం: మేమిల్ స్వతహాగా దేవాంతకుడు. ముసలివాడైనా అతని కళ్లు మహాతీక్ష్ణమైనవి. ఖోల్కోజ్‌లో ఏమూల ఏం జరుగుతూన్నదో అతనికి తెలియకుండా పోడానికి వీలులేదు. ఈ విషయం కెనిరీకి తెలియదా...అంటె, తెలుసును. తెలిసీ అజ్ఞానంలో పడిపోయాడు...మేమిల్ కంట బడ్డాడు !

*    *    *

ఆ రోజున వృద్ధ మేమిల్ ఎందుచేతనో కొంచెం పెంద లకడే సముద్రపు ఒడ్డుకు వెళ్ళాడు. సాయంత్రం అతని దళం చేపలవేటకు వెళ్ళాల్సివుంది. అందుచేత వలలన్నిటిని సరిచేసి ఉంచవలసివచ్చింది. ఎండకు, గాలికి వల చక్కగా ఆరిఉంది. అంతా బాగానేవుంది కాని వల తాడుకు కట్టిన జీలుగు బెండు ముక్కలు లేవు. ఎందుకైనా మంచిదని తన కూడా రెండు పెద్ద పెద్ద బెండుముక్కల్ని తీసుకొని వచ్చాడు. అవి వల తాడుకు కట్టడం మొదలుపెట్టాడు.

ఆ తరువాత దూరదర్శిని తీసి సముద్రం కేసి చూశాడు. సముద్రజలాల పైన ఏమీ కన్పించడం లేదు. అంతా నిర్మానుష్యంగా ఉంది. మరొక దిక్కుగా చూసేసరికి దూరంలో బాతుల గుంపు ఒకటి కనిపించింది. మరీ దూరంగా చూస్తే నీటిలో చిన్న జల పైకెతన్నుతూన్నట్టు కన్పించింది. 'తిమింగలం కాబోలు' అని మేమిల్ అనుకున్నాడు. "ఈ దూరదర్శిని లేక పోతే ఈ తిమింగలం జాడలు కన్పించేవి కాదుగదా" అనుకు న్నాడు.

దూరదర్శినిని క్రిందకు దించి తోలుపెట్టెలో పెట్టి బెండు ముక్కలను తాడుకు కట్టడం మొదలుపెట్టాడు.

ఈ శీతల సముద్రతీర ప్రాంతంలోనే మేమిల్ జీవితం యావత్తూ గడిచిపోయింది. తన జీవితంలో ఎన్ని ఎగుడు దిగుడులు, ఎన్ని సుఖదుఃఖాలు! మేమిల్ తన జీవితాను భవాల్ని ఏకరువు పెడుతూంటే గంటలతరబడి కూచుని విన వచ్చు. మేమిల్ జీవితకథ గురించి ఈసారి నేను సవిస్తరంగా

వ్రాస్తాను కాని, ఇప్పుడు కొన్ని ముఖ్యఘట్టాలు – గోడ వార్తా పత్రికకు సంబంధించినవి – మాత్రం చెబుతాను.

మేమిల్ జీవితంలో అధికభాగం దుర్భర దారిద్ర్యం లోనే గడిచింది. జీవిత వసంతకాలంలో అతను పడింది సుఖం కాదు, అష్టకష్టాలున్నూ. ఈ కష్టాలను వింటే నిజంగా సన్యాసం పుచ్చుకోవాలనిపిస్తుంది. కాని మేమిల్ అటువంటి అధైర్యపు మనిషి కాడు. కష్టాలను సైతం చిరునవ్వుతో ఎదుర్కొనే గుండె దిటవు కలవాడు. తాను ఏ కష్టాలూ పడనట్టు, తన జీవితం ఎంతో ఆహ్లాదకరంగా గడిచిపోయినట్టు మేమిల్ చెబుతూంటే, నిజంగా వినవలసిందే.

డాన్ ఖోల్కోజ్ స్థాపకుల్లో మేమిల్ ఒకడు. దాని మొదటి అధ్యక్షుడు కూడా అతడే. మేమిల్ నిరక్షరాస్యుడై వుండకపోతే మరొక అధ్యక్షుని ఎన్నుకోవలసిన పనికూడా ఖోల్కోజ్‌కు యింతలో ఉండేది కాదు.

వృద్ధమేమిల్‌కు చదువనూ, వ్రాయనూ రాదు. చుక్చి జాతి ప్రజలందరి వలెనే మేమిల్‌కు కూడా ఆ రోజుల్లో చదువు సంధ్యలకు అవకాశాలు లేవు. చివరికి అటువంటి అవకాశాలు ఏర్పడే సమయానికి మేమిల్‌కు క్షణం తీరికలేని పరిస్థితి ఏర్పడింది. చుకోట్కాలో సోవియట్ విధానాన్ని ప్రవేశపెట్టడానికి అహరహం కృషిచేశాడు వృద్ధమేమిల్. కులక్‌లతోటి, షామాన్లతోటి హోరాహోరీని పోరాడిందీ, ఖోల్కోజ్ స్థాపనకోసం తీవ్ర ప్రచారంచేసింది కూడా వృద్ధ మేమిలే! తాను చిన్నతనంలో చదువుకోడానికి ఎల్లాగూ అవకాశాలు లేకపోయాయిగనుక, ఈ తరం వాళ్ళు

వయోజనులైనా అక్షరంముక్క నేర్చుకోవాలని మేమిల్‌కు చెప్పరానంత పట్టుదలగా ఉండేది. కాని, ఇక తనకు అట్టి అవకాశమూ లేదు, అదృష్టమూ లేదు. అక్షరజ్ఞానం అభ్యసించడానికి తన జీవితాని కికపడదు.

ఖోల్కోజ్ వ్యవహారాలను ఎల్లకాలం చూడటం వృద్ధ మేమిల్‌కు అసాధ్యమైంది. కాని, కొత్తతరం తయారైనందున బాదరబందీ లేకపోయింది. వాన్చ్కో ఖోల్కోజ్‌కు అధ్యక్షుడుగా ఎన్నికైనప్పుడు మేమిల్‌కు ఏమీ కష్టంకలగలేదు సరి కదా, ఇదంతా తన కృషి ఫలితమేకదా అని ఎంతో సంతృప్తి కల్గింది. పైగా, తాను పోరాడించి ఎందుకు? వాన్చ్కో లాంటి కుర్రకారు అభివృద్ధి చెందడానికే గదా! అసలు వాన్చ్కోను ప్రోత్సహించిందీ, అనాదిర్ వెళ్ళి చదువుకోమన్నదీ ఎవరు? మేమిలే కదా! కొత్త అధ్యక్షుడుగా వాన్చ్కో ఎన్నికతో ఖోల్కోజ్ వ్యవహారాలన్నీ చకచకా అభివృద్ధి పొందసాగాయి. ఇక మేమిల్ సంగతంటారా? ప్రతీసారి అతనిని నేనే జిమెంటు బోర్డుకు ఎన్నుకోకుండా వదలడమే లేదు!

ఒకసారి వృద్ధ మేమిల్ చదువుకోడానికి ప్రయత్నించాడు. వయోజన విద్యా ప్రచార కేంద్రానికి హాజరయ్యాడు. కాని ఏమీ ప్రయోజనం లేకపోయింది. అందులో జేరిన ప్రతివారు ఎంతో ముందుకు వెళ్ళిపోయారు. ఇక వాళ్ళని అందుకోలేనని మేమిల్ అనుకున్నాడు. దానితో చదువు యత్నాన్ని విరమించేశాడు.

వేటగాండ్ర దళంలో చాలా ఎక్కువ శ్రమ, కాలము గూడా పట్టేది. ఖోల్కోజ్ అధ్యక్షుడుగా చాలాకాలం ఉండ

టంవలన చివరకు తుపాకీ పట్టుకోవడం, తెడ్లు వేయడం మర్చిపోతానేమో నని మేమిల్ అంటూండేవాడు. అతడు ఎప్పుడూ ఒళ్ళు దాచుకొని ఎరగడు. పైగా ఎన్నో యింటి బాధ్యతలు కూడా వుండేవి. తనకి వయస్సులోనే భార్యా వియోగం సంభవించింది. అందుచేత కూతుర్ని తానే చిన్నప్పటినించి పెంచి పెద్దదాన్ని చేయవలసివచ్చింది. దీనితోబాటు మేమిల్‌కు మరో 'దుర్గుణం' కూడా వుంది. ఏపని తలపెడితే దాంట్లోనే మునిగిపోయేవాడు. సమస్త ప్రపంచమూ మరిచిపోయేవాడు. కూతురు ఔగ్రిసీ ఒకసారి ఉల్లిపాయలు తీసుకొచ్చి మొలేసింది. అవి మొక్కలైతే చూసి మేమిల్ బ్రహ్మానందభరితుడైయ్యాడు. మేమిలే కాదు ఆ ఊళ్ళో వాళ్ళందరికి అది కొత్త వింతే. మేమిల్ ఒకోరోజున పొద్దస్తమానం ఆ ఉల్లికోళ్ళతో కూచునేవాడు. మరొకసారి దంతం నగిషీపనితో కూచునేవాడు. ఇంతకీ చెప్పొచ్చేదేమంటే వయోజన విద్యాశిక్షణ కేంద్రానికి వెళ్ళడం మానేశాడు. ఎప్పుడైనా సంతకం పెట్టవలసివస్తే నమూనాకు కూతురుచే వ్రాయించిన అక్షరాలు చూసి ఒక్కొక్క అక్షరమే వ్రాసేవాడు. కోల్హోజ్ అధ్యక్షుడుగా ఉండగానే మేమిల్ యీ సంతకం వ్రాసే పద్ధతి మొదలుపెట్టాడు. అగ్గిపెట్టెమీద ఒకచోట 'మేమిల్' అని ఔగ్రిసీ వ్రాసింది. సంతకం పెట్టవలసి వచ్చినప్పుడల్లా అగ్గిపెట్టె ముందుపెట్టుకొని జాగ్రత్తగా ఒకొక్క అక్షరమే గిలికేవాడు.

*  *  *

అయితే, మేమిల్‌కు అసాధారణమైన జ్ఞాపకశక్తి వుంది. అతనికి ఎన్నెన్ని కథలు, గాథలు వచ్చునో అంతులేదు. ఎన్నెన్ని నవలల్లోని కథలో అతనికి కంఠోపాఠం. ఇది అబద్ధమని మీకు తోచవచ్చు. కాని సోదర చుక్కీలగురించి వీసమెత్తు అతిశయోక్తి కూడా చెప్పరాదని నేను నియమం పెట్టుకున్నమాట నమ్మండి.

ఒగ్రినీకి చదువు వచ్చినప్పటినుండి తాను చదివిన ప్రతీ పుస్తకం, ప్రతీ విషయమూ తండ్రి దగ్గర ఏకరువు పెట్టడం ఒక అలవాటు అయింది. తన కూతురు పాఠాలు సరిగ్గా చదువుతోందో లేదో చూడటానికి అన్నీ వినేవాడు. చివరికి అతని కది ఒక ఆసక్తిగా తయారైంది. కూతురు చదివే ప్రతీ పాఠం, కథా అంటే చెవి కోసుకొనేవాడు. ఆ వూళ్ళోని బడిపంతుళ్ళకు తప్పితే మేమిల్‌కు వచ్చినన్ని కథలు ఇంకెవరికీ రావు. అక్షరంముక్క ఒక్కటే లేదు గాని మేమిల్‌ను బాగా విజ్ఞానం కలవాళ్ళలో ఒకడని చెప్పడానికి ఏమీ అభ్యంతరం లేదు. మేమిల్ అటువంటి అసాధారణ ప్రజ్ఞాశాలి!

*   *   *

ఇటువంటి మేమిల్ కంటబడిన కెనిరీ ఇక తప్పించుకొని పోగలడా? మేమిల్ తనకూడా తీసుకొనివచ్చిన జీలుగుబెండు ముక్కలను వల తాడుకు కట్టటం మొదలుపెట్టాడు. మూడు ముక్కలు కట్టి నాల్గవది కడుతూంటే అది చేతులోంచి జారి నీళ్ళలోకి గెంతినంత పని అయింది. మేమిల్ దానిని తీయడానికి ఒడ్డు అంచుదాకా వెళ్ళాడు. తిరిగివస్తూ తీరంవెంబడే

చూడగా, గుట్టలదగ్గర ఎవరో నక్కి కూచున్నట్టు కనిపించింది.

"ఎవరై ఉంటారూ ?" అని దగ్గర ఉన్న దూరదర్శిని పెట్టి చూసేసరికి, అక్కడ ఉన్నది కెనిరీ అని తేలింది. కెనిరీ దళం ఇక్కడకు దగ్గరలోనే మంచుపాతర వేస్తుందాలే ! అయితే, ఈ సోమరిపోతు కెనిరీ ఇక్కడ తగులడ్డాడెందుకు ? లేకపోతే, ఇది అన్నాలకు పోయేవేళ ఏమో ! లేకపోతే, వీడు ఒంటరిగా ఇక్కడెందుకు కూచుంటాడు ? మిగిలిన వాళ్ళందరు ఏమయ్యారు ?"

కొంచెం సేపుండేసరికి కెనిరీ లేచి బట్టలు దులుపుకుని, మంచుపాతరకేసి బయలుదేరాడు. దీనితో నేమిల్ మొదట పడిన ఉద్దేశ్యం మారింది. మరుసటిరోజు ఉదయం త్సెగ్రిసీ ఇంకా లేవకుండానే పెందలకడే వెళ్లి "నాల్గు చేపలనైనా పడదాం...ఖబరోవస్క్‌నుండి వచ్చిన తరువాత ఒక్కసారైనా కూతురు తృప్తిగా చేపలు తినలేద"ని నేమిల్ లేచాడు. చుకోటస్క్ సముద్రంలో దొరికే ప్రశస్తమైన సాల్మన్ చేప ఆమూర్‌లో దొరకవు. పెద్దసాల్మన్ పడితే గామెజ్‌ని ఇగ్రినిన్‌నీకూడా భోజనానికి పిలవాలని నేమిల్ అనుకున్నాడు.

బెండులుకట్టిన పిమ్మట వల అంతా సరిగా ఉందో లేదో నేమిల్ చూచాడు. ఇనపగుళ్ళు రెండుచోట్ల పోయాయి. వాటి స్థానంలో నాల్గు బొమ్మరాళ్లైనా కడదామని ఒడ్డుకు వెళ్ళేసరికి మళ్ళీ గుట్టల దగ్గర ఎవరో తచ్చాడుతూ ఉన్నట్టు నేమిల్‌కు కనపడింది. దూరదర్శిని పెట్టి

చూసేసరికి మళ్ళీ ఆ బడుద్ధాయి కెనిరీయే అక్కడపడి యేడు స్తున్నాడు.

కొంచెంసేపు అయినతరువాత మళ్ళీ వచ్చాడు కెనిరీ. ఇదేవిధంగా గంటగంటకు తిరగడం మొదలుపెట్టాడు.

ఈ బడుద్ధాయి యిలా ఎందుకు బలాదూరు తిరుగు తున్నాడు? బహిర్భూమికి వచ్చాడా? కాని అందుకు వచ్చి నట్టు కనపడదే! కెనిరీ గుట్టలచాటుకు వచ్చి కాలక్షేపం చేస్తున్నాడు తప్పితే వేరే ఏమీ లేదన్నమాట. వేటకత్తి పైకి ఎగరవేయడం; అది ఇసుకలో గుచ్చుకుపోవడం – మళ్ళీ తీయడం, ఎగరవేయడం – ఇదీ అతగాడి ఆట. పచ్చగడ్డిలో పడుకొని సిగరెట్టు పొగ వదులుతూ ఆకాశంకేసి చూస్తూ కెనిరీ కూచునేవాడు. పని ఎగవేయడానికి కెనిరీ ఎటువంటి ఎత్తుగడ వేశాడో మేమిల్‌కు అర్ధమైంది. పట్టలేని కోపంతో మేమిల్ కెనిరీకేసి పిడికిలి ఊపుతూ "సోమరిపోతు ముండా కొడకా! నీ సంగతి చెబుతానుండు. నీ బద్ధకం ఎగర గొట్టకపోతే నా పేరు మారుపేరు పెట్టు" అని పళ్ళు పటపటా కొరికాడు.

మేమిల్, కెనిరీ విభిన్నప్రకృతులు గల మనుషులు. అన్ని విషయాల్లోను వారికి హస్తిమశకాంతరభేదం వుంది. ఈ యిద్దరిమధ్య వున్న భేదం రూపంలోను, స్వభావంలోను అటుంచి నూతన జీవితం గురించినవారి దృక్పథాల్లో వున్న తేడాయే అత్యంత ప్రధానమైందని చెప్పవచ్చు.

నూతన జీవితం అంటే మేమిల్ దృష్టిలో డాన్ ఖోల్కోజ్, సోవియట్ పితృభూమి, ఉన్నతవిద్య నభ్యసిస్తున్న

తన కూతురు ఔగ్రిగినీ, నవజీవన పథంలో పురోభివృద్ధినందిన కొత్త తరపు చుక్చీ జాతి యువకులు కామ్చే, యున్వెనర్, ఇంకా వందలాది ప్రజలు, అన్నిటికంటే ముఖ్యంగా సుఖమయమైన తన వృద్ధాప్యం – ఇవన్నీ మేమిల్ కాళ్ళముందు వింత శోభతో ప్రకాశిస్తాయి.

ఈ నూతన జీవితమే లభించి వుండకపోతే వృద్ధ మేమిల్ ఏనాడో జీవితానికి సలాం కొట్టివుండేవాడు. తన తండ్రిని తాను అదేవిధంగానే కదా పరలోకయాత్ర పంపించింది! తన తండ్రి ఒక్కడేమిటి? ప్రతీ పేదకుటుంబంలోను వృద్ధుల గతి అంతేగదా? ఈ కాలంనాటి యువక తరానికి ఈ ఘోరమైన 'స్వచ్ఛంద మరణం" ఆచారం గురించి అసలు తెలియనే తెలియదు కదా! చెప్పినా వాళ్ళు నమ్మనే నమ్మరు కూడా!

"మునిమనమలు పుట్టేదాకా నీవు బ్రదికి ఉండాలి నాన్నా!" అని ఔగ్రిగినీ అంటుంది ఇప్పుడు. అది ఇప్పుడప్పుడే జరిగే మాటకాదు నిజమే. ఔగ్రిగినీకి ఇంతవరకు పెళ్ళేకాలేదు. అయితే వరుడు ఎవరో నిశ్చయం కాకపోలేదు. తన మనుమలకు తండ్రి ఎవరో వృద్ధ మేమిల్‌కు తెలుసును. తన స్నేహితుడు గామ్రాజ్ కొడుకు ఇగ్రిన్‌నే తన కూతురు ప్రేమించింది. అయితే, ఇప్పుడప్పుడే ఔగ్రిగినీ కడుపున నాల్గుకాయలు కాస్తాయా? ఆగాలి. అంతవరకు తాను జీవించి వుండగలడా? కానియ్! అదీ చూద్దాం. అంతవరకు తాను బ్రదకనని ఎందుకు అనుకోవాలి? ఇక సుఖప్రదమైన జీవితాన్ని తనంత తాను వదులుకునే తెలివితక్కువవాడెవడు?

ఇక కెనిరీ సంగతి: కెనిరీకి కూడా ఈ నూతన జీవితం మీాద రక్తి ఉంది. అయితే తన తాతముత్తాతలు ఎంతటి నికృష్ట జీవితం అనుభవించారో కెనిరీకి తెలియదు. ఈ నూతన జీవితంలో తనకు మమత వున్న విషయాలు ఎటువంటివి? క్లబ్బులో కూచుని పేకాట ఆడమంటె, షోకుగా బట్టలు వేసుకొని తిరగడమంటె ఇక అంతటి మొనగాడు లేడు సినిమాకు వస్తాడా! కాలుని సరిజేసుకొంటూ టోపీ ఏటవాలుగా పెట్టి 'పోజులు' పెట్టడం, ఇదీ వాడి లక్షణం.

అనేకసార్లు వృద్ధమేమిల్ కెనిరీని కూకలేశాడు. మంచి దోవలోకి తీసుకురావాలని చూశాడు. ఖోల్కోజ్ పనుల్లో ప్రవేశపెట్టి బాగుచేయాలని మహా తంటాలుపడ్డాడు. కేకలు వేశాడు. నయానా భయానా చెప్పిచూశాడు. బుజ్జగించాడు. కాని, కెనిరీ బుర్ర ఏ మాత్రం తిరగలేదు. నిక్కచ్చిమనిషి వామీాచ్గూడా చాలా ప్రయత్నించి చూశాడు. కాని, ఏమీా లాభం లేకపోయింది. వామీాచ్ అనేక విషయాల్లో అనేక విజయాలు సాధించాడు; అనేక విషయాల్లో మేమిల్ను మించిపోయాడు. కాని, కెనిరీని ఖోల్కోజ్లో ఉత్తమ సభ్యునిగా మాత్రం తయారు చేయలేకపోయాడు.

మేమిల్ ఎదురుపడితే చాలు – తప్పించుకుపోటానికి కెనిరీ చూసేవాడు. చాటుగా తిట్టుకునేవాడుకూడా... "ఈ వంకరచెయ్యి ముండాకొడుకు ఎక్కడ దొరికాడు" అని. వాస్తవానికి మేమిల్ కుడిచెయ్యి చూపుడువేలికి గాయం తగిలి వంకరపోయింది. మాట్లాడేటప్పుడు మేమిల్ కుడిచేయి ఊపుతూండేవాడు. ఇదంతా కెనిరీకి ఎల్లా వుండేదంటే డేగ తన

ముక్కుతో ముందుకు, వెనక్కు వూగుతూ పొడవటానికి సిద్ధంగా వున్నట్టుండేది. ఒక్క కెనిరీకి మాత్రమే యిల్లా అనిపించడం విచిత్రమే. ప్రతీవాడికి మేమిల్ అంటే చాల యిష్టమే. మేమిల్ తన జీవితానుభవాలు చెప్పడం మొదలుపెడితే రాత్రి తెల్లవార్లూ అందరూ వింటూ కూర్చునేవారు.

మంచుపాతర తవ్విన రోజున పని ఎగగొట్టగల్గినందుకు ఉబ్బి తబ్బిబ్బు అయి కెనిరీ యింటికి తిరిగివచ్చాడు. తాను ఎంత తెలివితేటలుగా దళంలోవారి నందరిని మస్కా తినిపించాను అని మురిసిపోతున్నాడు. మేమిల్ కిమిన్‌ను యీ విషయం అడగనే అడిగాడు. అసలు విషయం ఏమిటో తేల్చుకున్నాడు. ఈ బడుద్ధాయికి ఎల్లా గుణపాఠం నేర్పాలా అని రోజుల్లా ఆలోచిస్తూనే ఉన్నాడు.

ఈ విషయం వామ్చాతో చెబుదామా ? అతని గొడవలు అతనికి బోలెడు. పోనీ ఈ విషయం సమావేశంలో చర్చకు ప్రవేశపెడదామా ? మళ్ళీ సమావేశం ఎప్పుడు జరుగుతుందో ! మేనేజిమెంటు ముందుకు కెనిరీని పిలిపిస్తే ? మేనేజిమెంటుకూడా ఎన్నిసార్లో చెప్పారు ? చెబితే మాత్రం ఏం లాభం ?

ఆలోచించినమీదట కెనిరీ సంగతి గోడ వార్తా పత్రికలో ఎక్కించితే బాగుంటుందని మేమిల్‌కు తట్టింది. ఇంత వరకు ఈ పద్ధతిని అవలంబించలేదు. ఈసారి ఈ ఆయుధం కూడా ప్రయోగించుదామని నిశ్చయించుకున్నాడు. తన తోటి మిత్రుడు గెమాజ్ దగ్గరకు వెళ్ళి మాట్లాడి ఆ తరువాత గానోమ్ దగ్గరకు వెళ్ళాడు. "సరే...స్కూలు దగ్గరకు

సాయంత్రం రండి. గోడ వార్తాపత్రిక ఈ సంచిక ఇంచుమించు పూర్తిఅయింది. మీ రక్కడకు వస్తే సంపాదకవర్గ సభ్యులు అందరూ అక్కడికే వస్తారు," అని గొనోమ్ అన్నాడు.

అనుకున్న ప్రకారం సాయంత్రం మేమిల్ స్కూలుకు వెళ్ళాడు. అప్పటికప్పుడే సంపాదకవర్గ సభ్యులు పని హడావుడిలో వున్నారు. సముద్రంలో తేలిపోతున్న పెద్ద మంచు దిమ్మలా గోడ వార్తాపత్రిక కాగితం తెల్లగావుంది. చుట్టూ మోకాళ్ళమీద ఆనుకుని వార్తాపత్రికలో వ్రాస్తున్నవాళ్ళని అలంకరిస్తున్నవాళ్ళని చూస్తే మంచుదిమ్మమీదకు ఎక్కుతున్న సీలు జంతువుల్లా వున్నారు.

ముత్యాల్లాంటి అక్షరాల్తో పత్రిక వ్రాతపని అంతా ఐనిన్ పూర్తిచేశాడు. గొనోమ్ రంగు, బ్రష్ పుచ్చుకొని శీర్షికలు చక్కగా దిద్దాడు. సచిత్ర పత్రికలనుంచి కత్తిరించిన బొమ్మలను రింటుప్ఫీ అతికించాడు. మేమిల్ రావడం వలన రింటిప్ఫీకి అతడితో మాట్లాడే నెపంతో కొంచం ఊపిరి పీల్చుకోటానికి తలెత్తాడు. అతడికి ఈపని కొత్త. తుపాకీ పట్టుకొని వేటాడమన్నా, బోటు వేసుకొని రోజులతరబడి తిరగమన్నా అతనికి అలసట లేదుగాని కుంచె, రంగులు, కత్తెర పుచ్చుకొనేసరికి ఎక్కడలేని అలుపూ వచ్చింది. బొమ్మలన్నీ అతికించి, శీర్షికలను వ్రాసేసరికి అతనికి చెమట్లు పోశాయి.

రావడంతోనే, మేమిల్, కెనిరీ గురించిన విషయమంతా పూసగుచ్చినట్టు చెప్పాడు. "నా కిదంతా వ్రాసి కాగితంమీద

పెట్టడం చేతకాదు. మీరు వ్రాసుకోవలసిందే. నన్ను వ్రాయమంటే ఒక బొమ్మ మాత్రం వేస్తాను" అన్నాడు.

మేమిల్‌ను ఒక డెస్కు దగ్గర కూచోమన్నాడు. పెనిసిళ్ళు, కాగితం, రబ్బరు యిచ్చారు. మళ్ళీ గోడవార్తా పత్రిక వ్రాతపనిలో మునిగిపోయారు. చిత్రలేఖనం, దంతపు పని ఒకే రకం పని కాదని మేమిల్ వెంటనే గ్రహించాడు. అంతకు ముందు చిత్రలేఖనం అంటె "సులువే - పెద్ద కష్టమేమీ లేదు" అనుకొనేవాడు. ఏదైన తప్పువస్తే, రబ్బరు సహాయంతో చెరుపవచ్చు; మళ్ళీ గియ్యవచ్చు. దంతపు పని అల్లాకాదు. ఉలి కొద్దిగా ఒక పక్కకు వెడితే పెచ్చు వూడిపోతుంది. పెన్సిల్ పట్టుకున్న తర్వాతగాని, చిత్రలేఖనంలోని సాధక బాధకాలు ఏమిటో తెలియలేదు. పెన్సిల్‌ముల్లు విరిగిపోవచ్చు. నొక్కి రాస్తే కాగితం చీనుకుపోవచ్చు. ఒకోసారి పెన్సిల్‌గీత బ్రరె గీతలా పడి రబ్బరుకు చెరగకపోవచ్చు.

పది కాగితాలు పాడుచేసి ఒక గంట శ్రమపడితే ఒక బొమ్మ తయారైంది. బొమ్మ గీయటంలో మునిగిపోయిన మేమిల్ తన వెనకాలకు యెవరువచ్చి నుంచున్నారో కూడా చూడలేదు. ఐనిస్, గొనోమ్, రింటుప్గీలు బొమ్మనుచూసి పెద్ద పెట్టున నవ్వుతూ "భేష్ ! బలేగా వుంది అన్నారు.

"అద్భుతం" అన్నాడు ఐనిస్. "మేమిల్ మామా ! నీ చేతిలో ఎంతపని ఉందయ్యా ! ఈ బొమ్మను మా పత్రిక

లోనే వేసేద్దాం. చిట్టచివరికి మన ఖోలోడ్జ్‌కు స్వంత 'కుక్రినిక్సీ'* తయారయ్యాడు.

కుక్రినిక్సీ అనేమాటకు అర్థం ఏమిటో వృద్ధ మేమిల్‌కు తెలియను. తన్ను అభినందించడానికి అన్న మాటగా అర్థం చేసుకున్నాడు.

* * *

ఇదీ గోడ వార్తాపత్రిక వ్యంగ్యచిత్రం తయారవడానికి వెనుకనున్న కథ. దీనినే గొనోమ్ "ఆదర్శ విమర్శ" అని పేరు పెట్టాడు...తనమీద ఇది దుష్ప్రచారం చేయడమే నన్నాడు కెనిరీ. కాని కెనిరీకి నిజం ఏమిటో తెలియకనా? అది దుష్ప్రచారమో, వాస్తవిక సత్యమో అతగాడికి తెలుసు. నిజమైతేంగాక తనకు రుచించనప్పుడు. కెనిరీకి ఇది అప్రియ సత్యం గావడంలో అబ్బురం ఏమీలేదు. సినిమా తెరమీద బొమ్మలు కదులుతున్నాయేగాని కెనిరీకి ఏమీ కన్పించడంలేదు. కుర్యాబాన్ కోసక్కులు చండప్రచండంగా గుర్రాలమీద స్వారీ చేస్తున్నా, అతనికి ఏమీ హుషారే లేదు. కార్టూను విషయమే బుర్రలో మెదులుతోంది.

"ఇది వీళ్ళకేవిధంగా తెలిసింది? కిమిన్‌కు నా విషయం అనుమానం కల్గడానికే ఆస్కారంలేదు. యింటికి వెళ్ళిపొమ్మని కూడా అన్నాడు. మిగిలినవాళ్లకు అసలు అనుమానం కల్గలేదు. "పాపం కడుపులో పోట్లు వచ్చాయా... ఏదైనా

---

* కిప్రినోవ్, క్రిలోవ్, నికొలాయ్ సొకొలోవ్ ముగ్గురూ సోవియట్‌లో గొప్ప వ్యంగ్యచిత్రకారులు. వీరి పేర్లలో మొదటి అక్షరాలు కలిపి 'కుక్రినిక్సీ' అని పిలవడంకద్దు.

మందు వేసుకో...కాపడంపెట్టు...వెళ్ళిపడుకో" అని అందరు సలహాలు చెప్పారు.

తనమీద ఆనాడు ఎంత జాలికల్గేట్టు చేసుకున్నాడో - నిజవిషయం బైటపడేసరికి అందరికి అంత నిరసనభావం కల్గినట్టు కెనిరీ గ్రహించాడు.

"ఇంతకీ తన రహస్యం ఏవిధంగా బయటపడింది? ఆ "వాల్కోర్' అన్నవాడు నన్ను చూడటం ఎట్లా తటస్థ పడింది? వాడెక్కడా కనపడలేదే? అంటే ఆ కుంటిచెయ్యి వాడే చూసి ఉండాలి. ఆఁ...అవును ఆ ముసలి ముండా కొడుకు పనే అయివుంటుంది. లేకపోతే యింకెవరు చూస్తారు? ఈ ముసలాడే "వాల్కోర్" అన్నవాడికి అంతా చెప్పి వుంటాడు. అందుమీదట "వాల్కోర్" ఈ బొమ్మ గీసి వుంటారు.

సినిమా మొదటిభాగం అయిపోయింది. ఇంటర్వెల్‌లో కెనిరీ బైటకు వచ్చాడు. అతనికి సినిమాలో కూచోవాలని లేనేలేదు. బయలుదేరి రెండడుగులు వేసేసరికి వెలనకాల యెవరో పిలిచారు.

"ఏమండోయ్, కెనిరీగారూ! బహిర్భూమికి గుట్టలకేసి బయలుదేరారా ఏమిటి?" ఆ తర్వాత మాటలు వినపడలేదు నవ్వులే వినిపించాయి. "అయితే వీళ్ళందరు గోడ వార్తా పత్రిక చదివారన్నమాట!" కెనిరీ యీ ఎగతాళికి ఏమీ సమాధానం చెప్పలేదు. అక్కడ కాపలాదారుని లైబ్రరీగది తెరవమన్నాడు. తన టోపీ అక్కడ మరిచిపోయాననీ, తీసుకోవాలనీ అన్నాడు.

ఇద్దరు కలిసి లైబ్రరీలోకి వెళ్ళారు. టోపీ చిలక కొయ్యకు వేళ్ళాడుతోంది. గానోమ్‌తో మాటల సందడిలో మరిచిపోయాడు. టోపీ తీసుకొని బైటకు వచ్చేటప్పుడు గోడ వార్తా పత్రిక దగ్గర మరొకసారి ఆగి, వ్యంగ్య చిత్రం కేసి మరోసారి చూసుకున్నాడు. తనమీద వ్రాసిన వ్యాసంకూడా చదువుకున్నాడు.

జేగురు వర్ణంలో కొండగుట్టలున్నాయి. వాటి వెనకాల నుంచి రెండు తలలుగల తన చిత్రం ఉన్నది. ఒక తల గుట్టల కేసి చూస్తోంది. ఆ మొహం ఆముదం తాగినట్లుగా ఉంది. చిట్లించుకున్నట్టుంది. మరో తలకాయ కొంచెం వంచినట్టుగా ఉంది. గుట్టవెనకాల దించుకుంటున్నట్టు ఉంది. ఆ మొహంలో ఏదో చిద్విలాసం, ముసిముసి నవ్వులు నవ్వుతున్నట్టు ఉంది. ఆముదం తాగినట్టు మొహాన్ని చిత్రించడంలో ఎంత వ్యంగ్యం చేకూర్చాడు ఆ చిత్రకారుడు! కడుపునొప్పి ఆ మొహంలో కొట్టవచ్చినట్టు చిత్రించడంలోనే ఆ నేర్పంతా ఉంది. ఆ ముసి ముసి నవ్వులు వెనుక ఎంత గర్వం, ఎంత అహంభావం కన పడుతోంది! ఎదటివాళ్ళను మస్కాకొట్టించగలననే భావం కూడా ఉట్టిపడుతోంది! కెనిరీ చేసిన మోసం ఇప్పుడు బైట పడిపోయింది. దీనితో మరింత నగ్నంగా చిత్రంలో వ్యంగ్యం ద్యోతకమైంది.

కెనిరీ దృష్టిలో ఈ చిత్రం తనవలె లేనేలేదు. కాని ప్రతీవారు అది కెనిరీలాగనే ఉందని అంటున్నారు. చూసీ చూడ్డంతోనే అది కెనిరీ బొమ్మేనని అంటున్నారు.

చిత్రం క్రింది వ్యాసం గొనోమ్ వ్రాశాడు. దాంట్లో ఎంతమాత్రం హాస్యం లేదు. దాని శీర్షిక ఇలా ఉంది: "బద్ధకస్తుడా! సిగ్గు సిగ్గు" అందులో ఇంకా ఇలా వుంది.

"మంచుపాతర నిర్మించుతూండగా కిమిన్ దళంలోని సభ్యులందరు స్టైఖనోవైట్లుగా పనిచేశారు. ఓన్నా అనే వేటగాడు ముసలితనంలో ఉన్నప్పటికీ ఎంతమాత్రం వెనుదీయక చాలా చైతన్యంతో శ్రమచేశాడు. యువక మోటారు డ్రైవరు ఇగ్రిన్ కూడా ఆదర్శవంతంగా పనిచేశాడు. దళనాయకుడు కూడా మంచి ఆదర్శం నెలకొల్పాడు. తాను చేశాడు; ఇతరు లందరిచేత పనిచేయించాడు. దళం అందరిలోను ఒక్క సభ్యుడు మాత్రం సరిగా ప్రవర్తించలేదు. ఇతరులు పనిచేస్తే ఆ ఫలితం అనుభవించడానికి మాత్రం అతడు సంసిద్ధం. మిగిలిన అందరూ కష్టించి పనిచేశారు. ఇతడు కార్మికక్రమశిక్షణను ఉల్లంఘించడానికి వెనుదీయలేదు. మాటమాటకి బహిర్భూమి పేరు చెప్పి పని ఎగకొట్టాడు. గుట్టలచాటుకని వెళ్ళి అక్కడ కాలక్షేపం చేయడమేకాక ఇతరులు నిస్వార్థంగా పని చేస్తోంటే తానేదో గొప్ప పని చేస్తున్నట్లు అక్కడ కేరింతాలు కొడుతూ కూర్చున్నాడు. కేవలం పని ఎగవేసి సోమరిపోతులా కూచుందామనే ఉద్దేశ్యంతో తప్ప మరొక కారణం ఏమీలేదు. ఇటువంటి సోమరిపోతుతనానికి ఎట్టితావు లేకుండా చేయాలి."

కెనిరీ యీ వ్యాసాన్ని చివరిదాకా చదివాడు. కక్షతోటి పళ్లు కొరుక్కున్నాడు. కాని అంతలోనే కాసలా దారుని కేసి చూసి ముఖంలో చిరునవ్వు తెచ్చుకొని, కూని

రాగం తీస్తూ బైటకువచ్చాడు. నాల్గుఅడుగులు వేసేసరికి ఆ చిరునవ్వూ మాయమైంది. ఆ కూనిరాగమూ ఆగిపోయింది.

* * *

సముద్రంలోకి చొచ్చుకొని వున్న డాన్ ఖోల్కోజ్ నివాసప్రాంతంమీద సూర్యుడు తన అరుణకిరణాలను వెదజల్లు తున్నాడు. ఆవేళ వాతావరణం వేడిగా వుంది. గాలి కొంచ కొంచంగా వీస్తోంది. దక్షిణపుగాలి అయినప్పటికి అందులో చల్లదనం ఎంతమాత్రం లేదు. మంచుతోవున్న ద్వీపకల్పం ఎండలో మెరుస్తూవుంది. బాతులు గుంపులు గుంపులుగా విహరిస్తున్నాయి. అయినా వాటిని యెవరూ యిప్పుడు వేటాడటంలేదు. ఉండి ఉండి ఎవరైనా ఒకరు వడిసెల దెబ్బ కొడితే ఒక్కొక్క బాతు పడుతోంది.

ఇప్పుడెవరూ సాధారణంగా వేటాడరు. ఒకానొకవేళ వేటాడితే దగ్గర చిన్న ద్వీపంలో చేరిన నీటికాకి గుంపు చెదిరి పోతుందని ఎవరూ తుపాకి పేల్చరు. తుపాకులన్నీ బాగుచేసు కొని వేటాడే ఋతువుకోసం కాసుకొంచున్నారు.

బోటులకు చర్మపు తొడుగులు వేస్తేనేకాని సరిగ్గా పని చేయవు. సముద్రపు ఒడ్డు వెంబడే జనం బోట్లు మరమ్మతు పని చేసుకుంటూ ఉన్నారు. వృద్ధమేమిల్ గుట్టలనుండి నీటికాకి గుంపులను అల్లంతదూరంలో చూచి తిరిగి వస్తున్నాడు. అతని మెడలో దూరదర్శిని వ్రేలాడుతోంది.

నుదుటిమీద చేరిన స్వేదబిందువులు ఎండలో ముత్యాల్లా మెరుస్తున్నాయి. చిన్నచిన్న కాల్వలుగట్టి ముడు తలు పడిన చర్మంమీద దొర్లుతూ క్రిందకు ప్రవహిస్తున్నాయి.

వస్తూవస్తూ 'యంగ్ హంటర్స్' దళం దగ్గర మేమిల్ ఆగాడు. రింటుల్గీ, అతని దళనాయకుడు యున్నెనర్ అక్కడ పనిచేస్తు న్నారు. యున్నెనర్ గామల్కాట్ కొడుకు. వాళ్ళతోటి కొంతసేపు మాట్లాడి, సీటెకాకి గుంపు అక్కడ మకాంవేసిన సంగతీ, సందర్భం చెప్పాడు. అతడు చెప్పిన సంగతులు నిజ మైన వేటగాళ్ళకు మాత్రమే అర్థమవుతాయి. రింటుల్గీ, యున్నెనర్ ఇద్దరూ చెప్పుకోదగ్గ వేటగాళ్ళే. ఇంకా నాలుగు అడుగులు వేసి, అక్కడ ఇసుకలో చతికిలబడ్డాడు. అక్కడ కెనిరీ పనిచేస్తున్నాడు.

"గుడ్ మార్నింగ్, కెనిరీ!"

"గుడ్ మార్నింగ్."

"ఏమిటి? నువ్వు ఒక్కడవే పనిచేస్తున్నావేమి? కష్టం కదూ?

"దళనాయకుడు ఇగ్రిన్‌ను నాకు సహాయం చేయవల సిందిగా పంపాడు" కాని అతని ఆరె పదునుపోయింది పదును పట్టించుకు రావడానికి వెళ్ళాడు."

ఈ మాట ఎంతో గర్వంతో చెప్పాడు. బోటు మరమ్మతు చేయడంవంటి ముఖ్యమైన పని ఇంకెవరకీ గాక తన కొక్కడికే యిచ్చిన సంగతి ఈ "కుంటిచెయ్యి" మనిషి చూడాలని ఆతని ఉద్దేశ్యం. సోమరిపోతు, బడుద్ధాయి అని తనని యిష్టంవచ్చినట్లు పిలిస్తే పిలవవచ్చు. కాని బోటు మరమ్మతు పని వస్తే అందరినీ వదిలేసి తనకే ఎందుకు యిచ్చారు? ఇగ్రిన్‌లాంటి స్టెఖనోవైట్ ఈవేళ తన క్రింద పనిచేయవలసివచ్చింది. దళంలోనివారి సామర్థ్యం ఏమిటో

మిగిలినవాళ్ళకంటె దళనాయకుడు కిమిన్ కే బాగా తెలుసునని దీనితో రుజువు కావాలి.

"పని పురమాయించడంలో కిమిన్ మాంచి అందెవేసిన చెయ్యన్నమాట" అని మేమిల్ అనుకున్నాడు. బోటు మరమ్మతు విషయంలో బహుశా కెనిరీ మంచి నేర్పరితనం కలవాడై యుండవచ్చును. అతనికి యీ పని బాగా తెలిసి వుండవచ్చును. వేట, మంచుపాతర అయితే వళ్ళువంచి పని చేయాలి. పడవకు పైన చర్మంవేసి కుట్టడానికి అంత వళ్ళు విరుచుకొని పనిచేయనవసరంలేదు. పనివాడితనం ముఖ్యం. కెనిరీవద్గర పనివాడితనం వుంది. అతను పనిచేస్తూంటేనే ఆవిషయం కనపడుతూంది."

"అదీ...పనిచేసే పద్ధతి అంటె..." అన్నాడు మేమిల్. కెనిరీ పనిని మెచ్చుకుంటూ ఆరెగుచ్చి తడిపిన చర్మాన్ని పడవకు కుడుతున్నాడు కెనిరీ. తడిసిన ఆ తోలు అటునుంచి యిటుచూస్తే కనిపిస్తోంది.

కాని, యీ సారి మేమిల్ పొరబడ్డాడు. పడవకు చర్మం అతికించడంలో కూడా చాలా నేర్పుండాలి. అంతే కాదు; చాలా ఓర్పు ఉండాలి. ఏ మాత్రం ఏమరుపాటున పొడిచినా చర్మం పిగిలిపోయి వూరుకుంటుంది. రెండు పొరల్లో ఒక పొర లోపలికంటూ ఆరె దిగాలి. రెండో పొర సగంవరకు మాత్రమే దింపి, దారం అక్కడనుండి పైకిరానివ్వాలి. రెండవ పొర లోపలికి, పూర్తిగా దింపితే పడవలోపలికి నీళ్ళు వచ్చేస్తాయి. ఒర్పు లేనివాడు కుట్టు మొదలుపెట్టాడంటే, ఇక

ఆ పడవ ఎందుకూ పనికిరాదు. మనసు అల్లకల్లోలంగా ఉండే మనిషికి ఓర్పు, నిదానం ఎల్లా ఉంటుంది ?

మేమిల్ ఇల్లా పొగడటం చూసి, కెనిరీ తలెత్తి చూశాడు. మేమిల్ మెడలో ఉన్న దూరదర్శిని కనిపించింది. దానితో కెనిరీ ఇక ఉండబట్టలేకపోయాడు. తన రహస్యం బైటకు లాగింది ఎవరో అర్థమైపోయింది. ఉన్న సందేహం కాస్తా తొలిగిపోయింది. మేమిల్ ముండాకొడుకే తన గుట్టు బైటపెట్టాడు.

"కొంచెం విశ్రమించు కెనిరీ !" అని అన్నాడు మేమిల్ నుదుటి చెమట తుడుచుకుంటూ. "చాలా ఎండగా ఉంది. చెమటలు ధారాప్రవాహంగా కారుతున్నాయి. ఈ ఎండలో మైనంముద్దలా కరిగిపోయేటట్టు వున్నావు."

ఈ మాటల్లో కెనిరీ అంటె సానుభూతి తప్ప మరొకటి ఏమీ లేదు. కాని కెనిరీకి ఇది మరో విధంగా అనిపించింది. మైనం ముద్దతో తన్ను పోల్చడం అతనికేమీ రుచించలేదు. అసలు విషయం దగ్గరకే వచ్చాడు సూటిగా.

"నా గురించి ఆట్టే బాధపడనక్కర్లేదులే...నా కేమీ ఎండగా లేదు. అసలు నన్ను పేపరులో ఎక్కించింది ఎవరో చెప్పు ? నా గురించి కట్టుకథలు మీకు ఎవరు చెప్పారు ?"

"నీ గురించి కట్టుకథలు నే నెందుకు చెప్పాలి. నేను ఒకళ్ళగురించిన కట్టుకథలు చెప్పను. ఉన్న నిజ విషయాన్ని మాత్రమే చెబుతాను. నీ వ్యంగ్యచిత్రాన్ని గీసింది నేనే. నేను నీ గురించిన సమాచారాన్ని ఎవరిదగ్గరనుండీ సేకరించ లేదు.

"నువ్వేనా ?... నువ్వేనా ?" కంగారుపడిపోయాడు కెనిరీ.

" అవును...నేనే " అన్నాడు నిమ్మకు నీరెత్తినట్టు మేమిల్.

వ్యంగచిత్రం తానే వ్రాసిన విషయం దాచుకోవాలని మేమిల్ ఎప్పుడూ అనుకోలేదు. కులక్ లు ఉన్న కాలంలో సైతం తన్ను చంపేస్తామనివాళు బెదిరించినా మేమిల్ నిర్భయంగా తన ఉద్దేశ్యాలను వెల్లడిస్తూండేవాడు. మేమిల్ పిరికి రకం కాదు. వ్యంగ్యచిత్రం వేసి దాని రచయిత ఎవరో క్రింద వ్రాయవచ్చు. ఈ విషయం మేమిల్ కు తెలియదు. ఇంత వరకు ఎవరూ అతనికి చెప్పలేదు. అందుచేతనే ఈ వృద్ధుడు నిమ్మకు నీరెత్తినట్టుగా తన పేరు చెప్పేడు. కెనిరీకి ఈలోగా లోలోపల మండిపోతోంది.

"ఓహో! అదన్నమాట అసలు సంగతి...బాగుంది... బాగుంది"అని వణుకుతున్న చేత్తో కుడుతూనే కెనిరీ అన్నాడు. విషయం చాలా గొప్పగావుంది. అయితే ఆ "వాల్కోర్" ఎవరు ?

"ఏమిటి ? ఏ వాల్కోర్ ?"

"వ్యంగ్య చిత్రం వేసింది నువ్వని గానోమ్ చెప్పలేదు. ఎవరో 'వాల్కోర్' టగా !"

వృద్ధ మేమిల్ కడుపుబ్బ నవ్వడం ప్రారంభించాడు. కెనిరీకి పట్ట శక్యంగాకుండా ఉక్రోషం లోలోపల ఎక్కువవుతోంది. పిడికిళ్ళు బిగించి కసిగా చూడసాగాడు. మేమిల్ అంత ముసలివాడు కాకపోతే అమాంతంగా మీదపడేవాడేమో !

"వాల్కోర్ అంటే "వాల్ న్యూస్ పేపరు కరస్పాండెంటు" గోడ వార్తా పత్రికకు వార్తలు వ్రాసేవాడు - విలేఖరి అర్థమైందా ? గొనోమ్ అల్లా పిల్చింది నాగురించే. గొనోమ్‌కి పడికట్టు పదాలంటె మహాయిష్టం. నాతో "నువ్వే మా శాశ్వత విలేఖరిగా ఉండాలని అంటున్నాడు.

"అదా...సంగతి" అని కెనిరీ గొణిగాడు. గొణుక్కుంటూనే తటాలున కుడుతూన్న చేతిని విసురుగా వెనక్కు లాక్కున్నాడు. దాంతో పైన కప్పుతున్న చర్మం చిరిగిపోయింది. బోటుకు పైన చర్మం అతికించేటప్పుడు బహుజాగ్రత్తగా, నేర్పుగా ఉండాలి. ఎంతో మెలకువగా ఉండాలి.

అమాంతగా లేచి నేమిల్ బోటువైపు కెనిరీ ఉన్న చోటుకి పరుగెత్తాడు. కొద్ది క్షణాలపాటు ఇద్దరూ బోటు మీదికి వంగి, చర్మం చిల్లుపడిన చోటు చూశారు. ఏమీ లాభంలేదని తలలూపారు.

"చిల్లు పడిపోయింది" అన్నాడు కెనిరీ.

"అరెరే!...చాలా దెబ్బతిన్నదే...చర్మం" అన్నాడు నేమిల్.

ఈ దెబ్బతో కెనిరీ తల వాలిపోయింది. జరిగిన నష్టం ఏమిటో తెలిసివచ్చింది. రోజల్లా చేసిన పని వ్యర్థమైపోయింది. చిరిగినచోట కప్పాలంటే ప్రొద్దున కుట్టినదంతా విప్పాలి. అంతకన్నా పెద్ద నష్టం జరిగింది. కొద్దిగానో గొప్పగానో తెలిసిన పనిలోనే తాను విఫలమయ్యాడు. అందులో ఇప్పుడు చాల చిక్కుల్లోకూడా ఉన్నాడు. బోటును మరమ్మతు చెయ్యవలసిందని కిమిన్ కెనిరీకి అప్పగించినందుకు

ఇప్పుడు చాల చింతించవలసిఉంటుందన్నమాట. ఇది చాలా దురదృష్టకరమైన విషయం.

ఇదంతా వృద్ధ మేమిల్ ఎదురుగుండా జరగటం మరింత నామర్దా విషయం. తాను గొప్ప పనివాడినని గొప్పలు ఒక వైపున చెబుతూండగా ఈ పని జరిగింది. ఈ పనంతా నాకే అప్పగించాడు కిమిన్ అని కెనిరీ గొప్పలు చెప్పుకున్నాడు కూడా.

మేమిల్ మనసుకూడా గుబగుబలాడిపోయింది. కెనిరీ పట్ల అతని కెంతో జాలికల్గింది. కబుర్లతో కెనిరీ దృష్టిని తానే మరల్చాడు. అప్రియమైన విషయాలన్నీ జ్ఞాపకం తెచ్చి అతని మనస్సు పాడుచేసింది కూడా తానే. ఎవరైనాసరే ఒకపనిమీద మనస్సు లగ్నం చేసినప్పుడు వారిని కలతపెట్ట కూడదు. అందులో తనవంటి వృద్ధుడు అసలే అలాచేయ కూడదు. పైగా తన కీ దురలవాటు ఏమిటి?...దోవలో ఎవరు కనబడితే వాళ్ళతో మాట్లాడుతూ కూచోడం? ఎప్పుడో తాను ఇంటికి చేరవలసింది. ఇంటిదగ్గర పెగ్రినీ ఒక్తై వుంది. వాలీబాల్ ఆటలో ఆ పిల్ల సీలమండ నొప్పిపెట్టింది కూడా.

"ఒక్కక్షణం ఆగు. కెనిరీ!" ఏది...ఆ ఆరె ఇటు తే"

మారుమాటాడకుండా కెనిరీ ఆరెను అందించాడు. మేమిల్ తన వేట కత్తెను తీసుకొని కొంచం చర్మం ముక్కను కోసి చిరిగినచోట వేసి కుట్టడం మొదలుపెట్టాడు. ఈవిధంగా అతికించడం మాటలుకాదు. నీరు చొరకుండా వుండాలంటే చాలా నైపుణ్యంతో కుట్టాలి. అంతేకాదు; పై పొర మధ్యభాగంవరకే ఆరె దిగాలికాని పూర్తిగాకాదు. కాని

మేమిల్ ఏపనిమైనా తలుచుకుంటే అది అయితీరవలసిందే. ఆవిధంగా అరగంటలో పనంతా పూర్తి అయింది.

"ఈ అవాంతరం వృద్ధ మేమిల్ దగ్గరవుండగా జరిగింది కాబట్టి బ్రతికిపోయాను" అని కెనిరీ అనుకోసాగాడు. "ఈ వూళ్ళో ఇంకెవరైనప్పటికి నన్నీ గండంనుంచి తప్పించలేక పోయేవాళ్ళు!"

నేనిప్పుడే ఈ కథను ఏ విధంగా సమాప్తం చేయాలి? సోమరిపోతు కెనిరీ మనస్సు మొదటిసారిగా పీకడం ప్రారంభించింది. ఏ ముసలివాడు తన గుట్టు బయటపెట్టాడో అతడే తన నీ ప్రమాదంనుండి తప్పించాడు. మేమిల్ పేరు చెబితే కుతకుత వుడికి పోయే మనస్సు ఇప్పుడు అతడంటె కృతజ్ఞతతో కరిగిపోసాగింది. నా కథను ఈవిధంగా సమాప్తం చేస్తే బాగుంటుంది.

కాని ఈ ప్రలోభంలో నేను పడటానికి వీల్లేదు. అసత్యం ఏదీ చెప్పనని ముందే నేను విన్నవించుకున్నాను. నేను వాస్తవ మేదో చెప్పదలచుకుంటె ఈ నూతన జీవితంలో మేమిల్‌తో కెనిరీకి గల వైరుధ్యం ఏమిటో విప్పిచెప్పాలి. మంచుపాతర వేసే సందర్భంలో కెనిరీ ప్రవర్తన, బోటు మరమ్మతు చేసేటప్పుడు చూపిన అజాగ్రత్త మొదలైనవి చెప్పక తప్పదు. బోటు మరమ్మతు చేయడంలో మేమిల్‌తోడ్పడిన సాయంత్రమే ఒక సంఘటన జరిగింది. ఆ సంఘటనతో యావత్తు కథా అనుకోని మలుపుతిరిగింది.

* * *

మా గ్రామంలో లైబ్రరీ బాధ్యత యావత్తూ ఐమినా చూస్తోంది. కామ్సోమోల్ ఆమెకు ఈ బాధ్యత యిచ్చింది. వారానికి మూడుసార్లు సాయంత్రాలలో రెండు గంటలసేపు ఐమినా పుస్తకాలు యిస్తుంది. ఇక్కడే ఆ సంఘటన జరిగింది. అంతక్రితం పుస్తకాలు చదవని యువక వేటగాండ్రకు అనేక మందికి చదువంటె అభిలాష కల్గింది – ఈ సంఘటనతోనే. ఈ చదువరులలో ఒకనిపేరు యున్వెనర్. లైబ్రరీ పాఠకుల లోనేగాక, లైబ్రేరియన్ ఐమినా దృష్టిలోకూడా ఒక ప్రత్యేక స్థానం సంపాదించుకున్నాడు. యున్వెనర్, ఐమినా ప్రేమలో పడ్డారు. ఈ విషయం అందరికీ తెలిసిందే! ఒక అందగత్తె తమందరినీ వదలి తమ స్నేహితుల్లో ఒకణ్ణి ప్రేమించిందని మిగి లిన యువకులు లైబ్రరీకి రావడం, పుస్తకాలు చదవడం మానే స్తారా ఏమిటి?

లైబ్రరీలో బండెడు పుస్తకాలు, పత్రికలు ముందు వేసుకుని ఐమినా కూచుంది. ఖోలోక్కేజ్ ఎక్కాంటెంటు రోచ్‌గినా ఆమె పక్కన కూచున్నాడు. 'ఎడారి స్వరూపం' అనే పుస్తకం తీసుకొచ్చి యిచ్చి అటువంటిరకం పుస్తకం ఇంకోటి యివ్వావలసిందని అడుగుతున్నాడు. అతని వెనుక పాఠకులందరు 'క్యూ'లో నిలబడివున్నారు. స్కూలు విద్యార్థి యోర్లియో, అతని వెనుక వృద్ధమేమిల్ వున్నారు. "డికాంకా వ్యవసాయక్షేత్రంలో సాయం సమయాలు" అనే పుస్తకం చేత బుచ్చుకొని కెనిరీ ఆ తరువాత నుంచున్నాడు. "యంగ్‌గార్డ్" అనేపుస్తకం చేతబుచ్చుకొని మెకానిక్ కెల్విగీ నుంచున్నాడు. అతని వెనుక ఆర్కిటిక్ స్టేషన్‌కు చెందిన ముగ్గురు రష్యనులు

వున్నారు. ఈలోగా అందులో ఒకరు గోడవార్తా పత్రిక చదవడానికి వెళ్ళారు. మిగిలిన యిద్దరు చదరంగం ఆడడం మొదలుపెట్టారు. ఆ ప్రక్క టేబిల్‌మీద నల్లుర యువక వేటగాండ్రు కూచుని "మేక - పులి" ఆట ఆడుతున్నారు. ఒక్కొక్కడు పాచికలు వేసేటప్పుడు టేబుల్‌నువేసి గట్టిగా బాదుతున్నాడు. ఎంత గట్టిగా ఒక్కొక్కప్పుడు పాచికలు వేసి కొడితే అంత గెల్చొందినట్టు అర్థమో, ఏమిటో తెలియదు! కాని ఒక్కొక్కదెబ్బకు ఒక్కొక్క మేకేకాదు ఒక్కొక్క 'సీల్' సముద్రపు జంతువు చచ్చేట్టుంది,

రోచిగినా 'స్టన్ స్టోన్' అనే పుస్తకం తీసుకున్నాడు. స్కూలు విద్యార్థి 'గోర్కీ బాల్యం' అనే పుస్తకం తీసుకున్నాడు. మేమిల్ వంతు వచ్చేసరికి అతడు "ఇదిగో ఔగ్రిసీ ఈ చీటీ పంపింది. చూడు. ఆమెకు వంట్లో సుస్తీగా ఉండి రాలేకపోయింది" అన్నాడు. అందులో ఇలా ఉంది.

"ప్రియమైన ఐమీనా! నా సీలమండ బెణికింది. ఆర్కిటిక్ స్టేషన్‌వద్ద వాలీబాల్ ఆడుతూండగా ఈ పని జరిగింది. వారం రోజులదాకా కదలకుండా పడుకోవాలని అలెగ్జీవ్నాడి మిచ్ అన్నాడు. పడుకుని ఏమిచెయ్యను? లైబ్రరీలో డికెన్స్ గ్రంథాలున్నాయా? నేను 'ఆలవర్‌ట్విస్ట్ "డాంబె అండ్ సన్", "డేవిడ్ కాపర్ ఫీల్డు" నా రెండవ సంవత్సరం కోర్సులో చదవాలి. ఈ పుస్తకాల్లో ఏవైనా ఉంటే దయచేసి మా నాన్న చేతికిచ్చి పంపుతావా?"

"ఒక్క నిముషం ఆగు మామా! ఇప్పుడే చూసి యిస్తాను." అంది ఐమినా.

వెంటనే ఆమె స్టూల్ వేసుకొని బీరువాపై అరలో ఉన్న పుస్తకం ఒకటి తీసింది.

"ఇదిగో ఇది "డాంబే అండ్ సన్" మొదటి భాగం. రెండవ భాగం ఇప్పుడు లేదు. త్వరలో రావచ్చు. "ఆలివర్ ట్విస్ట్" స్కూలు లైబ్రరీనుండి తెప్పించి యిస్తాను 'డేవిడ్ కాపర్ ఫీల్డు' లేదు. ఆర్కిటెక్ స్టేషన్‌వారిని అడగాలి. లేదా సరిహద్దు కార్యాలయంవారిని అడగాలి. నేను రేపు స్వయంగా వచ్చి ఐగ్రినీని కలుసుకుంటాను. అన్నీ సాకల్యంగా చెబుతాను" అంది.

"ఆఁ అదే బాగుంటుంది." అన్నాడు మేమిల్. "నాకు ఆ పుస్తకాల పేర్లు ఏమిటో కూడా జ్ఞాపకం ఉండవు నువ్వే చెప్పవచ్చు."

పాఠకులకు పెద్ద లైబ్రరీలలో వలె ఇక్కడ కార్డులు యిచ్చే పద్ధతి లేదు. పేర్ల జాబితా పుస్తకం మాత్రం ఉంది. ఐగ్రినీ పేర "డాంబే అండ్ సన్" రిజిష్టరులోకి ఎక్కించింది.

"నీ పేరు ఇక్కడ వ్రాయి మామా!"

"అల్లాగే వ్రాస్తాను."

మేమిల్ పొగాకుడబ్బీ తెరిచి, అందులోంచి ఒక అగ్గిపెట్టె తీశాడు. అగ్గిపెట్టెమీద దుమ్ము, ధూళి వుంది. దులిపి ముందుపెట్టుకున్నాడు. దానిమీద వ్రాసుకున్న తన పేరును చూచి వ్రాయడం మొదలుపెట్టాడు. సిరా కక్కకుండాను, పాళీ నొక్కకుండాను జాగ్రత్తగా వ్రాయడం మొదలుపెట్టాడు. "మే" ఎల్లా ఉండాలి? ముందు సున్న చుట్టాలి, పైకి లేవాలి, కొమ్ము యివ్వాలి. తరువాత ఈ విధంగా...అని ఒక్కొక్క

అక్షరమే చూసి వ్రాస్తున్నాడు. మొదటి అక్షరం వ్రాసేసరికే రెండు మూడుసార్లు కలం సిరాలో ముంచవలసి వచ్చింది.

మేమిల్ కొంచం వూపిరి తీసుకొని మళ్ళీ వ్రాయబోయాడు. కాని అగ్గిపెట్టె మీద మిగిలిన అక్షరాలు కనబడటం లేదు. పొగాకు కాడలు వ్రాసుకొని పూర్తిగా చెరిగి పోయింది. "ఇంటికి వెళ్ళి శెర్గినీని అడగాలి. నా పేరు తిరిగి వ్రాయించుకోవాలి" అని మేమిల్ తనలో తాను అనుకున్నాడు.

అయినా అగ్గిపెట్టె మీద వ్రాయించుకుంటే చెరిగిపోకుండా ఉంటుందా? సీలు చర్మం సంచి ఒకటి వేటగానికి ఉంటే చాలా బాగుంటుంది. అందులో అగ్గిపెట్టె దాచుకోడానికి కూడా వీలుగా వుంటుంది తేమ తగలదు కూడా. కాని సంతకం వ్రాసి వుంచడానికి మాత్రం అది వీలుగా ఉండదు.

"ఎంతసేపు వ్రాస్తావు...నీ పేరు నేను వ్రాసిపెడతాను తప్పుకో...నీ కోసం జనం ఎంతసేపు కాసుకొని కూచుంటారు?" అన్నాడు కెనిరీ.

"మరేమీ ఫరవాలేదు...నేనే సంతకం పెట్టగలను...ఒక్క నిముషం..."

చివరికి సంతకం పూర్తి అయింది. కాని సంతకం చేయవలసిన చోటులోనే అది యిమడలేదు. ఇద్దరు ముగ్గురు సంతకం చేయవలసిన చోటుకూడా ఆక్రమించుకుంది. ఇంతటితో అయిపోలేదు. పేరులో ఒక అక్షరం పూర్తిగా తప్పు!

ఈ తప్పు యెలా వచ్చింది? అక్షరానికి అక్షరమే పూర్తిగా తప్పుపడటం యెల్లా సంభవించింది? ఆ తప్పు

అగ్గిపెట్టె మీద వున్న సంతకంలోనే వుంది. బెగ్రినీ యింటి వద్ద లేనప్పుడు మేమిల్ ఆ సంతకాన్ని స్వయంగా తానే ఒక అగ్గిపెట్టె మీద నుండి మరొక అగ్గిపెట్టె మీదకు ఎక్కించాడు. ఈ మార్చడంలో తప్పుపడి వుండవచ్చు. ఇలా రెండు మూడు సార్లు చేశాడు. లేదా తాను సంతకం చేస్తూ ఆలస్యం చేయడం వల్ల తన మూలాన ఇతరులు నిలబడి వుండటంవల్ల కంగారు కంగారుగా సంతకం పెట్టడంతో ఈ తప్పుదొర్లి వుండవచ్చు.

ఈ తప్పును మొదట కెనిరీ చూశాడు. ఏమీ ఎరగనట్టు ఊరుకొని వుండవచ్చునా...అలా చేయలేదు. బోటుపై చర్మం కప్పేటప్పుడు ఈ ముసలాడు నిజంగా తనకు ఎంత సహాయం చేశాడు...పోనీ మేమిల్‌ను పక్కకు పిలిచి చెప్ప వచ్చుగదా !

కాని కెనిరీ మనస్సులో కృతజ్ఞత బదులు కక్షే ఎక్కువగా పనిచేసింది. ఈ ముసలివాడు తనమీద వేసిన వ్యంగ్య చిత్రంతో గోడ వార్తాపత్రిక ఇంకా ఆ గదిలో వేళ్ళాడుతూనే ఉంది. "యావత్తు ఖోల్కోజ్‌లోను తనను ఈ ముసిలాడు ఎంత అవమానపరిచాడు ! సమయం దొరికింది...ఈ ముసలివాడిమీద దెబ్బకు దెబ్బ కొట్టాలి. నల్గురిలోను అవమానపరచాలి" కెనిరీ మనసులో బయలుదేరిన ఆలోచన సరిగ్గా ఇదే కావచ్చు కాకపోవచ్చు. ఏమైతేనేమి ? మేమిల్ సంతకం చూసి విరగబడి నవ్వటం మొదలుపెట్టాడు కెనిరీ. కుడిచేత్తో ఆ సంతకం ఉన్న కాగితం పట్టుకొని ఎడం

చేతి చూపుడువేలుతో దాన్ని చూపిస్తూ ఏదో చెప్పబోతూ చెప్పలేక విరగబడి నవ్వడం ప్రారంభించాడు.

ఆ తర్వాత కెల్విగీకూడా నవ్వ మొదలుపెట్టాడు. 'పులి-మేక' ఆడుతున్న వేటగాండ్రు ఆట వదలిపెట్టి ఇదేమిటో చూడవచ్చారు. వాళ్ళకేకాదు; మేమిల్ సంతకం చూసిన ఎవరికి మాత్రం నవ్వు రాకుండా ఉంటుంది?

మేమిల్ ఏమితప్పు వ్రాశాడు? "మేమిల్" బదులు "మిమిల్" అని వ్రాశాడు. మనిషికి అనేకపేర్లు ఉండవచ్చు. కాని, అందులో హాస్యాస్పదమైన విషయం ఏదీ ఉండదు. కాని, తన పేరునే తాను తప్పుగా వ్రాసుకుంటె నవ్వరూ?

ఐమినాకూడా పక్కున నవ్వింది! యువక వేటగాండ్రు కూడా నవ్వసాగారు. యోర్లియో కూడా ఉండబట్టలేక చప్పట్లు చరుస్తూ, గది అంతా కలయద్రొక్కుతూ "మిమిల్" "మిమిల్" అంటూ అదేపనిగా నవ్వసాగాడు.

"ఏయ్! యోర్లియో...చాల్లే చాల్లే...నీ కేమైనా మతిపోయిందేమిటి? ఆ నవ్వుకు అంతుండ నక్కర్లేదా?" అంటూనే ఐమినా కూడా నవ్వాపుకోలేక తానుకూడా మళ్ళీ నవ్వేసింది.

కెనిరీ కేరింతాలు కొడుతూ "ఆహా! ఏమి అందంగా వుంది మిమిల్ పేరు! ఒక అక్షరం మారిపోయేసరికి ఎంత చక్కని అర్థం వచ్చింది. *మిమిల్ అంటే పేలుకదా...పేలు

---

* మేమిల్ అంటే చుక్చీ భాషలో సీల్ జంతువని అర్థం. టండ్రాలలో యీ జంతువు చాలా విలువైనదిగా ఎంచి వేటాడతారు. 'మిమిల్' అంటే పేలు అని అర్థం.

ఎంత పవిత్రమైన, అద్భుతమైన జంతువులు? ఆహా! ఏమి సంతకం...ఏం విద్య! చూడలేం...చూడలేం" అని మరింత విరగబడిపోయాడు కెనిరీ.

"మేమిల్ మామా! నీకు కోపంరాదు కదా మేము నవ్వుతూంటే...నవ్వు ఆపుకోలేక పోతున్నామనుకో!" అని మళ్ళీ నవ్వసాగింది ఐమినా.

"ఓసి......పెద్దమ్మా......నాకు కోపం రావడం ఎందుకు...?" అని మేమిల్ కూడా నవ్వాడు. "తప్పు తప్పే ఆతప్పు వ్రాసింది నేనే కదా...తప్పుచేస్తే నవ్వకుండా మానతారా?"

ఆర్కిటిక్ స్టేషన్ నించివచ్చిన వాళ్ళకిదంతా చాలా వింతగా తోచింది. వాళ్ళకి చుక్చీభాష అర్థంకాదుగా...... అందుచేత మేమిల్ స్వయంగా తనే చెప్పడం మొదలుపెట్టాడు రష్యన్ భాషలో. అది విన్నమీదట వాళ్ళు కూడా పొట్ట చెక్కలయ్యేటట్టు నవ్వడం మొదలు పెట్టారు. మేమిల్ కూడా నవ్వసాగాడు "చదువు రాకపోవడం వున్నదే...మహా చెడ్డ విషయం. మనకంటె...చిట్ట చివరకు ఎలుగుబంట్లు కూడా ఈ రోజుల్లో "నీకు చదువు వచ్చునా రాదా" అని అడిగే టట్టున్నాయి. "వచ్చునా ... రాదా ... వచ్చునంటే సరే తుపాకి కాల్చు ... లేదంటావా ... ఇంటికినడు ... మమ్మల్ని వేటాడే అర్హత నీకులేదు" అని కూడా అంటాయేమో!

ఈ గందరగోళం అంతా ముగిసేసరికి, లైబ్రరీ రిజిష్టరులో ఒకరితర్వాత ఒకరు సంతకాలు చేశారు. ఒకోసారి నవ్వులు ఆగినట్టే ఆగి మళ్ళీ విజృంభించేవి. జనమంతా పొట్ట

చెక్కలయ్యేటట్టు నవ్వారు. ఈ నవ్వులకు కష్టపెట్టుకొనేటంత మూర్ఖుడు మాత్రం కాడు మేమిల్. అతడు చాలా చాలా విజ్ఞత కల్గినవాడు.

*　　　*　　　*

మాస్కోనుండి ఖబరోవస్క్ రైలుమీద నేను ఒకసారి ప్రయాణం చేశారు. అప్పుడు ఇద్దరు బెల్జియన్ దంపతులు నాతో ప్రయాణం చేయడం తటస్థపడింది. ఉత్తరధృవమండలి ప్రాంతంలో ప్రజల జీవితం గురించి తెలుసుకోవాలనే ఆసక్తి వారెంతో చూపించారు. లెనిన్‌గ్రాడ్ దాటి వారు ఉత్తరానికి వెళ్ళ సాహించలేదు. "ధృవమండలంలో ప్రజలు 'నవ్వు' అంటే ఎరుగుదురా? వాళ్ళు ఏవిధంగా నవ్వుతారు" అని వారు ఎంతో ఆశ్చర్యంగా అడిగారు. శరీరమంతా బిగుసుకుపోయే చలిప్రదేశం కనుక ఎప్పుడూ వారి మొహాలు చలికి ముడతలుపడి బిగదీసుకుపోయి వుంటాయనీ, వారి మొహాల మీద ఎప్పుడూ నవ్వు కనపడనే కనపడదని వారి ఊహ. ఒక్క మధ్యధరాసముద్రప్రాంత ప్రజలు మాత్రమే హాయిగా నవ్వగల్గుతారనీ అసలు 'నవ్వు' పుట్టింది అక్కడేనని వారి ధృడనమ్మకం.

వారు నా కీమాటలు యీసడింపుతోగాక చాలా సగౌరవంగానే చెప్పారు. ఎక్కడ నొచ్చుకుంటానో అని చాలా మృదువైన మాటల్లోనే చెప్పారు. చుక్చీ ప్రజల హృదయాలు మంచుగడ్డతో సమానమనీ...అదీకాకపోతే సముద్రపు జంతువు గుండెలో ఎంత వెచ్చదనం వుంటుందో అంత వెచ్చదనం కూడా వుండదని వారి వుద్దేశ్యం.

"ధృవమండల ప్రజల మొహాల్లో నవ్వు ఎక్కణ్ణుంచి వస్తుంది? ఎప్పుడైనా కొద్దిపాటి నవ్వు నవ్వుతారేమో! ఒకా నొకవేళ వారు ఆ కొద్దిపాటినవ్వు నవ్వినా దక్షిణప్రాంతంలో పచ్చికబయళ్లలో, వెచ్చని ఎండలో, రంగు రంగుల ప్రకృతి శోభలో చిందులాడే చిరునవ్వులా వుంటుందా? టండ్రా మైదానాల్లో రంగురంగుల ప్రకృతిశోభ ఎక్కడిది? అని ఆమె అన్నది.

వారి సందేహాలు తీర్చడానికి నేను ప్రయత్నించాను. చుక్చీ భాషలో, 'నవ్వు' అనే పదమే కాదు 'చిరునవ్వు' అనే పదం కూడా ఉంది అని చెప్పితే తాము నమ్మడం కష్టమని వారిద్దరు అన్నారు. దక్షిణప్రాంత భాషలనుండి ఎరువు తెచ్చుకున్నారేమో నన్నారు.

ఈ ఇద్దరు బెల్జియన్ దంపతులు మేమిల్ తన పేరు తప్పు వ్రాసుకున్న రోజున మా వూరి క్లబ్‌లో వుంటే బాగుండేది. పిల్లా, పెద్దా ఎంత ఆహ్లాదకరంగా, ఎంత విరగబడి కడుపుబ్బ నవ్వేరో వాళ్ళు చూసి వుండేవారు.

ఉష్ణమండలంలోని వాళ్లు ఆ ఎండదెబ్బకి ఉడికిపోతూ హాయిగా నవ్వగల్గుతారా? అని నా అపనమ్మకం. తగు మాత్రం వెచ్చదనం, తగుమాత్రం ఎండవుండే ప్రదేశాలలో ప్రజలే దృఢంగా, ఆరోగ్యంగా వుండి హాయిగా నవ్వగల్గు తారని నా వూహ.

* * *

క్లబ్‌నుండి సాయంత్రం మేమిల్ యింటికి వచ్చాడు. ఇగ్రనిన్ టెగ్రిగీనీని చూడటానికి వచ్చాడు. తాను పట్టుకు

వచ్చిన పుస్తకాన్ని మేమిల్ గ్రెగ్రీనీకి యిచ్చాడు. క్లబ్‌లో జరిగినదంతా చెప్పాడు. కొంచంసేపున్న తర్వాత ఇగ్రినీన్ తండ్రి, తన స్నేహితుడు అయిన గామోజ్ ఇంటికి వెళ్ళాడు. ఇద్దరు అనేక విషయాలు మాట్లాడుకున్నారు. క్లబ్‌లో జరిగిన సంగతులు కూడా మాట్లాడుకున్నారు. తన విషయం కూడా చెప్పుకున్నాడు. చాలా ఆషామాషీగానే, పెద్దగా తానీ విషయాన్ని పట్టించుకోనట్లుగానే చెప్పాడు. అది వేళాకోళంగా జరిగిన ఉదంతంగానే పేర్కొన్నాడు.

మేమిల్ ఈ విషయంలో అవమానం పొందినట్టు భావించక పోయినప్పటికి, లోలోపల బాధపడటం లేదని చెప్పడం పొరపాటు అవుతుంది. నవ్వినవాళ్ళమీద అతనికి కష్టం ఏమీ లేదుకాని, అతనికి ఎందుకో బాధమాత్రం కల్గింది.

తన అంతరాంతరాలను ఓసారి శోధించుకోవలసిన అవసరం ఉందనుకున్నాడు. ప్రశాంతంగా కూచుని, ఇది ఇలా ఎందుకు జరిగిందో ఆలోచించుకోవాలని అనుకున్నాడు. గామోజ్ యింటినుండి వచ్చిన తరువాత వెళ్ళి పడుకుని గాఢంగా నిద్రపోయాడు. మరుసటిరోజు పనిలోకి వెళ్ళినప్పుడు కూడా క్లబ్ సంఘటన గురించిన ఆలోచనలను వేటినీ తన మనస్సులోకి రానివ్వలేదు. అసలువిషయం, మేమిల్ ప్రశాంతంగా కూచుని ఆలోచించుకొనే చోటు ఒకటి ఉన్నది. సముద్రపు పక్షులగుంపు వాలిందని దూర దూరాన్నుండి చూసిన కొండే ఆ ప్రదేశం. అక్కడకే అతడు వెళ్ళికూచున్నాడు. తీరికగా ఆలోచించడం మొదలుపెట్టాడు.

ఇక్కడ ఎంతహాయిగా ఉంది! జూలై వెచ్చని సూర్యాతపం వొంటికి తగులుతూంటే మేమిల్ నేలమీదచతికిలపడ్డాడు. ఇక్కడనుంచి చూస్తే ఎంత దూరమైనా కన్పిస్తుంది. దూరంగా పర్వతాలు, సముద్రం, టండ్రా మైదానం, సముద్రంలోకి పొడుచుకువచ్చిన భూభాగం, దానిమీద తన వూరు, మధ్యకు చొచ్చుకొనివచ్చిన సముద్రపు నిలవ నీరు-ఇవన్నీ కన్పిస్తాయి. ఇప్పటికి సుమారు 60 సంవత్సరాల క్రితం మేమిల్ మొదటి సారిగా చిన్నతనంలో ఈ గుట్ట ఎక్కాడు. అప్పటినుండి ఈ గుట్ట ఎన్నిసార్లు ఎక్కి తన వూరికేసి చూశాడో లెక్కలేదు.

ఉత్తరవైపు చూస్తే చుకోటస్క్ సముద్రం విస్తరించుకొని కనిపిస్తుంది. తూర్పుదిక్కుగా తిరిగితే కుడివైపు దూర దూరంగా పర్వత సానువులు కన్పిస్తాయి. దక్షిణవైపుచూపు ఆనినంతమేర టండ్రా మైదానం కన్పిస్తుంది. ఇంకా దూరంగా అటుదిక్కునే మరొక పర్వతశ్రేణి కన్పిస్తుంది. దానిలోవున్న పెద్ద శిఖరం రుయ్‌నెయ్ అంటారు. ఆ పర్వతం పేరు తిమింగలం పర్వతం అంటారు. ఆ పర్వతాన్ని ఊహాచిత్రంగా గీయగల్గితే ఒక తిమింగలం టండ్రా మంచులో కూరుకుపోయి గడ్డకట్టి రాయిక్రింద మారిపోయి ఎన్ని వందల సంవత్సరాలనుంచో ఆవిధంగా ఉన్నదనిపిస్తుంది. పశ్చిమదిక్కుగా తిరిగితే గుట్ట దిగువగా వూరంతా పరచినట్టు కనుపిస్తుంది.

అనుకోకుండానే మా వూరు గురించి పాఠకునికి చాలా దీర్ఘంగా చెప్పానే ? మీలో చాలామంది డాన్ ఖోలోక్జ్ గురించి ఎరిగే ఉండవచ్చు. అయినప్పటికీ ప్రఖ్యాతి వహించిన

ఈ సమిష్టిక్షేత్రం గురించి తెలుసుకోవడం మీకు కుతూహలంగానే ఉంటుంది.

పాఠకులలో ఎవరైనా రెయిన్‌డీర్ బండిగాని, కుక్కలు లాగే బండిగాని సంపాదించి మా ఖోల్కోజ్ రాగల్గితే ఈ మంచు ప్రదేశంలో మా యిళ్ళు వాకిళ్ళను 'యరంగా'లను, మా క్లబ్‌ను చూసి తప్పక ఆనందించి ఉండేవారు. ప్రఖ్యాతి పొందిన మా వేటగాండ్రు కిమిన్, రెంటుప్గీ, యున్వెనర్, మొదలైనవారిని కలుసుకుని ఉండేవారు. వృద్ధ మేమిల్ చెప్పేగాథలను వినిఉండేవారు. అట్యాక్ పాడే పాటలను విని ఆనందించి ఉండేవారు దంతపుపని నిపుణుడు గావ్రూజ్, ఎంబ్రాయిడరీ కుట్టులో ప్రఖ్యాతి వహించిన రుల్టినాను కలుసుకొని ఉండేవారు. వేసవిలో అయితే ఈ రైన్‌డీర్లు అవసరం లేకుండా హాయిగా కయాక్ మీదనే రావచ్చు...

కాని మీరు యిక్కడకు రావడం పడుతుందా... ఎవరి గొడవలు, హడావుడి వారికి వుండనే వున్నాయి. అంతే కాక...

నా రచనలు రష్యన్ భాషలోకి ఒకవేళ అనువదించారనుకోండి నిర్మొగమాటంగా చెప్పుకుందాం. తమ తమరచనలు రష్యన్ భాషలోకి అనువదించబడాలని యుక్రెయినిన్, జార్జియన్, ఇస్తోనియన్, తదితర ఏ భాషా రచయితలు కోరుకోరు? అటువంటి గొప్ప అవకాశం కల్గాలని ఎవరు కలలుగనరు? ఒక్క చిన్నకథ వ్రాసిన రచయిత అయినప్పటికీ తన రచనను ఆ మూలనున్న మర్మాన్‌స్క్ నుండి ఈ మూలనున్న వ్లాడి వాస్టక్ వరకూ, మాస్కోనుండి స్టాలిన్ గ్రాడ్

వరకూ గల ప్రజలంతా చదవాలని అనుకోకుండా ఉండగలడా? అటువంటి కోర్కె నాకుకూడా ఉందనే విషయం నేను దాచుకోనవసరం లేదు. నా మాతృభూమి చుకోట్కా! నేను ఈ రచనను నీ కోసం వ్రాస్తున్నాను. నా రచనాపాటవం బాగా ఉండే పక్షంలో యావత్తు సోవియట్ మాతృ భూమికి నా చుకోట్కా గురించి తెలుస్తుంది. విశాల సోవి యట్ భూభాగంలోని జనులందరూ నా యీ రచనద్వారా నా చుకోట్కా ప్రజల గురించి తెలుసుకుంటారు.

ప్రియమైన పాఠకుడా! నా యీ కోర్కెలన్నీ నీ ముందు పెట్టి బాధించినందుకు మన్నించు. ఒకవేళ నా యీ రచనను ఏ క్యూబాన్ కోసక్ అయినా చదివి, చుక్చీ వేట గాండ్ర జీవితం గురించి తెలుసుకోవాలని కుతూహలపడి డాన్ ఖోలోర్జ్ రావాలని అభిలషించితే, అతని కోర్కె సుల భంగా నెరవేరదని మాత్రం చెప్పదలచుకున్నాను. మా ఖోలోర్జ్‌కు రావడానికి ఎంత ప్రయాసపడాలో చెప్పడం కష్టం. రైన్‌డీర్ బండి ఎక్కాలి; కాయక్‌తో సముద్రంమీద కొంతదూరం ప్రయాణం చేయాలి; లేళ్ళ బండిమీద మరి కొంత దూరం ప్రయాణం చేయాలి; ఆఖరుకు విమానంమీద వద్దామనుకున్నా వారం రోజులకు తక్కువ పట్టదు.

అందుచేత మా వృద్ధ మేమిల్‌తో బాటు ఊహాపథంలో ఆ గుట్ట ఎక్కి కూచుందాం. అక్కడనుండి కన్పడే మా పూ రంతా చూదాం.

కొండపాదం దగ్గరనుండే మా చిన్నద్వీపకల్పంలాంటి నివాసప్రాంతం మొదలవుతుంది. ఉత్తర దిక్కుగా ముందుకు

సాగి ఎడమవైపుగా పడమరకు తిరుగుతుంది. తీరవెంబడే కొంతదూరం సాగితే అక్కడే లోపలికి చొచ్చుకొని వచ్చిన సముద్రపు పాయ వుంటుంది. మాడాన్ ఖోల్కోజ్ అంతా చూస్తే ఒక వీధిపెట్టు మాత్రమే వుంటుంది. దాదాపు ఒక మైలు పొడుగ్గా సముద్రంలోకి చొచ్చుకొనివచ్చిన ద్వీపకల్పంలో ఆ మూలనుండి ఈ మూలవరకు నివాస ప్రాంతం పరచినట్టు వుంటుంది. సముద్రపు పాయ ఎడమవైపున దుంగలతో నిర్మించిన యిళ్ళలో ఖోల్కోజ్ మేనేజిమెంటు కార్యాలయం, క్లబ్, షాపు, స్కూలు మొదలైనవి వున్నాయి. స్కూలు ప్రక్కనే రెండు కలపయిళ్ళు ఉపాధ్యాయులకోసం నిర్మించారు. సముద్రపు పాయకు కుడివైపున చర్మంతో కప్పిన యరంగాలు, గుడిసెలు చాలా వున్నాయి. కాని యీ ప్రక్కన గూడా కలపతో కట్టిన యిళ్లు దాదాపు పదిదాకా వున్నాయి. ఆయేటి కాయేడు గడిచినకొద్దీ ఖోల్కోజ్ సభ్యులు తరతరాలుగా అలవాటైన యరంగా గుడిసెలు వేసుకోవడం మాని కర్ర దూలాలతో యిళ్ళు కట్టుకోవాలని చూస్తున్నారు.

ఖోల్కోజ్ శివార్లలో విద్యుచ్ఛక్తి నుత్పత్తిచేసే గాలి మర, పొడుగాటి ఇనుపస్థంభం వున్నాయి. ఇక్కడనుంచే మరీ సన్నగా భూభాగం సముద్రంలోకి చొచ్చుకొనిపోతుంది. ఒడ్డునే పడవలు అటూ యిటూ వుంటాయి. చేపలు పట్టుకొని ఆరవేసిన వలలు కన్పిస్తాయి. దూరంగా చూస్తే ఆర్కిటిక్ స్టేషన్ భవనాలు కనపడీ కనపడనట్టు రేఖామాత్రంగా గోచరిస్తాయి.

అప్పుడు వీధుల్లో జనసంచారం ఏమీ లేదు. ఖోల్లోజ్ సభ్యులందరురూ పనులనుండి తిరిగి వచ్చారు. ఈపాటికి వాళ్లం దరూ సాయంత్రం భోజనాలు చేస్తూండాలి. కాని వృద్ధమేమిల్ కళ్ళకు కన్పించే దృశ్యం మరొకలాగ వుంది. ఆ వూళ్ళోని ప్రతి అంగుళం స్థలం అతనికి ఒక్కొక్క గాథను వినిపిస్తుంది. జీవశక్తితో తొణికిసలాడుతూ అతనికి ఏవేవో స్మృతులను జ్ఞప్తికి తెస్తుంది.

ఒకనాడు ఇది దిక్కు మొక్కూలేని వూరు. వేళ్ళమీద లెక్కబెట్ట గల్గిన పది గుడిసెలు బిక్కుబిక్కుమంటూ ఉండేవి. అమెరికా వర్తకుడొకడు పెట్టిన ఒకే ఒక దుకాణం ఉండేది. పడవలుకూడా అట్టేఉండేవికావు. అన్నీ తెడ్లతో నడిపేవేతప్ప ఒక్కదానికీ మోటారు అమర్చిఉండేదికాదు.

అనేక తరాలు గడచిపోయాయి. కాని ఈ మారుమూల మంచు మైదానాల్లోని వూళ్ళో మార్పు ఏమీరాలేదు. ఒక సందర్భంలో మేమిల్ వూరు వదలిపెట్టి పోవలసిన పరిస్థితి వచ్చింది. కెనాడా, అలాస్కాలో అనేక యాతనలు పడుతూ దుర్భర జీవితం గడపవలసి వచ్చింది. ఏదోవిధంగా చివరకు ఊరు చేరుకునేప్పటికి వూళ్ళో కించిత్తు మార్పులేదు, యథా తథంగానే ఉంది. జనసంఖ్య మాత్రం పల్చబడింది. ప్రతీ సంవ త్సరం ఏదో ఒక అంటుజాడ్యం వచ్చి జనాన్ని తుడిచిపెట్టేది.

కాని యిప్పుడో! రోజురోజూ వూరు జనాభా వృద్ధి అవుతోంది. వూరు వాలకమే మారిపోయింది. చర్మంతో కప్పి వేసుకునే గుడిసెలు పోయి, వాటిస్థానే కలప దుంగలతో కట్టిన ఇళ్ళు లేచాయి. మొట్టమొదట కర్రదుంగలతో కట్టిన

యిల్లు స్కూలుకోసం కట్టారు. ఇప్పటికప్పుడే ఈ యిల్లు పాత బడి ఎన్నో తరాలక్రింద కట్టిన యిల్లులా ఉంది. మరికొన్ని యిళ్ళు కొత్తగా కట్టినట్లు, నిగనిగా కోసిన కలపనుబట్టి తెలుస్తూంది. గేమల్కాట్, కిమిన్, కెనిరీలు కట్టుకున్న యిళ్ళ కేసి చూస్తే చాలు, ఆనందంతో కడుపు నిండిపోతుంది. ఎంత అందంగా ఉన్నాయి అవి! కెనిరీ సోమరిపోతేగాని, అతని భార్య ఈమధ్య కవలపిల్లలను కన్నప్పుడు ప్రాంతీయ కార్య వర్గంవారు కెనిరీ కుటుంబానికి ప్రత్యేకంగా మరికొంత కలప పంపారు. ఈ కలపయిండ్లతో పోల్చి చూసుకుంటే, ఆ 'యరాంగా'లు ఎంత దౌర్భాగ్యంగా ఉండేవి; ఎంత ఇరుకుగా ఉండేవి. ఇప్పుడు ఒకవేళ 'యరాంగా'లను నిర్మించినా, అవి పూర్వపువాటివలె కట్టడం లేదు. అందులో ఎన్నో మార్పులు వచ్చేశాయి. 'యరంగా'లకు ఇప్పుడు కిటికీలు పెడుతున్నారు. వాల్రస్ చర్మంబదులు, ఇంటికప్పును అదొకరకం బొచ్చుతో కప్పడం నేర్చుకున్నారు. గామోజ్ ఇంటికప్పు లాంటిది బహుశా ఈ ప్రాంతంలో ఎక్కడా కనుపించదేమో కూడా. అతని 'యరంగా' పైకప్పు జింకు రేకులతో వేశారు!

ఇతనికి జింకు రేకు ఎల్లా దొరికిందో అదంతా ఓ పెద్దకథ. ఆ కథంతా మేమిల్ కళ్ళముందు ఒకచిత్రంలా కదిలిపోయింది. అమెరికా వర్తకుడు ఇక్కడి ప్రజల శ్రమను పిండుకొని, పిండుకొని ఇక వృద్ధాప్యం వచ్చి మూటాముల్లే సర్దుకుని అమెరికా బయలుదేరాడు. వెళ్ళిపోయేముందు తీసుకునే సామానంతా తీసుకుని వూళ్ళోవాళ్ళకు ఏమీ మిగల్చకుండా ఉండాలన్న దుర్బుద్ధితో తాను వున్న యింటికి నిప్పు అంటించాడు. మంట

ఆ యింటితోనే వదలక ప్రక్కనున్న యిళ్ళకు పాకింది. అందులో గావరాజ్ యిల్లు ఒకటి. అతడు ఈ అమెరికా వర్తకుని పనిలోనే ఉన్నాడు కూడా. మంటల్లో దుకాణం అంతా తగులబడకుండానే నల్గురూ పోగై ఆర్పివేశారు. కొట్టు పైకప్పుగా వేసిన జింకు రేకులు ఏమీ పాడవలేదు. కాని గావరాజ్ యిల్లుమాత్రం పూర్తిగా కాలిపోయింది. అందుచేత అమెరికావాడి కొట్టు తాలూకు ఈ జింకు రేకులు గావరాజ్ కిచ్చెయ్యాలని వేటగాండ్రందరూ సమావేశమై నిర్ణయించారు.

అమెరికావాడి దుకాణం వున్న స్థలంలో ఇప్పుడు ఒక్క అధునాతనమైన దుకాణం వెలిసింది. అందాలబరిణె కైర్జినా అన్నిరకాల సరకులను అక్కడ అమ్ముతూ వుంటుంది. ఆమె తొడుగుకున్న గౌనుచూస్తే నేచాలు - తెలుపు లీనుతూ, ధగాధగా మెరుస్తుంది. కెనిరీ మధ్యాహ్నం పొద్దుపోయేదాకా అక్కడే తిష్టవేస్తాడట! వచ్చే పోయే వాళ్ళందరికి మేమిల్ తప్పుపేరు వ్రాసుకున్న విషయం వేళాకోళంగా చెబుతూ కూచుంటాడట!

తిరిగి యీ ఆలోచన తన బుర్రలోకి ఎల్లా వచ్చిందో మేమిల్‌కు అర్థం కాలేదు. అనుకోకుండానే దృష్టి అటు మళ్లింది.

ఈ దురదృష్ట విషయానికంతకూ కారణభూతమైన అగ్గిపెట్టెను మేమిల్ తీసి అందులో మిగిలివున్న పుల్లలను క్రింద విదిపాడు. బొమ్మరాయి ఒకటి తీసి అందులో పెట్టి ఎవరి నుద్దేశించో తీక్షణంగా ఒక్కచూపు చూసి ఆ అగ్గిపెట్టెను విసురుగా కొండక్రిందకు గిరవాటెట్టాడు. చప్పుడు చేసుకుంటూ అగ్గిపెట్టె

క్రిందకు దొర్లిపడుతూంటే చూస్తూ మేమిల్ తన బరువంతా దిగిపోయినట్టు ఒక్క చిరునవ్వు నవ్వుతూ కూచున్నాడు.

అప్పటికప్పుడే చీకటి పడిపోయింది. వూళ్ళో రెండు మూడు యిళ్ళలో అప్పుడే విద్యుద్దీపాలు వెలిగాయి. ఈ వెలుగును రష్యన్లు మనకు తెచ్చియిచ్చారు.

వెలుగేకాదు. ఈ విద్యుత్ గాలిమర, మన పడవలకు మోటారు యంత్రాలు ఈ కొత్తయిళ్లు, అన్నీ యిచ్చినది రష్యనులే. చుకోట్కా పురోభివృద్ధికి వారు ఎంతగానో తోడ్పడ్డారు. బందిపోటు వర్తకులను తరిమివేశారు. కులక్‌లు, రాజులు పెట్టే బాధలనుండి విముక్తిచేశారు. సమిష్టిక్షేత్రాల జీవితాన్ని ప్రారంభించడానికి సహాయపడ్డారు. ఈ అన్ని వెలుగులతోపాటు వారు తెచ్చి యిచ్చిన మరొక వెలుగుకూడా ఉంది. అదే'విజ్ఞానపు వెలుగు'! అక్షరరాస్యత! అంతకు పూర్వం చుకోట్కా జాతికి అక్షర జ్ఞానంలేదు. వేల సంవత్సరాలనుండి చుకోట్కా జాతి అజ్ఞానాంధకారంలో మునిగి ఉండేంది. ఈ చిన్న చుక్చీజాతికి ఈ మహాంధకారం ఎన్నటికీ తప్పేదికాదు. కాని లెనిన్ మహాశయుడు విజ్ఞానధనులను ఇక్కడకు పంపి "వెళ్లండి! కారుచీకటిలోవున్న చుక్చీజాతికి కాంతిరేఖలు చూపండి, వెలుగుబాటకు నడపండి" అన్నాడు. ఆ తరువాత స్టాలిన్ వచ్చి చుక్చీభాషకు "వ్యాకరణం తయారుచేయండి. చుక్చీ ప్రజలు తమ జాతిభాషలోనే చదవనూ, వ్రాయనూ నేర్వగల్గి వుండాలి. విజ్ఞానపు వెలుగులను అందుకోడానికి అంతకంటె వేరేమార్గం వారికి లేదు" అన్నాడు. రష్యన్ విజ్ఞానధనులు ఆ విధంగానే శిరసావహించారు. మా భాషను పరిశో

ధించారు. ఒక వ్యాకరణం తయారుచేశారు. చుకోట్కా అంతటా పిల్లలకు బడులు వెలిశాయి. ఖబరోవస్క్‌లో పెద్ద పాఠశాలలు పెట్టారు. తెగ్రినీ,ఆమె స్నేహితులు ఇప్పుడు అక్కడే చదువుకుంటున్నారు. చుకోట్కాలో ఈ విధంగా అరుణరేఖలు వెల్లివిరిశాయి.

ఈ సమయానికి వూళ్ళో యిళ్ళన్నింటిలోనూ విద్యుద్దీప కాంతులు వెలుగొందుతున్నాయి. కొండమీద అప్పుడే చలి ప్రారంభమైంది. ఈ భావాల కోలాహలాన్ని మధ్యలో తెంపి వేయడానికి మేమిల్‌కు యిష్టం లేదు. అందుచేత కదలకుండా అక్కడే నిశ్చలంగా కూచుండిపోయాడు.

"అరుణరేఖలు చుకోట్కాలో వెలుగొందాయి. చుక్చి జాతి కళ్ళు తెరచింది. కాని, ఇంకా కళ్ళు తెరవకుండా కూచున్నది ఒక్కడే ఒక్కడు. అతడు ఎంత మూర్ఖుడు? చుట్టూ విజ్ఞానకాంతులు మిరుమిట్లు గొల్పుతూంటే, ఇంకా కళ్ళు మూసుకుని చీకటిలో తడుముళ్ళాడుతున్నాడే అతడు! వేలాది సంవత్సరాలు కళ్ళు మూసుకొని గుడ్డితనంతోనే ఉండిపోయాడు. ఇప్పుడు ఆ కనురెప్పలు బరువెక్కి తెరుచుకోనంటున్నాయి. ఎవరయ్యా... ఈ వింత మనిషి? డాన్ ఖోల్కోజ్‌లో వుంటాడే...ఒక వృద్ధ మూర్ఖుడు...అతడే! అతడిపేరు ఏమిటో తెలుసా...అతడిపేరే వృద్ధ మేమిల్!"

తదనంతరం మేమిల్ గృహోన్ముఖుడయ్యాడు.!

* * *

మళ్లీ కెనిరీ స్థితి డోలాయమానంగా వుంది. అతడు పనిచేసే దళంతో అతనికి చిక్కులువచ్చాయి. తనపై గోడ

వార్తాపత్రికలో వ్యంగ్యచిత్రం వేసిన తరువాత రెండుసార్లు తనకు చివాట్లు తగిలాయి. దళం సమావేశమైనప్పుడొకసారి; ఖోల్కోజ్ సాధారణ సభ్యసమావేశం జరిగినప్పుడు మరొకసారి తీవ్ర విమర్శకు గురిఅయినాడు. సాధారణ సమావేశంలో అందరిలోనూ పెట్టి మరీ చీవాట్లు వేశారు. దళనాయకుడు కిమిన్ ఆ తరువాత గోడవార్తాపత్రిక సంచికలో వ్రాస్తూ "కెనిరీమీద వేసిన వ్యంగచిత్రానికీ "బద్ధకస్తుడా! సిగ్గు సిగ్గు!" అన్న వాఖ్యానానికి కెనిరీ అక్షరాల తగినవాడు అని ధృవపరుస్తూ వ్రాశాడు. "తన తప్పులు దిద్దుకుంటానని ఈసారి కెనిరీ వాగ్దానం చేశాడు. ఖోల్కోజ్ సభ్యుడనే గౌరవాన్ని మట్టిపాలు చేయనని హామీయిచ్చాడు" అనికూడా కిమిన్ వ్రాశాడు.

కెనిరీ ఇటువంటి హామీయిచ్చి మూడు నెలలు అయింది. ఈలోగా రెండుసార్లు కెనిరీకి తోటివారు చివాట్లు పెట్టవలసి వచ్చింది. తీరంలో వాల్రస్* గుంపుమీద దాడిచేసినప్పుడు ఒకసారి పెద్దతప్పు చేశాడు. గుంపునంతనీ చుట్టుముట్టినప్పుడు అందులోని కొన్ని జంతువులను కెనిరీ తప్పించుకు పోనిచ్చాడు. ఇప్పుడు మరో తంటా తెచ్చుకున్నాడు. కిమిన్ దళంలో తుపాకితూటాలు విపరీతంగా ఖర్చుఅయిపోతున్నాయి. మోటారు బోట్లకు నూనె చాలా తక్కువ ఖర్చుపెట్టి ఈ దళం 'సెభాష్' అనిపించుకుంది. మోటారు బోటు నడిపే ఇంజిన్‌కు బహుమతికూడా వచ్చింది. కాని వేటగాళ్ళు వాడే తుపాకి తూటాలు ఖర్చులోమాత్రం ఈ దళం మరీ జాస్తిగా ఖర్చుపెట్టి

---

* వాల్రస్ సీలుజాతికి చెందిన ఉభయ చరం. పెద్ద దంతాలు వుంటాయి.

పోదుపులో అందరికంటె వెనుకబడింది. ఖోల్కాజ్ ఆస్తి అంటె కెనిరీకి ఏమీా లెక్కలేకుండా ఉందనీ, దళానికిచ్చిన తూటాలు స్వంతానికి వాడుకుంటున్నాడనీ అందరూ విమర్శించసాగారు.

స్వంత వాడకానికి తుపాకి తూటాలు కొనుక్కోకుండా కెనిరీ అనేకసార్లు టంఁడ్రాల్లో వేటకు బయలుదేరి వెళ్ళేవాడు. తూటాలు కొంటే ఏమి? కొనకపోతే ఏమి? దళంకోసం యిచ్చిన తూటాలకూ, కొన్నవాటికీ ఏమైనా తేడా ఉంటుందా? ఇవన్నీ స్వంతంగా కొన్నట్లే చెప్పవచ్చు అని కెనిరీ అనుకున్నాడు పాపం! ఇంతకుపూర్వం ఉన్న ముసలి స్టోరు మేనేజరు గనుకే అయితే ఏబాధా ఉండేదికాదు కెనిరీకి. గామల్కాట్ అనవసరంగా ఏవో నిబంధన లంటూ పెట్టి, తీసుకొనివెళ్ళిన మందుగుండు సామాగ్రి ప్రతీదానికీ సంతకం చేసి తీసుకోవాలనే పాడు పద్ధతి ప్రవేశపెట్టాడు. పైగా అంతటితో వూరుకున్నాడా...కాలీ తూటాల గుల్లలన్నీ తెచ్చి యివ్వాలని షరతు పెట్టాడు.

"నేను ఎక్కువ తూటాలు కాల్చేశానని ఎందుకు వీళ్ళకింత కడుపుమంట. కుందేళ్ళన్నింటిని నేనే కొట్టుకొని తింటున్నానా? లేదే...గురిచూసి కొట్టే తర్ఫీదుకోసం టంఁడ్రాలో నేను వేటాడేది ఎలుకలనేకదా? తర్ఫీదు లేక పోతే గురిచూసి కొట్టడం వేటగాళ్ళకు ఎల్లా చేతనవుతుంది?" ఇదీ, కెనిరీ ఆలోచన వరస.

అయినా పాపం, యీా గొప్ప వేటగాడికి గట్టిగా తిట్లు, చీవాట్లు తప్పలేదు. చివరకు దళంలోంచి వెళ్ళగొట్టవలసిన పరిస్థితిగూడా వస్తుందని దళనాయకుడు కిమిన్ హెచ్చరించడం

అయింది. పోనీ మేనేజిమెంటు కెనిరీని మరొక దళానికి బదిలీ చేస్తే సరి. కిమిన్ కెనిరీతో వేగలేకుండా వున్నాడు. అతడికీ ఈ బాధ తప్పుతుంది...!

ఈ తతంగమంతా అల్లావుంచి ముందు కెనిరీ తాను దుబారాచేసిన తుపాకి తూటాలు ఖరీదు యిచ్చుకోవలసి వచ్చింది. కిమిన్ చీవాట్లుకంటె కెనిరీకి యిప్పుడు పెద్ద బాధగా వున్నది ఈ ముదరాసంగతి. దీన్ని వూరికే వదలిపెడతారా? రేపు సమావేశంలో పెట్టి ఏదో ఒక నిర్ణయం తేల్చక తప్పదు. ఇక కెనిరీని వెళ్ళగొట్టే విషయంలో కిమిన్ అంతగా పట్టుపట్టక పోవచ్చునేమో. అయితేం? వెళ్ళగొట్టకపోతే ఈ బాదరీబందీ వదల్చుకోవడం ఎల్లాగ అన్నదికూడా సమస్యే.

అతన్ని ఎప్పుడూ 'బహిర్భూమి – గుట్టలచాటు' అని పుండు సలిపినట్టు సలుపుతూనే ఉన్నారు జనం. ఆనాడు వాల్రస్ వేటనాడు ఒకజంతువు తప్పించుకొని సముద్రంలో దూకేయడానికి తాను దోవ వదలిపెట్టాడు! భయంకరమైన దంతపు కోరలతో మీదమీదకొచ్చి ఆ జంతువు దూకి తప్పిం చుకుపోయింది. ఈ విషయం ఆ మంచుపాతర దగ్గర చర్చకు వచ్చింది. పోనీ, తాను ఆదమరపుగా ఉన్నందుకు నాల్గు తిట్టమనండి; పిరికివాణ్ణని అనమనండి. ఆ గుట్టల సంగతి ఎత్తడం ఎందుకూ అంట!

వేటగాడు ఓన్నా వెక్కిరించనే వెక్కిరించాడు. "కెనిరీ! నీ ప్రాణం అంటె నీకు అంత తీపిగదా, మిగిలినవాళ్ళ సంగతి ఏమిటి? జంతువుకు భయపడి పారిపోయావు. అది తప్పించుకు పోయింది. దాని వెనకాల మరిరెండు తప్పించుకుపోయాయి.

కిమిన్ సాహసించి అడ్డంవెళ్ళి ఉండకపోతే, మరికొన్ని తప్పిం చుకుపోయి ఉండేవికదా! ఏం? అతనిది మాత్రం ప్రాణం కాదా? నీ గురించి నీవు అంత భయపడితే ఎల్లాగ? నీ ఒక్క డికే ప్రాణం తీపికాదు. మంచుపాతర వేసేటప్పుడు కూడా ఇల్లాగే బద్ధకించావు. ఈసారి జంతువుకు భయపడి పారి పోయావు. ఇప్పుడు మంచుపాతరలో మాంసం తీసుకొచ్చి పడవేయాలన్నా వెనుకంజ వేస్తున్నావు. ఏమిటి ఇదంతా?" అని గట్టిగానే అడిగాడు.

పైగా ఇప్పుడు ఈ తుపాకీ తూటాలు సంగతొకటి వచ్చి పడింది. ఎప్పుడో గడిచిపోయిన సంగతులన్నీ ఇప్పుడు తీసుకు రావడమేమిటి? ఎప్పుడో మరిచిపోయి ఉండాలికాని. కిమిన్ కూడా అదే మాటా?

"అంత మొనగాడవు కాబోలు కెనిరీ! ఆట్టే మంచిది కాదు. నీవు గురిచూసి కొట్టడం నేర్చుకుంటూంటే ఎవరకీ ఏమీ యిబ్బందిలేదు. కాని స్వంతంగా కొనుక్కో, కాల్చుకో, నీ యిష్టం! అంతేకాని సమిష్టి ఆస్థిని నీ యిష్టంవచ్చినట్లు తగలేయడానికి వీలులేదు. నీ కిదంతా తెలియక కాదు. తెలియనట్టు నటిస్తున్నావు. అంతే. నీ రెండుతలల శిఖండి వ్యవహారంమాత్రం మానలేదు. అయితే ప్రజలకు నీ అసలు రూపు రేఖలు తెలియవని అనుకోకు. నీవు ఎవరినీ మోసపుచ్చ లేవు. నేమిల్ నీ నిజస్వరూపం బైటపెడుతూ మహా చక్కగా బొమ్మ గీశాడులే!"

ఇదీ అందరివరస...ప్రతీవాడు...ఆ గుట్టల వెనక సంగతి – ఆ వ్యంగ్యచిత్రం సంగతి...ఎత్తేవాడే!

దీనికంతకూ మూలకారకుడు మేమిల్ అని కెనిరీ ఎప్పుడో నిశ్చయాని కొచ్చాడు. ఈ ముసలిముండాకొడుకు ఎన్ని తప్పులుచేసినా ఎవడూ పట్టించుకోడు...ఆ సంతకం... అవకతవకగా పెడితే ఎవడైనా ఏమైనా చేశాడేమో... చూడండి. ఇదేమి న్యాయంగా వుంది? నేను చేసేదంతా తప్పు అంటారా? ఎవటివాడు ఎన్ని చేసినా తప్పులేదా?

మేమిల్ అవకతవక సంగతి యోర్లియో తన స్కూల్లో వాళ్ళందరితోనూ చెబుతాడని కెనిరీ అనుకున్నాడు. ఆర్కిటిక్ స్టేషన్ వాళ్లు ఆ వేళ అక్కడేవుండి ఆ భాగవత మంతా చూశారు. వాళ్ళుకూడా నల్గురుతోనూ చెప్పకుండా వుంటారా? ఐమినా తన మామ గేమల్యాట్‌తో చెప్పకుండా వుంటుందా? అతగాడు ఖోల్కోజ్ బోర్డులో యిది టాంటాం చేయకుండా వుంటాడా? తనలో తనకే పక్కున నవ్వు వచ్చింది కెనిరీకి...ఊరు ఊరంతా ముసిలాడి చేష్టగురించి నవ్వుతూ వుండి ఉండాలి అనుకున్నాడు.

కాని కెనిరీ అనుకున్నట్లేమీ జరగలేదు. అయితే ఎవరికీ తెలియకుండా ఉందనికాదు. అందరికీ తెలిసింది. కాని ఇదేదో కొంపముంచుకు పోయినంత విషయంగా ఎవరూ పట్టించుకోలేదు. జనమంతా మేమిల్‌ను చూచి అవహేళన చేయలేదు. జరిగిన విషయానికి నవ్వారు. ఈ తేడాస్పష్టంగా కెనిరీకి అవగతమైంది. అతగాడికి పెద్ద ఆశాభంగమైంది.

వృద్ధ మేమిల్ వీధినిబడి పోతూంటే, పిల్లలందరు అతని వెంటబడి "మిమిల్, మిమిల్" అంటూ గోలచేసి, పిచ్చివాణ్ణి తరిమినట్టు తరుముతారని కెనిరీ తన ఊహాపథంలో చిత్రించు

కున్నాడు. చివరికి ఈ 'బిరుదే' శాశ్వతంగా మేమిల్‌కు స్థిర పడిపోయి, ఊళ్ళో అందరూ అతన్ని ఆ పేరుతోనే పిలుస్తారని అనుకున్నాడు. ఇంతక్రితం 'కుంటి చేయివాడు' అనే పేరు ఎల్లాగయితే నల్గురు నోళ్ళలోను నిలబడలేదో, అదే విధంగా ఈ సారికూడా మిమిల్' అని ఎవరూ పిలవలేదు. పైగా, ఇటువంటి బిరుదులు అసలుపేరుకు ఎంత దగ్గరగా ఉన్నప్పటికీ టక్కున కుదిరితే తప్ప నిలబడవు.

ఇది జరిగిన తర్వాత అనేకసార్లు ఇతరులతో మాట్లాడుతూ కెనిరీ మేమిల్‌ను 'మిమిల్' అని, ఎల్లాగయినా ఆ పేరు నల్గురి నోళ్ళలోను ఆడేటట్టు చేయాలని మహా కష్టపడ్డాడు. కాని, ప్రతివాడు "ఎవరా మిమిల్? ఎవరిగురించి మాట్లాడుతున్నావు" అని అడగడంతో కెనిరీపని కుడితిలోపడ్డ ఎలుకలా ఉండేది.

"ఏమిటి...మీకు తెలియదా? వినండి, వినండి! ఏం జరిగిందంటే..." అని ఆ కథంతా చెప్పుకొచ్చేవాడు. అప్పుడు ఎదటివాడు "ఓహో, అదా...ఆ లైబ్రరీ దగ్గర జరిగిన విషయమా? అది తెలుసులే!" అని ఏమీ పట్టీపట్టనట్టు వెళ్ళిపోయేవారు.

ఈ విధంగా కెనిరీ ఎంత అవస్థపడ్డా అతని చౌకబారు ప్రచారానికి "ఊ" కొట్టేవారు ఎవరూ కనపడలేదు. వీళ్ళందరికీ ఈ ముసలి ముండాకొడుకు ఏదైనా మాయ మంత్రం వేశాడా ఏమిటి? అని కెనిరీ అనుకునేవాడు.

"సరే...అల్లాగే కానియ్యి...గుట్టలచాటున నేను బద్ధ కించిన ఆనాటి అప్రతిష్ట సంగతి ఎవరూ మర్చిపోనప్పుడు

ఈ ముసలి ముండాకొడుకు తప్పు సంతకంపెట్టి చేసిన అభాసు పనిని నేను 'టాం టాం' చేయకుండా ఎందుకు వదులుతాను? గోడ వార్తా పత్రికకు ఎక్కించి నామీద ఈ ముసిలాడు పెద్ద దెబ్బ కొట్టించాడు. అయితే నేనుకూడా వీణ్ణి మళ్ళీ పత్రిక ద్వారానే దెబ్బ కొట్టాలన్నమాట. అంతపనీ జరిగితే...అప్పుడు గాని ఈ ముసిలాడు జుట్టు పీక్కుని ఏడవడు! గోడ వార్తా పత్రికలో వ్యాసం పడితే ఏం అనుకున్నారు? ఇదేమీ అల్లాటప్పా వ్యవహారంకాదు. ప్రతీ సంచిక కనీసం రెండు వారాలు క్లబ్‌లో ఉంచుతారు వచ్చిపోయే ప్రతీవాడూ చదవవలసిందే! పైగా అక్కడికి వచ్చేవాళ్ళందరూ చదువు కున్నవాళ్ళే నయ్యే...ఒక్క మేమిల్‌గాడుతప్ప! దాంతోగాని ముసిలాడి తిక్క అణగదు. నేను వ్రాసిన వ్యాసానికి చచ్చి నట్టు సమాధానం చెప్పవలసివస్తుంది. ఆ తర్వాత సంచికలో సమాధానం చెప్పకోవలసిందే...అది రూలుకూడా! ఈ ముసి లాడు చెప్పగల్గేది ఏమిటి...మన్ను!...సంతకం తప్పుపెట్టాడా, లేదా! పెట్టాడు. అక్కడున్న ప్రతీవాడూ చూసిందే అది... అందుచేత "గత సంచికలో వ్రాసిన వ్యాసంలో విషయం అంతా నిజమే" అని రుజువు అయిపోతుంది. ఆ విషయాలన్నీ అప్రతిష్ట కల్గించేవి...అవునా...కాదా? ఖచ్చితంగా అవును. ఎవడైనా...ఈ రోజుల్లో నిరక్షరకుక్షిగా ఉంటే వాణ్ణి ఒప్పు కుంటారా? ఒప్పుకోరు. అందుచేత వృద్ధమేమిల్ తన అపరాధం. ఏమిటో ఈసారి సమావేశంలో తప్పక అంగీకరించవలసి వస్తుంది. ఏం?...ఎదుటవాణ్ణి ఒకణ్ణి బాధిస్తే...ఊరికే పోతుందా ఆ ఉసురు? తనకే అది ఎదురు తగులుతుంది.

ఈ విధంగా ఒక సుప్రభాతాన కెనిరీగారు తమ బృహత్ వ్యాసాన్ని వ్రాయడానికి ఉద్యుక్తులయ్యారు. ఆ వ్యాసం వ్రాయడంలో ఎంత మునిగిపోయ్యాడంటే...కొంత సేపు యావత్తు యీతిబాధలూ మర్చిపోయాడు.

కాని నేమిల్ ఇప్పటికప్పుడే ఎటువంటి నిర్ణయానికి వచ్చేశాడో తెలిసివుంటే కెనిరీ యింత శ్రమపడి వ్యాసం వ్రాయడానికి కూచునేవాడు కాదు.

ప్రతీరోజూ ఖోల్మోజ్‌లో పని అయిపోయిన వెంటనే వృద్ధనేమిల్ తనకు విశ్రాంతిగావున్న కాలమంతా చదువులో గడుపుతున్నాడు. "నేను బహుశా సెలవులకు వచ్చినప్పుడు యీసారి బోధనాభ్యాసాలు ప్రారంభిస్తాను" అని కూతురు వ్రాసింది. వచ్చిన తర్వాత ఆ విధంగా పాఠాలు చెప్పింది కూడా. కాని తండ్రి శీఘ్రంగా చదువు నేర్చుకోలేక పోతున్నాడు. తిరిగి తాను ఖబరోవస్క్ వెళ్ళిపోవలసిన తరుణం వచ్చినప్పుడు 'ఈ అపూర్వశిష్యుణ్ణి' ఫ్రూళ్కో ఉపాధ్యాయిని వెలంటినా అలెగ్జీయేనాకు అప్పగించింది.

"ఇదిగో అమ్మాయ్ ! ఇప్పుడు నువ్వు అన్ని విషయాలు నిరాఘాటంగా నాకు వ్రాయవచ్చు. నేను కూడబలుక్కుని చదువుకోగలను. ఒకళ్ళచే చదివించాల్సిన ఖర్మ ఇక లేదు. అందుచేత వాళ్ళకి ఆంతరంగిక విషయాలన్నీ తెలిసి పోతాయనే బాధ లేదు...ఇదిగో చూడు...నువ్వు ఎవరిని చేసుకో బోతున్నావో...ఏమిటో నా చెవినికూడా వేస్తూండు... తెలిసిందా ? ఈ ముసిలాడికి నీ ప్రేమ వ్యవహారాలు చెప్ప

వచ్చు. తప్పులేదుసుమా! కాని నాకు తెలిసేటట్టు వ్రాయి సుమా, కలిపిరాత రాయకు!" అని మేమిల్ అన్నాడు.

అంతక్రితం వరకు అక్షరంముక్క ఉపయోగం ఏమిటో తెలుసుకోవడం మేమిల్‌కు చాలా కష్టమై పోయింది. ఇప్పుడు అమాంతంగా పుస్తకాలు చదివెయ్యాలనీ అందులో ఉన్న దంతా నుంచున్న పళంగా గ్రహించేయాలని ఆశ కల్గింది. "ఈ విధంగా గడ గడా చదివేయడం చెప్పక ఈ అక్షరాలేమిటి? ఈ దిద్దడం ఏమిటి? తనచేత ఇన్నిసార్లు గుణింతాలు చెప్పించడ మేమిటి? ఈ గందరగోళం అంతా లేకుండా సరాసరి చదవడం చెప్పాలిగాని మధ్యలో ఈ అనవసర ప్రయాస ఏమిటి?" అనుకునేవాడు వృద్ధ మేమిల్.

ఎప్పుడైతే సంతకం తప్పుపెట్టాడో, అప్పటినుండి అక్షరం విలువ ఏమిటో తెలిసివచ్చింది. "అక్షరం అంటే ఏమిటనుకున్నావ్? ఒక్క అక్షరం ఎంత పనైనా చేస్తుంది? అని పెద్దనవ్వు వికటంగా నవ్వాడు కెనిరీ ఆనాడు. అక్షరం ముక్క ఎంత పనిఅయినా చేయగల్గుతుందని మేమిల్ గ్రహించాడు. సంతకం చేయడంలో ఒక్క అక్షరం మారిపోయేసరికి మొత్తం అర్థమంతా మారిపోయింది.

ఇప్పుడీ నిరక్షరాస్యత అడ్డుగోడను మేమిల్ కూల్చివేశాడు. ఆ కూల్చివేసిన గుట్టలపై కూచుని విజయశంఖం పూరించాడు.

చదువులోనే తన కాలమంతా మేమిల్ గడుపుతున్నాడు. ఇద్రిస్‌తో షికారువెళ్ళి కూతురు ఎంత పొద్దుపోయి వచ్చినా, ఆమెకోసం ఎంతో ఆతురతగా కూచునేవాడు.

ఆమె యింటికి వచ్చీ రావడంతోనే, ఆ వేళ సాయంత్రం తాను కొత్తగా నేర్చుకున్నదంతా ఏకరువు పెట్టేవాడు. ఇక అప్పుడు కూచునిచదువు మొదలుపెడితే, జెగ్రినీకి కళ్ళుకూరు కొచ్చేదాకా వల్లెవేస్తూనే ఉండేవాడు. వృద్ధాప్యంలో కూడా తన తండ్రికిఇంత ఓపిక ఎల్లా వచ్చేదో జెగ్రినీకి ఆశ్చర్యంగా వుండేది. పొద్దుపోయేదాకా మేల్కొని ఉండి, మళ్ళీ ఉదయం తాను లేవకుండానే తండ్రి పనిలోనికి వెళ్ళి పోయేవాడు!

*　　　*　　　*

కెనిరీ వ్రాసి, వ్రాసి, నాల్గురోజులపాటు అతి ప్రయాస పడ్డాడు. వ్యాసం వ్రాయడానికి పట్టింది మూడు రోజులే. మేమిల్ మీద వ్యంగచిత్రం తయారుచేయడానికి ఇంకోరోజు పట్టింది. కాని వ్యంగచిత్రం ఏమీ కుదరలేదు. అందుచేత చివరకు ఆ ప్రయత్నం వదులుకొని వ్యాసంతోటే సంతృప్తి పడడానికి నిశ్చయించుకున్నాడు.

"నిరక్షరకుక్షీ! సిగ్గు, సిగ్గు!!" అని తన వ్యాసానికి పేరుపెట్టాడు కెనిరీ. ఉపోద్ఘాతంలో ఇలా ఉంది:

"మేమిల్ అన్న వ్యక్తిని ఖోల్కోజ్‌లోని అందరూ ఎరుగుదురు" అని మొదలు పెట్టి ఆ తరువాత లైబ్రరీలో జరిగిన సంఘటనను వివరించాడు. మేమిల్ తప్పు సంతకం పెట్టేసరికి అక్కడ ఉన్నవాళ్ళందరూ సిగ్గుతో, తలలు వంచు కోవలసి వచ్చిందంటూ కెనిరీ గొప్పగా ఉద్ఘాటించాడు. "ఇంత సిగ్గుమాలిన పనులు జరుగుతూంటే ఇంకెన్నాళ్ళు మనంచూస్తూ

వ్రాసుకుంటాం, అని అందరూ మహాబాధపడిపోయారుకూడా!"

ఇదంతా పచ్చి అబద్ధమని కెనిరీకి తెలియక కాదు. గోడ వార్తాపత్రికకు అల్లా వ్రాస్తేనే గరమ్ గరమ్‌గా ఉంటుందని ఉద్దేశ్యపూర్వకంగా అట్లా వ్రాశాడు. అంతక్రితం తాను నల్గురుతోను టాం టాం చేసేప్పుడు యిల్లా కల్పించి చెప్పే వాడు కాదు. గోడవార్తా పత్రికలో వ్రాసేప్పుడు కొంచం అతిశయోక్తి కలపాలి. ఉన్నది వున్నట్టు చెబితే అందం ఏమిటి? ఇదీ కెనిరీ అభిప్రాయం. వ్యాసంలో యింకా ఇలా వ్రాశాడు:

"ఈ నిరక్షరాస్యతను మనం మట్టుపెట్టాలి. సామాన్య సభ్యుడైనా సరే నిరక్షరకుక్షిగా వుంటే ఎంతో సిగ్గుమాలిన పని. అటువంటప్పుడు ఖోల్కోజ్ బోర్డు సభ్యుడికే అక్షరాలు రావంటే మనకు ఎంత అవమానం! ఎంత అప్రతిష్ఠ! అతగాడు బోర్డు సభ్యుడయితే కావచ్చు. బోర్డు సభ్యుడని, పెద్దవాడని మిగిలినవాళ్ళు నోరుమూసుకుని వూరుకోవాలా?"

సరేనయ్యా...వ్యాసమైతే వ్రాశాడు. గోడ వార్తా పత్రికలో పడేటట్టు చేయడం ఎల్లాగ? గోడ వార్తాపత్రిక బాధ్యుడైన గానోమ్ - మేమిల్ ఒక్కమాటమీద నిలబడే మనుష్యులు. అందుచేత గానోమ్ చేతుల్లో పడితే ఏమీలాభం లేదు. పైగా చిక్కు గూడా! గోడ వార్తా పత్రిక సంపాదక వర్గంలో ఏ సభ్యుణ్ణీ నమ్మి వాళ్ల చేతుల్లో తన వ్యాసం పెట్ట కూడదు. అందుచేత సంపాదకవర్గం సమావేశమైనప్పుడు అధికారయుతంగా తన వ్యాసాన్ని ఆ సమావేశంలోనే అంద జేయాలి. అప్పుడు వ్యాసాన్ని ప్రచురించక తప్పదు.

రింటుప్లీ చెప్పినదాని ప్రకారం గోడ వార్తా పత్రిక సంపాదకవర్గ సమావేశం రెండురోజుల్లో జరుగుతుంది. ధృవ ప్రాంతం స్టేషన్ టైప్ రైటరుగా ఉన్న స్నేహితుడొకడు కెనిరీకి ఉన్నాడు. అక్కడకు వెళ్లి ఈ వ్యాసం టైపుచేసి పెట్ట వలసిందిగా అడిగాడు. తాను వ్యాసం వ్రాసిన దానికంటె టైపులో చాలా తక్కువ స్థలం పట్టింది. మూడు పేజీలమీద తాను వ్రాస్తే పేజీలో సగమైనా అవలేదు. కాని ఇప్పుడు చూడటానికిమాత్రం బాగుంది.

* * *

స్కూలులో అంతా నిశ్శబ్దంగా ఉంది. అడుగుల సవ్వడికూడా వినిపించడంలేదు. స్కూలంటె, ఎప్పుడూ రణ గొణ ధ్వనితో ఉంటుందని కెనిరీ అనుకొనేవాడు. తాను నాల్గవ తరగతి ప్యాసైన తరువాత మళ్ళీ స్కూలు మొహ మైనా చూడలేదు. ఎన్నాళ్ళో అయింది తానిక్కడకు వచ్చి. వరండాలో మధ్యకు వచ్చి ఆగాడు. సంపాదకవర్గ సమా వేశం ఎక్కడ, ఏ క్లాసు రూములో జరిపేదీ రింటుప్లీని అడ గటం మరిచిపోయాడు. ఏదో ఒక గదిదగ్గరకు వెళ్ళి నెమ్మ దిగా తలుపుతోశాడు. ఎదురుగుండా ఒక గాజుపెట్టె లాంటిది ఉంది. ఆ పెట్టెలో పరిశోధనకు పక్షుల కంకాళాలు అమర్చి ఉంచారు. ఒక మబ్బుకొంగ ముక్కు ముందరకు పెట్టు కొని కెనిరీకేసి చూస్తున్నట్టుగా ఉంది. గది అంతా చీకటిగా ఉంది. గాజుపెట్టెమీదకు వరండాలోంచి వెలుతురు వచ్చిపడు తూంది. కెనిరీకి లోపల ఇంకా ఏమేమి ఉన్నాయో చూడబుద్ధి పుట్టింది. తాను చదువుకున్న రోజుల్లో ఇటువంటి వింతలేమీ

లేవు. కొంగపక్కన రాబందు ఒకటి ఉంది. దాని పక్కన బాతులు, ఇంకా ఇతర సముద్రపు పక్షుల కంకాళాలున్నాయి. వాటిని ఎంత చక్కగా అమర్చారంటే, అమాంతంగా ఎగిరి పోడానికి సిద్ధంగా ఉన్నట్టు పెట్టారు. వీటన్నిటికేసీ చాలా ఆస క్తితో చూశాడు కెనిరీ. చూస్తూ చూస్తూ ఒక్కసారి హడలి పోయి వెనుకంజ వేశాడు. గాజు అద్దంలో ఏదో దెయ్యంలా కనిపించింది. మనసు కుదుటపట్టుకొని జాగ్రత్తగా చూస్తే అది ఒక మానవ కంకాళం. దాన్ని చూసిన తరువాత కెనిరీ వరండా లోకి వచ్చాడు. ఇంతట్లోకే ఉపాధ్యాయుడు ఐనీస్ గొంతుక వినిపించింది.

"ఎవరికోసం కెనిరీ, నాకోసం చూస్తున్నావా ?"

అప్పుడుగాని కెనిరీకి తాను వచ్చినపని జ్ఞాపకం రాలేదు.

"గుడ్ ఈవెనింగ్ ఐనీస్ ! నీవా ? నేను గోడవార్తా పత్రిక సంపాదకవర్గ సమావేశానికి వచ్చాను. పత్రికకు వ్యాసం ఒకటి పట్టుకొనివచ్చాను; స్కూల్లో చాలా మంచి వస్తువులు ఉంచారే. . . ?"

"అవును కెనిరీ. . .కొన్ని మంచి నమూనాలనే సంపా దించాం. ఇది జీవశాస్త్రం తరగతి. ఈ తరగతిని వెలంటినా అలెగ్జియేవినా నడుపుతూంది. దీని తరువాత ఉన్న ఉపాధ్యా యుల గదిలో గోడవార్తా పత్రిక సంపాదకవర్గ సమావేశం జరుగుతుంది. రా ! వెడదాం."

ఆ గదిలో అప్పటి కప్పుడే రింటుప్గీ వచ్చి కూచు న్నాడు. "బాగుంది. గొనోమ్ వచ్చేలోగానే వీళ్ళు చదవేయ డానికి వ్యవధి ఉంటుంది" అనుకున్నాడు కెనిరీ. తన టోపీ ఒక

కుర్చీమీదపెట్టి జేబులో మడిచిపెట్టిన వ్యాసాన్ని ఐనీస్‌కు తీసి యిచ్చాడు. అతడు దానిని బిగ్గరగా పైకి చదవడం మొదలు పెట్టాడు. వ్యాసాన్ని వింటున్న రింటుప్లీకేసి చూస్తూ కెనిరీ సంతృప్తిగా అందులోఉన్న ప్రతీ మాటను ధృడపరుస్తున్నట్లు తలవూప సాగాడు. ఐనీస్ ఇది చదవటం పూర్తిచేశాడో లేదో గొనోమ్, మేమిల్ మరో రష్యన్ యువతి లోపలికి చక్కా వచ్చారు. కెనిరీకి ఈ యువతి ఎవరో తెలియదు.

"బేష్...ఇదిగో ఇప్పుడు సంపాదకవర్గ సభ్యులందరూ ఉన్నారు. కూర్చోండి, కామ్రేడ్స్! మిమ్మల్ని పరిచయం చేయ నీయండి. వెలంటీనా ఇదుగో ఇతడు కెనిరీ, వేటకాడు, పత్రికకు క్రొత్త రచయిత.

కెనిరీ వెలంటినాతో కరచాలనంచేసి, మేమిల్‌కేసి, కడుపుమంటతో చూశాడు. ఈ ముసలి ముండాకొడుకు ఇక్కడి కెందుకు? పైగా వ్యాసంగురించి చర్చించే సమయం లోనే రావాలా?

"పత్రికకు క్రొత్త రచయిత" అని ఐనీస్ పరిచయం చేసిన విధానాన్ని కెనిరీ వినకుండా ఉండలేదు. "అంటె దీని అర్థం ఏమిటి? వ్యాసం ఐనీస్‌కు సంతృప్తికరంగా ఉన్నట్టేకదా! ఐనీస్ ఉపాధ్యాయుడు. అందుచేత బాగా అర్థం చేసుకుంటాడు." అనుకున్నాడు.

"ఏమోయ్, రింటుప్లీ! ఇక్కడ బైటవాళ్ళు ఎందుకు?"

"బైటవాళ్లు ఎవరు? ఇప్పుడు సంపాదకవర్గంలో అయిదుగురు సభ్యు లున్నారు."

కెనిరీకి దీని అర్థం తెలియలేదు.

సంపాదకవర్గ అధ్యక్షునికి స్థానంయిస్తూ "కా్రమేడ్ కెనిరీ ఒక వ్యాసం పట్టుకొచ్చాడు. మనం ముందు దీనిని చదవవచ్చు" అని గొనోమ్ అన్నాడు.

"నీవు చదివావా ?"

"ఫూఁ, ఇప్పుడే చదివాను."

"ఎల్లా వుంది ?"

"నేను రింటుప్గీ తరపున మాటాడలేనుగాని నా అభిప్రాయం చెప్పాలంటే ఇక ముందు ముందు కెనిరీ వ్యాసాలు వ్రాయొచ్చని నా ఉద్దేశ్యం. ఇదిమాత్రం కాలదోషం పట్టిన వ్యాసం.

ఇల్లా అని ఐసీస్ ఆ వ్యాసాన్ని మేమిల్‌కు అందించాడు. మేమిల్ ఆ వ్యాసాన్ని చత్వారం ఉన్న ముసలాళ్ళు చూసినట్టుగా కళ్ళకు దగ్గరగా ఒకసారి, దూరంగా ఒకసారి తెచ్చుకొని చదవడం మొదలుపెట్టాడు.

"నిరక్షరకుక్షీ సిగ్గు సిగ్గు!" అని మొదలుపెట్టి సాలోచనంగా ఒకసారి కెనిరీ కేసిచూసి మేమిల్ వ్యాసమంతా చదివాడు.

"పాపం శ్రమపడి వ్రాశాడు అయితేమి ? కాలదోషం పట్టిపోయింది." అని మేమిల్ అన్నాడు. అతని వృద్ధ నేత్రాలలో కొంటెతనంగా నవ్వు కనిపిస్తూంది. "వ్యంగ్యచిత్రం వేయడానికికూడా అద్భుతమైన విషయమే సందేహంలేదు" అన్నాడు.

ఇప్పటికప్పుడే కెనిరీకి పై ప్రాణాలు పైకి పోయాయి. నోట మాటలేదు. తన కళ్ళను తానే నమ్మలేకపోతున్నాడు.

మేమిల్ తన వ్యాసాన్ని గడగడా చదివేశాడు. ఇంకా నిరక్షరకుక్షి ఏమిటి? పైగా వ్యంగ్యచిత్రం కూడానా? కెనిరీకి ముచ్చెమటలు పోస్తున్నాయి. ఈసారి కూడా విజయం మేమిల్‌దేనా? తనదే వోటమా? ఎంత ఇంద్రజాలంగా ఉంది?"

కెనిరీ అవస్థ చూస్తే ప్రతీవాడికీ నవ్వు వచ్చేటట్టుగా వుంది. తన స్థానంలోకి ఎల్లా వచ్చిపడ్డాడో కెనిరీకే తెలియదు. మతిపోయినవాడిలా మేమిల్‌కేసి చూస్తూ కూలబడ్డాడు.

"లే, లే! కెనిరీ నీ ప్రఖ్యాతమైన టోపీమీద కూచున్నావ్" అని మేమిల్ అన్నాడు.

కెనిరీ ఎగిరి గంతేసి నుంచున్నాడు. అయితే ఏంలాభం? జరగవలసినపని కాస్తా జరిగిపోయింది. టోపీకాస్తా అప్పచ్చిలా అణిగిపోయింది. దానిని సరిచేద్దామని కెనిరీ చూశాడు. కాని పాపం! యజమానికి ఎంత దురవస్థ పట్టిందో, ఆ టోపీకీ అంతే అవస్థపట్టింది.

సంపాదకవర్గ సభ్యులందరూ విరగబడి నవ్వటం మొదలు పెట్టారు. మేమిల్ తన నవ్వును ఆపుజేసుకొని, అందరికంటె పెద్ద మనిషిగా చాలాసేపు ఉన్నాడు, కాని కడకు అతడుకూడా ఆపు జేసుకోలేకపోయాడు. క్లాసురూమ్‌లో సంపాదకవర్గ సమావేశం జరుగుతున్నట్టుగా లేదు. అదంతా, ఏదో హాస్యసినిమాలో హాలంతా నవ్వుతో దద్దరిల్లిపోతున్నట్టుగా ఉంది. వాలెంటినా, రింటుప్గీ యిద్దరిని అసలే పట్టుకోలేకపోతున్నారు. ఈ నవ్వులు ఇలా విచ్చిపోతుండగానే, జీవశాస్త్ర తరగతిలో కంకాళాన్ని చూసి కెనిరీ ఎల్లా జడుసుకున్నాడో ఐనీస్ బయటపెట్టేశాడు.

ఇహ చూసుకోండి నాయనా! నవ్వులు...ఒకటే నవ్వులు అందరూను!

దక్షిణ ప్రాంతీయులు నవ్వుతుండగా నేను విన్నాను. చూశాను. వాళ్ళు ఎంతో హాయిగా నిర్విచారంగా పక పకా నవ్వుతారు. ఏదో సెలయేరు జలజలా ప్రవహించినట్టే ఉంటుంది. కాని ఉష్ణమండల ప్రాంతంలోని వాళ్ళు తమవలె ఇంతహాయిగా ఇంత కలకలా నవ్వలేరనీ, ఎంతసేపూ అరచు కోవడమే వాళ్ళపని అని యీ దక్షిణ ప్రాంతీయులు చెప్పారు. వాళ్ల జీవితాల్లో దుఃఖాశ్రువులకేగాని ఆనందాశ్రువులకు అంతగా స్థానంలేదని అన్నారు. కాని అన్ని మండలాల్లో, అన్ని ఖండాల్లో, ఉష్ణం, శీతలం, భేదంలేకుండా మన సోవియట్ దేశంలోవలె, ఇక్కడ ఉత్తర ధృవ ప్రాంతంలో వలె అక్కడి ప్రజలూ ఆనంద తరంగాల్లో ఫూగులాడుతూ దరహాస వదనాలతో కులుకుతూ, హాయిగా నిర్విచారంగా నవ్వులు వెదజల్లుతూ ఉంటె ఎంత బాగుంటుంది!

# మానవ విజయం

మంచు కరుగుతూంది. తెల్లని మంచు, బూడిదవర్ణం లోంచి, మట్టి కలిసిన పసుపు రంగులోకి మారుతోంది. అక్కడక్కడ నేల బయటపడుతోంది. వాతావరణం వెచ్చగా ఉంది. ఆకాశం నీలవర్ణంలో ముదురు, లేత రంగులు మార్చుకుంటూంది. వసంతకాలపు రాత్రిళ్ళలో ఆకాశం నలుపు నీలం కలబోసుకుంటూంది. ఒక్కరవ్వ చల్లదనమూ ఎక్కువగానే ఉంటుంది. కాని వసంతకాలపు సూర్యుడు పెందలకడే ఉదయిస్తాడు. ఇంకో మూడునాల్గురోజులు - మహాఅయితే వారంరోజుల్లో - సూర్యుడు ఇక అస్తమించనే అస్తమించడు.

దిక్చక్రాన్ని తాకీ తాకడంతోనే మళ్ళీ ఉదయించడమేపని సూర్యుడికి. వెచ్చని సూర్యకిరణాలతో ఆ మిగిలివున్న కాస్తమంచు కరిగిపోతుంది. ఉదయం అవుతుంది. పగలుంటుంది. సాయంత్రం అవుతుంది. కాని రాత్రి అంటూ వుండనే వుండదు. వేసవికాలమంతా అయిపోయేదాకా యిదే పద్ధతి.

రాత్రి అంటూ లేని, చీకటిలేని ఈ పగళ్ళు ఎంత మనోహరంగా వుంటాయి? వసంతకాలపు దినాల్లో వూళ్ళో వాళ్ళందరు బాగా ఉదయమే లేస్తారు. ఎవరికీ నిద్రపోవాలనే

యేవ ఉంటనే వుండదు. శీతాకాలమంతా కావలసినంత నిద్రపోయి వుంటాయి. ఊరికి సమీపంలో అడవిబాతుల గుంపులు రొదచేస్తుంటే నిజమైన వేటగాడనుకున్న ఎవరికైనా సరే నిద్ర పడుతుందా ? ఒక్క అడవిబాతు లేమిటి ? వాల్రస్ జంతువులు కూడా గుంపు గుంపులుగా ఉన్న వార్త యున్సైనర్ మోసుకురానే వచ్చాడు. అతడి మాటంటే ఎవరికీ అప నమ్మకం లేదు. అయినా ఆ కబురులో ఆశ్చర్యపడదగ్గ విషయం ఏముంది ? వసంతకాలంలో కాకపోతే సముద్రపు జంతువులకు మాత్రంహుషారు ఎప్పుడు ఉంటుంది ? ఏమైనప్పటికీ, వసంతకాలంలో తొలిసారి వేటగాళ్ళ తుపాకులు ధణధణ మ్రోగే సమయం వచ్చేసింది.

మంచు కరగడం మొదలుపెట్టిన మాట నిజమేకాని, సముద్రతీరం వెంబడే ఉన్న మంచుగడ్డ మాత్రం ఇంకా గడ్డ గట్టి బిగదీసుకునే ఉంది. పెద్దపెద్ద బండలు కరగకుండానే అల్లాగే ఉన్నాయి. మధ్యమధ్యలో అనేకచోట్ల పగిలి నెరదలు విచ్చినప్పటికీ, ఇంకా మొత్తంమీద ఒడ్డునుండి అయిదారు మైళ్ళు సముద్రంలోకంటూ నీరు గడ్డకట్టే ఉంది. ప్రతీరోజూ సముద్రపు అలలు వచ్చి ఈ మంచురాళ్ళను కొడుతూనే ఉంటాయి. పగిలిన గడ్డలను ఉత్తరదిక్కుగా ప్రవాహంలో తీసుకొనిపోతూనే ఉంటాయి.

అటువంటి మంచుగడ్డమీద నీటికి దగ్గరగా ఒడ్డుపై వేటకాడు కెనిరీ కూర్చున్నాడు. తుపాకి సిద్ధంగా మోకాళ్ళ మీద పెట్టుకొని సీల్ జంతువుకోసం కాసుకొని ఉన్నాడు. అతని మొహంలో ఉల్లాసం ఉట్టిపడుతోంది. ఇంతక్రితం వేసిన

రెండు దెబ్బలకి రెండు జంతువులు పడ్డాయి. వాటిని పక్కనే వేసుకుని కూచున్నాడు. కెనిరీ గుచ్చిచూచి కొట్టాడంటే దానికి తిరుగు లేదు. తినబోతూ రుచి అడగటం ఎందుకు? దాని ఖర్మంకాలి ఏ సీలు జంతువైనా కెరటాలమీదికి తలయెత్త నివ్వండి...అప్పుడు చూడండి, అతని తడాఖా...

సూర్యకిరణాలు కల్గించే వెచ్చదనం కెనిరీకి ఎంతో హాయిగా ఉంది. కరుగుతున్న మంచుగడ్డలమీద పడి ఎండ తళతళలాడుతోంటే అతగాడికి ఎంతో ఆహ్లాదంగా ఉంది. గాలి వెచ్చగా ఉందేమో...చెప్పలేనంత హుషారు కల్గి స్తోంది. శీతాకాలంలో, ఎముకలు కొరికే మంచుజడి పడు తున్నప్పుడు సీల్ జంతువులను ఎప్పుడు వేటాడదామా? మంచుకరుగుతున్న ఒడ్డుకు వెళ్ళి ఎప్పుడు దెబ్బమీద దెబ్బ కొడదామా? అని కెనిరీ పడుకొని ఆలోచిస్తూండేవాడు. ఆ తరుణం రానే వచ్చింది. కూచున్న చోటునుండి ఇప్పుడు కెనిరీ కదులుతాడా?

ఇంటికి బయలుదేరవలసిన టైము అయింది. ఉదయం ఎనిమిది గంటలకే పనిలోకి రావలసిందని తన దళనాయకుడు చెప్పాడు. పడవమరమ్మతు పనికూడా ఉంది. ఇప్పటికప్పుడే ఏడు దాటిపోయిందో ఏమో...?

ఆ వేళ ఉదయం చాలా పెందలకడే లేచాడు కెనిరీ. సముద్రపు ఒడ్డుకు వస్తున్న సంగతి ఇంచుమించు ఎవరూ చూడనేలేదు. తన స్వంతానికి నాల్గు సీల్ జంతువులను వేటాడి, ఎనిమిదింటికి తిరిగి వచ్చేద్దామని బయలుదేరాడు. ఎనిమిది కాకపోతే తొమ్మిది...పెద్ద మునిగిపోయిందేమిటి.

పడవ మరమ్మతు ? అదేం సీల్ జంతువులా నీళ్ళలోకి ఉరికి పారిపోదుకదా ! ఆ మరమ్మతు ఏదో తొమ్మిదింటికే ప్రారంభించవచ్చు.

వేట వ్యసనం అంత సులువుగా తీసిపారవేసేదా ? అందులో కెనిరీలాంటి అదృష్ట జాతకుడు, ఆరితేరిన వేటగాడి విషయంలో మాటలా ? రెండు పడ్డాయి. మూడోదాన్ని పడెయ్యాలి...అప్పుడు యింటికి బయలుదేరాలి !

కాని దీని తస్సాదియ్యా...ఆ మూడో సీల్ జంతువుకు ఎక్కడా కంగారులేనట్టుగా వుంది ? కెనిరీ లేచి కూచున్నాడని దానికి తెలియవద్దా ? ఏం ? కెనిరీ తీసిపోయాడా ? దాని అంతు ఏదో తేల్చే మరీ వెడతాడు ! సీలు జంతువు చర్మంతో కుట్టిన సంచిని వేసుకొని వెనకాలవున్న పెద్ద మంచుబండను ఆనుకొని కెనిరీ చక్కగా సర్దుక్కూర్చున్నాడు. రోజుల్లా అక్కడ కూచోమన్నా కూచునేటంత హాయిగావుంది అక్కడ. అందులో వేటగాడికి మరింత అనువుగావుంది ఆ చోటు. కదలనక్కరలేదు, మెదలనక్కరలేదు. ఏమాత్రం తాను అక్కడ ఉన్నట్టు అలికిడి కలుగనక్కరలేదు. వేటగాడి కుండవలసిన హంగు అదేకదా !

కెనిరీ, ఈ హంగు అంతటిని సలక్షణంగా ఏర్పరచుకునే ఉన్నాడు. వెచ్చని యెండ, హాయిగొల్పే గాలి, బద్ధకంగా లేచిపడుతున్న కెరటాలు, అంతకంటె బద్ధకంగా ఒళ్లు విరుచుకుంటూ రా సాగిన తన ఆలోచనలు వీటన్నిటితో కెనిరీకి కునుకుపాట్లు వచ్చాయి. వున్నట్టుండి ముందుకు తూలాడు.

"ఓహో! ఇక నేను లేచి వెళ్ళిపోవాలి...లేకపోతే ఇక్కడే ఒళ్ళు మరిచే నిద్ర పట్టేటట్టుంది...అనుకున్నాడు.

రెండు సీల్ జంతువులతో ఇంటికి వెళ్ళినాడు. కుర్రాళ్లు ఎదురుగుండా పరుగెత్తుకువచ్చినట్టు కెనిరీ గ్రహించుకున్నాడు. "నల్గురు కొడుకులకు నాలుగు సీల్ కాళ్ళు...మంచి రుచిగా ఉంటాయి...తనకీ తన పెళ్ళానికి మాత్రం ఈసారికి లేవు. మరొక సీలు దొరికితే అందరికి తలొక కన్ను వచ్చి ఉండేవి." అనుకున్నాడు.

ఇల్లా అనుకుంటూ దూరంగా చూసేసరికి స్టీమరు గొట్టాల పొగ కన్పించింది. ఓహో! అయితే, ధృవమండల ప్రాంతంలో ఓడలు తిరగడం మొదలుపెట్టా యన్నమాట. స్టీమర్లు గురించి ఊహించసాగాడు కెనిరీ. ఎక్కడనుండి ఇవి వచ్చేది? ఎక్కడకు పోతాయి? సముద్రంమీద ఇలా ఎన్నాళ్ళు తిరుగుతాయి? మరికొంచం సేపుండి స్టీమర్లు దగ్గరకు వచ్చేవరకు చూసి వెళ్ళవచ్చునని అనుకున్నాడు. అరగంటకంటె తాను ఎక్కువ కాచుకుని ఉండనక్కరలేదు. ఈ లోగా ఇంకో సీల్ కళ్ళబడితే...తస్సాదియ్య, మహా మజాగా ఉంటుంది. ఒకవేళ కనపడదూ...పోనీలే. రెండు సీళ్ళను ఒకేసారి వేటాడిన ఘనత ఉండనే ఉంది.

కెనిరీ కునుకుపాట్లు పడటానికి వీలుగా సమస్య యీ ఆవిధంగా పరిష్కారమైపోయింది. ఈసారి అతను ముందుకు తూలనవసరంలేదు. భుజంమీదకు తల ఒరిగింది. వేటాడిన సీలు జంతువులను చేత్తో పట్టుకొని సగర్వంగా వూళ్లో వీధుల్లో తాను నడుస్తున్నట్టు స్వప్నావస్థలో ఊహించుకుంటున్నాడు.

దోవలో ఎంతోమంది తనకు ఎదురవుతున్నారు. అందులో వృద్ధ మేమిల్ ఒకడు. ఆ ముసలివాడు ముందు ఒక సీల్‌ను తరువాత మరొకదాన్ని పరీక్షించి "భేష్! అదీ దెబ్బంటే, అల్లా వుండాలి. గురిచూచి తలమీదనే రెండింటినీ కొట్టాడు. కళ్ళు ఎక్కడా దెబ్బతినలేదు. వేటలో కెనిరీ మొనగాడే" అని మేమిల్ అంటున్నాడట. అంతట ఆ స్వప్నంలోనే కెనిరీకి చిరునవ్వు వచ్చింది. ఎదటివాళ్ళు పొగుడుతూంటే వినడానికి ఎంత సొంపుగా ఉంటుంది. అందులో వృద్ధ మేమిల్ పొగిడితే ఇక ఆకాశంలో ఎగిరినట్టే! తాను సోమరిపోతుననీ, బద్ధకస్తుడ ననీ మేమిల్ ఎన్నిసార్లు తిట్టాడు. సమావేశాల్లో, ఒంటరిగా, కడకు గోడవార్తా పత్రికలో కూడా తిట్టాడు. అట్టి మేమిల్ తన్ను పొగడటం అంటే మాటలా?

ఇప్పుడు? మేమిల్ తన్ను పొగుడుతున్నాడు. వేటలో మాంచి అందెవేసిన చెయ్యి అంటున్నాడు. ఏది ఏమైనప్పటికి మేమిల్ చాలా ఉత్తముడైన వృద్ధుడు. ఇక ఇంతటిలో ఈ విషయాన్ని సమాప్తి చేద్దాం. ఇప్పుడు టైము ఎంత అయిందో? మేమిల్ పక్కనే ఉన్న ఖోల్కోజ్ ఎకౌంటెంటు "7½ అయింది" అన్నాడు.

"సరే...ఇక నేను యింటికి వెళ్ళిపోవాలి. వాటిని ఇంటి దగ్గర యిచ్చేసి ఎనిమిది గంటలకల్లా పనిలోనికి వెళ్ళిపోవాలి.

ఆ తర్వాత కలలో తన యిల్లు ప్రత్యక్షమైంది. తన చిన్నకొడుకు కోల్కాకు సీలు కన్ను తీసి కెనిరీ చూపించు తున్నాడు. కోల్కా రెండు చేతుల్తోటి దానిని తీసుకొని అమాంతంగా నోట్లో వేసుకుని బుగ్గను పెట్టుకున్నాడు. బుగ్గ

ఒక ప్రక్కన ఉబ్బెత్తుగా వచ్చింది. లోపలనుండి నిగనిగ లాడుతూ మెరుస్తోంది సీల్ కన్ను ! కాదు కాదు ! అది సీల్ కన్నుగాదు. వృద్ధ మేమిల్ కన్ను. ఆ ముసిలాడు కళ్ళు కుంచించుకొని "మళ్ళీ పని ఎగకొడుతున్నావా ? సిగ్గుమాలిన వాడా ! వాళ్ళు నీకోసం ఎదురు చూడటంలేదా ? వాళ్ళు ఎదురుచూస్తూంటే నీవు మంచు గడ్డలమీదకు పోయావా ?" అని అడుగుతున్నాడట. దీనితో కెనిరీకి వణుకు పుట్టుకొచ్చింది. సిగ్గుపడి తల వంచుకున్నాడు. వెనక్కు తిరుగుదామని కెనిరీ అనుకుంటాడు కాని తిరగలేదు. "దళాన్ని అందుకోడానికి ఇంకా వ్యవధి ఉంది" అని తనలో అనుకుంటాడు. కాని ఆ మాటనే పైకి చెప్పలేదు.

అదృష్టవశాత్తు ఇప్పుడు చికిలించుతున్న ఆ ముసలి వాడి కన్ను మాయమైపోయింది. ఈ సారి మోటారుబోటు మీద తేలిపోతూ ప్రయాణం చేస్తున్నట్టు కెనిరీ కల. మోటా రును నిలిపివేశాడు. అది కెరటాలను కొట్టుకుంటూ ప్రూగుతూ సముద్రంలో ప్రయాణం చేస్తూంది.

ఇంతట్లోకే కెనిరీకి మెలకువ వచ్చింది. ఓహో, తాను కునుకుతున్నాడు. స్టీమరు పోగలకేసి తేరపార చూశాడు. ఎక్కడా జాడలేదు. ఎక్కడికి పోయినట్టు ఈ స్టీమర్లు ? అవి దిక్చక్రం వెనుక కనుమరుగైపోయేటంత సేపు తాను కుని కాడా ? కెనిరీ లేచి నిలబడ్డాడు. ఒక్కసారి పెద్దగా ఆవు లించాడు. చేతులతో ప్రక్కలను రుద్దుకొన్నాడు. "ఎంత చల్లబడిపోయింది ? ఎండవేడి లేదే ?" అనుకున్నాడు. కాని, యింతట్లోనే నిద్రలో తూలినట్లు తూలాడు. నిటారుక్కు నిలబడి

తీరంకేసి చూశాడు. అంతే! మనిషికి ఏమి కన్పించిందో ఏమిటో...కొయ్యబారిపోయాడు! చేతులో ఉన్న సీల్ జంతువులు క్రిందకు జారిపోయాయి. ఒడ్డునుండి వగిలి విడిపోయి, సముద్రంలో తేలిపోతున్న ఒక మంచుదిబ్బమీద తాను కొట్టుకుపోతున్నాడు!! చుట్టూ రంగు నీలంలో సముద్రం కనిపిస్తోంది. ఊరు కన్పించనే కన్పించడం లేదు. దూర దూరాన తీరం వంకరటింకరగా కనిపిస్తోంది.

మంచుదిబ్బ అంచుకు కెనిరీ ఒక్క అంగ వేశాడు. గట్టిగా ఓపికకొద్దీ కేకలెట్టాడు. వేటుదిన్న జంతువులా పెద్ద అరుపు అరిచాడు. నోటమాట లేదు; ఆశలేదు; చేతులు గాలిలో భయంకరంగా వూపుతున్నాడు. కాళ్ళతో చిందులు తొక్కుతున్నాడు. ఒక్కసారిగా నవనాడులు కృంగిపోయాయి. ఉన్నట్టుండి కుప్పకూలిపోయాడు. కాని గొంతుకనుండి ఇంకా అస్పష్టంగా అరుపులు వినిపిస్తూనే ఉన్నాయి.

కొద్ది నిముషాల్లో ఈ అచేతన స్థితినుండి కెనిరీ కోల్కొన్నాడు. స్థిమితపడి కూచున్నాడు. తనవూరు ఏ దిక్కుగా ఉంది? అని అటుకేసి అదేపనిగా చూడటం మొదలుపెట్టాడు. ఇప్పుడేమి చెయ్యాలి తాను?

ఏమీ తోచడంలేదు. తన్ను వెతుక్కుంటూ ఎవరైనా వస్తే ఇక వాళ్ళకోసమే తాను ఎదురుచూడాలి. తనదగ్గర రెండు సీల్ జంతువులున్నాయి. పన్నెండు తుపాకి తూటాలున్నాయి. అంటే ఇంచుమించు మరో పన్నెండు సీళ్ళు పడతాయి. కనీసం పదింటినైనా కొట్టగలడు. ఆహారానికి కొదువ

లేదు. ఈ మంచు దిబ్బమీద ఆధారపడి ఉన్నకాలంకంటే హెచ్చుకాలమే తనకు యీ జంతువులు సరిపోతాయి.

ఆకలితో తాను చనిపోనక్కరలేదు. అది మాత్రం ఖాయం. తనకు సంభవించే ప్రమాదం అదికాదు. మంచు దిబ్బ రోజురోజుకీ కరిగిపోతుంది. చిన్నచిన్నదై చివరకు నీళ్లలో ముక్కలుగా అదృశ్యమైపోతుంది. అప్పుడు తనకు ఆధారం ఏమిటి? అది కరగిపోయేలోగా తన్ను రక్షించడానికి ఎవరూ రాకపోతే ఇక కెనిరీ అంటూ ఒక వ్యక్తి యీ ప్రపంచంలో ఉండడు. అతని బిడ్డలను, భార్యను, స్నేహితులను అతనిక చూసుకోలేడు. ఈ సముద్రంలోనే అతను శాశ్వతంగా శయనించాలి!

ఇదివరకు అనేకమంది వేటగాళ్ళు తనవలెనే, మంచు దిబ్బలపై కొట్టుకొనిపోయిన సందర్భాలు కెనరీకి జ్ఞాపకం రాసాగాయి. గామాజ్ కొడుకు ఇగ్రిన్ కుర్రవాడుగా ఉండగానే ఇదే విధంగా కొట్టుకుపోయాడు. అప్పటికి వాడికి 15 యేళ్లు ఉంటాయి...తనకీ విషయం చాలా బాగా జ్ఞాపకం ఉంది. అప్పుడు ఇగ్రిన్‌ను రక్షించడానికి వెళ్ళిన వాళ్ళలో తనుకూడా ఉన్నాడు. కుర్రవాడు దొరకడని నిరాశ చేసుకున్నారు. కాని పదిరోజుల్లో వాణ్ణి పక్కనున్న వూరినుండి వేటగాళ్ళు తీసుకువచ్చారు. మంచు దిబ్బమీద స్పృహతప్పి పడివుండగా వాడు దొరికాడు.

మేమిల్ కూడా ఇదేవిధంగా కొట్టుకొని పోయాడట. కెనిరీ అప్పటికింకా పుట్టనేలేదు. మేమిల్ కొట్టుకొని వెళ్ళడం, వెళ్ళడం ఇతర దేశాలకేనట. ఏడు సంవత్సరాలు విదేశాల్లో

తిరిగి తిరిగి చిట్టచివరకు దేశం చేరుకున్నాడట. ఎట్లాగైతేనేమి చివరకు దేశం చేరుకున్నాడు గదా!

కాని ఈ యిద్దరు కొట్టుకొనిపోయింది శీతాకాలంలో... అందుచేత తనతో వారి కేమీ పోలిక లేదు. శీతాకాలంలో సముద్రంలో తేలిపోయే మంచు దిబ్బ, నావ ఎంత సురక్షితమో అంత సురక్షితంగానూ ఉంటుంది. దానిమీద నెలకాదు, రెండు నెలలైనా సురక్షితంగా ప్రయాణం చేయవచ్చు. అది కరిగి పోయే ప్రమాదం ఏమీలేదు. కాని వసంతకాలంలో... గత సంవత్సరం వసంతకాలంలో యుస్త్రఅమ్గాయిమా నుంచి ఒక వేటకాడు ఇల్లాగే కొట్టుకుపోయాడు. ఇక అతని జాడా, జవాబు లేదు. అది చాలా చిన్న మంచుదిబ్బ కావచ్చు. కాని వసంతకాలంలో మంచుదిబ్బలు ఎంతోకాలం నిలవవు. సూర్యుడు దానికి వేడి కల్గిస్తాడు కెరటాలు నెమ్మది నెమ్మదిగా తినేస్తాయి. టీ గ్లాసులో పంచదార వేస్తే కరిగి మాయమై పోయినట్టు చివరకు మంచుదిబ్బ కాస్తా మటు మాయమై పోతుంది.

ఇప్పుడు ఇంటిదగ్గర వుంటే ఎంత బాగుండును! ఈ ఆలోచన వచ్చేసరికి కెనిరీకి పట్ట శక్యంకాని బాధ బయలు దేరింది. ఇంటిదగ్గర హాయిగా నెచ్చగా...టేబిల్ మీద కూచుని ఎదురుగుండా వేడి వేడి టీ కప్పులో ఆవిరులు లేస్తూంటే...రెండు చేతుల్తోటి పట్టుకొని...సువాసన గల్గిన ఆ ఆవిరిని పీలుస్తూ, ఒక్కొక్క గుక్క తాగుతూ గుటక వేస్తూంటే...ఆహాహా! ఎంత హాయిగా ఉంటుంది! ఒక్క గుక్క వేడి టీ!

ఆలోచించేకొద్దీ తానీ గండంగడిచి బైటపడతాననే నమ్మకం, కెనిరికి సన్నగిలిపోతున్నట్టు అనిపించింది. పిల్లలు గుర్తుకొచ్చారు. ఒక్కసారి గుండె గుభేలుమంది. "ఇక వాళ్ళనీ జన్మలో చూడలేను కాబోలు" అనుకున్నాడు. తన బ్రతుకు ఏమవుతుంది ?, ఏమవుతుందనే ఆలోచన ఒక్కసారి బద్దలై పోయి అతని కళ్లెదురుగా మృత్యువు భయంకరంగా సాక్షాత్కరించింది !

మొట్టమొదట తనను ఆవహించింది గొడ్డు భయమైతే ఇప్పుడు నిరాశా, నిస్పృహలు ఆవహించాయి. ఒక్కసారిగా గుండె బ్రద్దలైపోయినంత పని అయింది.

నెమ్మదిగా లేచి తోలుసంచి దగ్గరకు వెళ్ళాడు. అడుగులు జాగ్రత్తగా, పదిలంగా వేయాలి. ఈ మంచు దిబ్బకు ఏమాత్రం అదటు తగలకుండా సాధ్యమైనంత ఎక్కువకాలం కాపాడుకోవాలి. తనప్రాణం అంతా దానిమీదనే ఆదారపడి ఉంది. తోలుసంచిమీద కూచుని మళ్ళీ ఏదో ధ్యానంలో పడ్డాడు. ఈ సమయానికి సూర్యుడు కృంగుతున్నాడు.

ధ్యాస యిల్లు, కుటుంబం, భార్యా మీదకు పోయింది. తన భార్య ఈపాటికప్పుడే కంగారుపడుతూ ఉంటుంది. ఆమెకు ఈ కబురు ఎవరు చెబుతారు ? ఈ నల్గురు కవలపిల్లల గతి ఏమికావాలి ? తొలిచూలు కవలపిల్లల వయస్సు నాల్గు సంవత్సరా లుంటాయి; తరువాతవాళ్ళకు రెండు సంవత్సరా లుంటాయి.

తన పనిజట్టువాళ్ళుకూడా అనేకసార్లు పని ఎగవేస్తే విసుగుకునేవారు. జట్టు నాయకుడు ఇటువంటి సంద

ర్భాల్లో కనుక్కోటానికి ఇంటికి వచ్చేవాడు. ఏడి కెనిరీ? అంటె "తుపాకి తీసుకుని ఉదయమే వెళ్ళిపోయాడ"ని భార్య జవాబు చెప్పేది.

"బలే గొప్పవాడే!" అని తిట్టుకుంటూ, చేయి వూపుకుంటూ వెళ్ళిపోయేవాడు.

కెనిరీ ఎక్కడకు వెళ్ళేవాడో మరో నరమానవుడికి తెలిసేదికాదు. అల్లాగే యిప్పుడు అతడు ఎక్కడికి వెళ్ళాడో ఎవరికీ తెలియదు! తెలుసుకొనే బాధ ఎవరికీ పట్టదు. కెనిరీ గురించిన అజాపజా మరుసటిరోజు ఉదయంకాని ప్రారంభం కాదు. రాత్రి యింటికి రాలేదని తెలిసిన తర్వాత కాని యిది నలుగురి దృష్టికీ రాదు.

సూర్యుడు పూర్తిగా క్రుంగిపోయాడు. సముద్ర గర్భంలో దూరంగా సూర్యుడు అస్తమిస్తున్న చోటునుండి మంచుదిబ్బ వరకు తళాతళా మెరుస్తూ ఒక బంగారు బాటవలె సూర్య కిరణాలు ప్రతిబింబిస్తున్నాయి. సూర్యబింబం కొంచం కొంచంగా క్రుంగుతూ సముద్రగర్భంలో అంతర్ధానమైంది. బంగారుకిరణాల బాటకూడా మాయమైపోయింది. క్రమంగా చీకటి పడుతూంది. కాని మళ్ళీ అరగంటలో సూర్యుడు ప్రత్యక్షమౌతాడని కెనిరీకి తెలుసు. సూర్యుడు ఉదయించడంతోనే మళ్ళీ మంచు కురవడం ప్రారంభమౌతుంది. అస్తమించిన చోటుకు కొంచం కుడివైపున తిరిగి సూర్యుడు ఉదయిస్తాడు.

* * *

స్వభావ రీత్యా అదేపనిగా కృంగిపోయే రకం కాదు కెనిరీ. పరిస్థితులు ఏమీ బాగుపడకపోయినా సరే, ఇక అతడు అదేపనిగా విచారించదలచలేదు. ఎల్లాంటి అవాంతరాలు వచ్చినా, ఎంత నిరాశాపూరిత సమయాలు తటస్థపడినా ఏదో కొద్దిసేపు మాత్రమే ఖిన్నుడవుతాడు. పరిస్థితులు మారినా, మారకపోయినా అతడు దుఃఖాక్రాంతు డయ్యేది కొద్దిసేపే.

ఆ వేళ ఉదయమంతా ఆకాశం మేఘాచ్ఛాదితమై ఉంది. ఇల్లా మేఘాలుండటమే కెనిరీకి ఎంతో సంతోష కరంగా ఉంది. మేఘాల చాటున సూర్యుడు ఉంటే, ఎండ ఉండదు కనుక మంచు అంతగా కరగదు.

ప్రవాహం, మంచుదిబ్బను క్రమక్రమంగా ఉత్తర దిక్కుగా చుకోటస్క సముద్రంలోకి తీసుకుపోతోంది. తీరం కేసి చూడగా, దూరదూరాల అది ఒక చిన్న పేలికిలా అస్ప ష్టంగా ఆకాశంలోని మబ్బుల్లో కలిసిపోతూ కనిపించింది. తన్ను రక్షించదలచుకున్న వారికి ఇప్పుడుకూడా ఏమంత కష్టమైన పని కాదు. ఎక్కువ దూరం లేదు. మోటారు బోటుమీద వారు రావచ్చు. దూరదర్శినికూడా వారివద్ద ఉండవచ్చు.

కెనిరీ మొట్టమొదట మంచు దిబ్బ నంతా ఒకసారి కలియజూసాడు. ఎక్కడెక్కడ నెరద లున్నాయో పరీక్షిం చాడు. అవి ఏమంత పెద్ద నెరదలు కావు. అంచుల దరిని కొద్ది కొద్ది పగుళ్ళు మాత్రమే ఉన్నాయి. సీలు జంతువంత ముక్క రాత్రి విడిపోయి కొద్దిదూరంలోనే వెంట కొట్టుకొని వస్తూంది.

మంచుదిబ్బ ఏమంత చిన్నదికాదు. ఇంచు మించు ఒక 'యూరంగా'ను దానిమీద వేసుకొనిపోవచ్చు. మంచు దిబ్బ మీద చిన్నా, పెద్దా గొప్పు లున్నాయి. కొన్ని మనిషంత ఎత్తుకూడా ఉన్నాయి. మధ్యనున్న రెండు గొప్పులమధ్య మంచు కరిగి, చిన్న నీళ్ళగుంట ఏర్పడింది. ఈ మంచు దిబ్బ లాగే సముద్రపు ఒడ్డులనున్న మంచు విరిగి ఇంకా అనేక దిబ్బలు కొట్టుకొని వస్తున్నాయి. వాటిమీదకూడా మంచు గొప్పు లున్నాయి.

తన వస్తువుల నన్నిటిని – తుపాకి, వేటాడిన రెండు సీలు జంతువులు, తోలుసంచి, వేటగాడి కర్ర, కొక్కెంతాడు – అన్నీ మంచుదిబ్బ మధ్యకు చేర్చాడు. సీలు జంతువులను కోసి శుభ్రపరచి ఆరబెట్టాడు. ఒకసీలు జంతువు కార్జాన్ని ఉదయం భోజనంగా నమిలాడు. పచ్చిమాంసమే తినవలసి వచ్చినా అతనికి ఆ సమయంలో వెగటనిపించలేదు. ఏదో యింత, మండే ఆకలికి కాలేబూడిద అన్నట్టు క్షుద్బాధ తీర్చుకో డానికి పచ్చిమాంసమే కాదు పచ్చితోలు కూడా నమిలి మింగే దశ అది ! ఇక రుచి సంగతి ఎవడిక్కావాలి ? అదే పంచభక్ష్య పరమాన్నంగా తిన్నాడు. సీలు కంటి గుడ్డుకూడా తినేశాడు. అది ఉప్ప ఉప్పగా ఉంది. ఆ తరువాత ఇంకా కరిగీ కరగని మంచును పోగుచేసి ఆ మంచుదిబ్బ మధ్యనున్న నీళ్ళకు దక్షిణవైపున గట్టులా ఏర్పరిచాడు. ఒకానొక వేళ మబ్బులు తొలిగి ఎండవచ్చినా నీళ్ళకు ఆ యెండ తగలదు. అందుచేత ఆ కొంచం నీళ్ళు ఇగిరిపోవు. అంతేకాదు కరుగుతున్న మంచు కూడా వచ్చి ఈ పల్లంలోకే జేరుతుంది. అనవసరంగా

సముద్రంలోకి పోదు. మంచినీటికి తరుగుఉండదు. ఈ పనిచేసి కెనిరీ ఎంతో ఘనకార్యం చేసినట్లు సంతోషపడ్డాడు. మంచుదిబ్బమీద ఎక్కడెక్కడ కరుగుతున్నా మంచుముద్ద కనిపించినా అదిపట్టుకొనివచ్చి ఆ గోడను ఎత్తుచేశాడు. ఇప్పు డది దాదాపు తన గుండెలదాకా వచ్చింది.

ఇక ఆ తరువాత తాను ఏం చెయ్యాలి? తోలుసంచి వేసుకుని అందుపై కూచుని తుపాకిని శుభ్రంచేయడం మొదలుపెట్టాడు. నిన్న ఎప్పుడైతే తాను కొట్టుకుపోవడం ప్రారంభించాడో అప్పుడు వెంటనే రెండు మూడు బారులు తుపాకి పేల్చి ఉండవలసింది. అల్లా చేసినంత మాత్రాన ఎవరిదృష్టి అయినా యిటు ఆకర్షించబడేదా? దుర్ఘటన జరిగి నట్టు వాళ్ళకి తోచేదా? ఊరు చుట్టుపక్కల యెప్పుడూ, ఎవరో ఒకరివి తుపాకీమోతలు విన్పిస్తూనే ఉంటాయి. తాను సీలు జంతువులను పడేసినప్పుడు తుపాకి చప్పుడు ఎవరికి అదటు కల్గించింది? అయినా నిన్న తనేదో చెయ్యలేదని యీవేళ మధనపడి ఏం లాభం? తిరిగి మొదటికి వెళ్ళగలడా, వెళ్ళి తుపాకిమోత విన్పించగలడా, ఏమన్నా నా? కొట్టుకు పోతున్నట్టు తెలియగానే తాను ఏ విధంగా కేకలు పెట్టి గంతులువేసిందీ కెనిరీకి జ్ఞాపకంవచ్చి నవ్వుకున్నాడు. ఇంకా నయం! తన కంగారు, తన గంతులు ఎవరికంటా బడలేదు.

తనకోసం వెతికేవాళ్ళు నిన్న బయలుదేరితే ఏమి? ఈవేళ బయలుదేరితే ఏమి? తాను మంచు, దిబ్బమీదే మరి కొంతదూరం కొట్టుకొనిపోతాడు. తింటానికి మాంసం ఉంది, తాగడానికి నీళ్ళున్నాయి. మంచుదిబ్బ వారం రోజులదాకా

కరిగిపోకుండా నిలబడుతుంది. చివరికి తాను బ్రతికి బైట పడితే ఈ వింత సాహసగాథను కథలుగా ఎన్నిరోజులైనా వూళ్ళోవాళ్ళకి చెప్పవచ్చు.

ఈపాటికి వెతికేవాళ్ళు బయలుదేరకుండా ఉంటారా? ఆ విషయంలో ఆందోళన పడవలసిన అగత్యం ఏమీలేదు. ఒకవేళ ఎవరూ బయలుదేరకపోతే...తన భార్య అసలు ఊరుకోదు...వెంటనే ముందు ఖోల్కోజ్ మేనేజరు వామ్చ్ దగ్గరకు పరుగెత్తుకొని వెడుతుంది. ఒకవేళ అతడు రక్షక దళాన్ని పంపించడానికి యిష్టపడ డనుకుందాము.

"ఏమిటీ! మీ కెనిరీ కొట్టుకొని పోయాడా? అంతే, వాడి గతి అల్లాగే కావాలి. పోతే పోయాడులే...దరిద్రుడు వాడికోసం ఏడవబోకు. మా కంతకంటె విచారంలేదు. ఈ సోమరిపోతు ఉంటేనేం? పోతేనేం? చక్కగా పని చేసుకొనే వాళ్లని వీణ్ణి వెతకడానికి పంపి వాళ్ల ప్రాణాలకుకూడా ముప్పు తే దలచుకోలేదు. మోటారుబోటునుకూడా ఈ దౌర్భాగ్యుడి కోసం పంపదలచుకోలేదు. సముద్రంలో ఒకటా...రెండా... అనేక మంచుదిబ్బలు కొట్టుకొని పోతున్నాయి. వాటి మధ్య బడి ఈ మోటారు బోటుకాస్తా నల్గిపోతే? ఇక మనుష్యులను పంపించండం సంగతంటావా? వాళ్ల కిక్కడ బోలెడంత పని ఉంది" అని వామ్చ్ అంటాడేమో!

వృద్ధ మేమిల్ కూడా ఆ సమయంలో అక్కడే ఉండడం తటస్థిస్తే - అతడుకూడా ఖోల్కోజ్ బోర్డు సభ్యుడేకదా, మరి కొంచం ఎగసం తోస్తాడు. "కెనిరీయా...వాడు వట్టి త్రాష్టుడు. బడాయికోరు, సోమరిపోతు. వాడితో ఇంతవరకు పడిన అవస్థ

చాలు! ఇంకా ఎందుకు? ఈ శనిగాడు వదలిపోయాడు. వీడితో పడ్డ అవస్థలు ఇన్నీ అన్నీనా? వీడు వళ్ళువంచి పనిచేయక పోతే ఈ దళంలోంచి ఆ దళంలోకి, ఆ దళంలోంచి ఈ దళం లోకి మార్చలేక చచ్చాం. ఒకసారి వీడి తిక్క కుదిరి కొంచం దోవలో పడ్డాడనుకున్నాం. మళ్ళీ మొదలు వీడూ...వీడి బలాదూరులున్నూ...వాడి ఖర్మ అంతేకావాలి! చేజేతులా చేసుకున్నాడు. వస్తాడా...బ్రతికి వాడంతట వాడే వస్తాడు. పోతాడూ...దరిద్రం వదిలిపోతుంది."

తుపాకి తుడుస్తూ తుడుస్తూ, కెనిరీ ఒక్కసారి నవ్వు కున్నాడు. పాపం! వాళ్ళేగాని, మేమిల్‌గాని ఎప్పుడైనా తన గురించి ఇల్లా అనుకున్నారా? వాళ్ళు అల్లా అనుకునే మనుషులేనా? కారు. బహుశా, వాళ్ళే స్వయంగా తనే రక్షకదళంతో బయదేరి ఉండవచ్చు. రానిస్తే, మేమిల్‌కూడా తప్పక బయలుదేరి ఉంటాడు. ఏమీ సందేహం అక్కరలేదు. ఈపాటికి తన్ను వెతకడానికి బయలుదేరే ఉంటారు.

కెనరీకి ఎందుకో కొంచం బాధనేసింది. తనతోటి పని వాళ్ళ గురించి, ఇరుగుపొరుగువాళ్ళ గురించి తాను అల్లా ఊహించుకోవడం సబబేనా? తనగురించి వాళ్ళు అలా భావించుకుంటేమాత్రం వాళ్ళలో తప్పు ఏముంది? తనబడాయి కోరుతనం, బద్దకంగురించి ఎన్నిసార్లు వాళ్ళు మారామర్మం లేకుండా హెచ్చరించలేదు? "నువ్వు పని ఎగగొడుతున్నావు ...ఇది మంచిపద్ధతేనా?" అని వాళ్ళు ఎన్నిసార్లు మందలించ లేదు? "నీ ధ్యానం పనిమీద ఉండటంలేద"ని ఎన్నిసార్లు బహు పరాక్ చెప్పలేదు? ఇందులో వాళ్ళ తప్పేముంది?

నిజంగా చెప్పాలంటే తనెవరు? ఖోల్కోజ్‌కి తనవలన ఉపయోగం ఏమిటి? తాను అవడానికి మంచివేటగాడే... కాని అయితేం? మంచివేటగాడి కుండవలసిన లక్షణాలు ఇవేనా! మంచివేటగాడు కష్టించి పనిచేయాలి. సహనం, ఓపికా ఉండాలి. రింటుష్కీకి, యుస్పెనర్‌కి తాను ఏమీ తీసిపోడు. గురిచూసి కొట్టడంలో ఒకరవ్వ ఎక్కువగా ఉంటే ఉండవచ్చుకూడా. వాళ్ళిద్దరు చాలా ప్రఖ్యాతిపొందిన వేటగాళ్ళు. వేటకువెడితే తనకంటె వాళ్ళు ఎక్కువే యిళ్ళకు తీసుకువస్తారు. గౌరవస్థానాలనుండి వాళ్ళపేర్లు, వాళ్ళచిత్తరువులు ఎప్పుడూ తొలగవు. కెనిరీకి లేక సుగుణాలు ఏవో వారిలో ఉండి ఉండాలి.

కెనిరీదగ్గర మంచిపనివాడితనం ఉంది. ఒకసారి వాళ్ళ మామగారికి స్లెడ్జిబండి చేసియిచ్చాడు. ఆవూళ్ళో కంతటికీ అంత అద్భుతమైన బండి ఎవరిదగ్గరా లేదు. కాని లేళ్ళ పెంపకం దళానికి అటువంటిదే మరో స్లెడ్జి తయారుచేసి ఇవ్వవయ్యా! అని వాళ్ళు కెనిరీని నియామకం చేశాడు. కాని నాటికి నేటికి కెనిరీ ఆ పని పూర్తిచేయనేలేదు.

ఖోల్కోజ్ పని ఎగకొడుతున్నాడని కెనిరీ ఎన్నిసార్లు తిట్లు, చీవాట్లు, తిన్నాడో అంతులేదు. పోతే టండ్రాల్లోకి వేటకేనా పోయేవాడు. లేదూ...పక్కవూళ్లో 'స్కైట్' లు అమ్ముతున్నారని తెలిసి ఎండలు పెళ్ళేస్తున్నా లెక్కజేయకుండా అక్కడకు పడిపోయేవాడు. లేకపోతే ధృవమండలం స్టేషనులో అసిస్టెంట్ డాక్టరుతో చదరంగం ఆటకని పోయేవాడు.

చదరం సంగతి చెప్పుకోవలసివస్తే డాన్ ఖోల్కోజ్‌లో కెనిరీదే మొదటి చేయి. డాన్ ఖోల్కోజ్ ఏమిటి ? జిల్లా టోర్నమెంటులో మొనగాళ్లలో ఒకడనిపించుకున్నాడు. ప్రాంతీయ చదరంగం పోటీల్లో పాల్గొనడానికి కెనిరీని అనాదిర్ కూడా పంపారు. అయితే ఇదంతా కెనిరీ గొప్పతనమని ఖోల్కోజ్ సభ్యులు, ముఖ్యంగా మేనేజిమెంటు అంగీకరించలేదు.

అనుకున్నట్టుగానే అనాదిర్‌లో కెనిరీ ఆటంతా పాడు చేశాడు. చిట్టచివరి వాళ్ళలో ఒకడుగా వచ్చాడు. అందుచేత, ఆ తర్వాత ఖబరోవస్క్‌లో జరిగిన ఖోల్కోజ్ చదరంగపు ఆటగాళ్ళ ప్రాంతీయ పోటీలకు కెనిరీని పంపలేదు. ఆ పోటీలో లేళ్ళమందల కాపరి 'ఐగింటో' అనే అతడు నెగ్గాడు. అతడు కెనిరీతో వెళ్ళిపోతూ వెళ్ళిపోతూ ఇల్లా అన్నాడు: "ఆట ఆడటం బాగానే ఆడతావు. కాని నీకు సూత్రాలు తెలియవు. అందుచేత ఆట సూత్రాలను నీవు బాగా అధ్యయనం చేయాలి."

తుపాకి పక్కనబెట్టి, లేచి నిలబడి నల్దిక్కులా కెనిరీ కలయచూశాడు. ఈ సర్వప్రపంచంలోను, తానొక్కడే ప్రాణం ఉన్న జీవి అనిపించింది. అదైనా భూమిమీద కాదు; జలంమీద. నిజంగా తాను యింటికి చేరడం సంభవిస్తే, ఎంత వింతగాథ అయినా చెప్పవచ్చు.

మళ్ళీ తుపాకి చేతబుచ్చుకుని ఆలోచనల్లో మునిగిపోయాడు కెనిరీ.

తన కుటుంబానికి తాను ఏమి ఉపయోగపడుతున్నట్టు? ఔయూనీ తనకంటె రెట్టింపు సంపాదించుతోంది. కుటుంబానికి ఆమే ఆర్జనపరురాలు. కుట్టుకుట్టే దళంలో కందరికీ ఆమె ఎంతో నిపుణురాలు. ఒక్క రుట్టినీ తప్ప, ఎవరూ ఆమెకు సాటిరారు.

అతని చంచలమైన ఆలోచన భార్యా పిల్లలవైపు తిరిగింది. వాళ్ళలో ఘనత ఏమైనా ఉంటే, అందుకు కారణం తానే అనుకోసాగాడు. భార్యను తలుచుకుంటే గర్వం వేసింది. తన భార్యకు అంత నిపుణమైన కుట్టుపని తాను నేర్పితేనే వచ్చినట్టు, రుట్టినీ ఏమీ నేర్పనట్టు అనుకోసాగాడు. తన భార్యకు లేడిచర్మంపై ఎంబ్రాయిడరీ కుట్టు ఎంతో బాగా వచ్చు. కెనిరీకి తన కవలపిల్లల సంగతి జ్ఞప్తికి వచ్చి మనస్సంతా ప్రేమతో, వాత్సల్యంతో నిండిపోయింది. తనకి రెండుసార్లు కవలపిల్లలు పుట్టారు. అటువంటి అదృష్టం అందరికీ పడుతుందా? దానంతటది జరగాలికాని!

రెండోసారి తమకు కవలపిల్లలు పుట్టారని తెలియడంతోనే, పత్రికలన్నీ తమ గురించే వ్రాయడం మొదలు పెట్టాయి. ఔయూనీని నెల రోజులపాటు ప్రసూతి కేంద్రంనించి కదలనివ్వలేదు. బిడ్డలకు జలుబు చేస్తుందేమో నని డాక్టరు అనుక్షణమూ ఎంతో జాగ్రత్త తీసుకొనేవారు. ఆ తరువాత క్రమంగా యిళ్ళు నిర్మించడానికి ఈ వూరికి దుంగలు దింపారు. అందులో ఒక యింటిని కెనిరీ కుటుంబానికి కేటాయించారు. ప్రాంతీయ కార్యవర్గం ప్రత్యేకంగా ఇందుకు ఒక తీర్మానం చేసింది. అప్పటికి ఊళ్ళో అందరికీ

యరంగాలే. అయిదుగురికి మాత్రమే కర్రదుంగల యిళ్ళు యిచ్చారు. జంటకవలలు గల తన కుటుంబానికి ఆ యిచ్చిన వాటిలో ఒకటి.

ఇప్పుడు తన చంటిపాపలు ఏంచేస్తూంటారో? పెద్ద కవలలు ఒల్గిమిల్ కాప్, ఐగిలీ ఇద్దరికీ కొంచం ప్రాజ్ఞతవచ్చింది. తల్లి విచారంగా ఉండటం చూసి తండ్రికి ఏదో ఆపద సంభ వించినట్టు వారు వూహించుకోగలరు. రెండవసారి పుట్టిన కవలలకు యిప్పటికి మూడేళ్ళు వచ్చిఉంటాయి. వాళ్ళకి కొద్ది కొద్దిగా వూహాపోహలు వచ్చిఉంటాయి. ఒకడిపేరు కోల్యా మరొకడిపేరు షాషా. ప్రసవసమయంలో ఎంతో జాగ్ర త్తగా చూసిన రష్యన్ డాక్టర్ల గౌరవార్థం తనభార్య కోరి ఆ రష్యన్ పేర్లు పెట్టించింది. అందులో ఒక డాక్టరు పేరు నికో లాయ్ పెట్రోవిచ్. మరొకతని పేరు - అతడే పెద్దడాక్టరు - అలెగ్జాండ్రా ఇవనోవా. రష్యన్ పేర్లు పెట్టమని భార్య కోరినప్పుడు తాను వెంటనే అంగీకరించాడు. వాళ్ళకి నికోలాయ్, అలె గ్జాండర్ అని పేర్లుపెడదా మన్నాడు. అయితే రష్యన్ పేర్లు పెడితే మరి తండ్రి తాతలపేరు ముందు ఉండవద్దా? నీ వుద్దేశ్యం ఏమిటి చెప్పు అని భార్యను అడిగాడు. వీళ్ళు ఎదిగి పెద్దవాళ్లయి స్కూలు చదువు ముగించి, కాలేజీకి చదువుకు వెడతారు. తన కొడుకులు తప్పక కాలేజీ చదువులకు వెళ్ళా లని కెనిరీకి ఉంది. అట్యాక్ సంగతి చూస్తే...అతని కొడుకు లెనిన్ గ్రాడ్‌లో చదవడంలేదూ? తన కొడుకులు కూడా లెనిన్‌గ్రాడ్ వెళతారు. అక్కడ తన కొడుకుల పేరు ఒక పెద్ద రిజిష్టరులో వ్రాస్తారు. తాను అనాదిర్ చదరంగం పోటీకి వెళ్ళి

నప్పుడు తన పేరు అదేవిధంగా వ్రాశారు. తన తండ్రి పేరు మాత్రం అడగలేదు. చుకోట్కా ప్రాంతంలో తండ్రి తాతల పేర్లు కలపరు. వ్యక్తిపేరు మాత్రమే ఉంటుంది. కాని లెనిన్‌గ్రాడ్‌లో పరిస్థితి వేరు. పిల్లలకి పేరు పెట్టేటప్పుడు తండ్రి తాతలపేర్లు కూడా తగిలిస్తారు. నికోలాయ్ కెనిరీవిచ్, అలెగ్జాండర్ కెనిరీవిచ్...ఇల్లా వుంటాయి వాళ్ళ పేర్లు.

కోల్కా ఇక తన తండ్రిని చూడటమే తటస్థించక పోతే? వాడు పెరిగిపెద్దవాడైనప్పుడు "ఒరేయి ! నీతండ్రి కెనిరీ వట్టి బడుద్ధాయి లా ఉండేవాడురా...వట్టి సోమరిపోతు" అని అంటారు. చచ్చిపోయిన వాడిగురించి తరువాత ప్రజలు ఏమని చెప్పుకుంటారో ఎలా తెలుస్తుంది ?

కెనిరీకి యిప్పుడు మనస్సులో వేరే ఆందోళనలు ఏమీ లేవు. అప్రియవిషయాలను తలుచుకోవాలనే ఇప్పుడు తలుచు కోవడం మొదలుపెట్టాడు. ఎల్లాగో అలాగ తన మనస్సుకి కొంచం కాలక్షేపం కల్గించుకోవాలి.

తనకోసం ఎవరైనా రాకపోతారా...అని లోలోపల అనిపిస్తూనే ఉంది కెనిరీకి. త్వరలోనే ఒక మోటారుబోటు తనకు ప్రత్యక్షంకావచ్చు. తాను చేయవలసిందల్లా ఓపికతో వేచి ఉండటమే......మళ్ళీ తన మనస్సులో తన పాపలు మెరిసారు !

తన పిల్లలు లెనిన్‌గ్రాడ్‌లో చదవడమే తటస్థిస్తే వాళ్లకి యింటిపేర్లు కూడా అవసరమవుతాయి. ఈ ఆలోచన వచ్చేసరికి కెనిరీ తనలో తానే గందరగోళపడిపోయాడు. తండ్రిపేరయితే జేర్చవచ్చు; యింటిపేరు ఎల్లాగ పెట్టడం ?

ఇంతక్రితం తాను ఎప్పుడు ఈ విషయం ఆలోచించనే లేదు. స్కూలు కాపలా వాని పేరు "అంకుల్ స్టీఫెన్" పూర్తిపేరు స్టీఫెన్ ఆంద్రియేవిచ్ కాబిట్‌స్కీ. అంటె అతని తండ్రి పేరు ఆంద్రియేవ్. కాని 'కాబిట్‌స్కీ' పేరు ఎల్లా వచ్చి పడింది? ఈ విషయం అంకుల్ స్టీఫెన్‌నే అడగాలి. లేకపోతే అసిస్టెంట్ డాక్టర్ అలెక్జీ వాడిమిచ్‌ని అడగాలి. ఇంటిపేరు...యిష్టం ఉన్నా ఏ పేరునైనా పెట్టుకోవచ్చు.

ఈ మధుర భావనల్లో కెనిరీ అదేవిధంగా కొట్టుకు పోయేవాడే. కాని ఈ మంచు దిబ్బకు సమీపంలోనే ఒక పెద్ద మంచుముక్క కొట్టుకొనివస్తోంది. కెనిరీ ఉన్న మంచు దిబ్బకు అది వచ్చి తగిలిందంటే సర్వనాశనం సంభవించిందన్న మాటే. మంచు దిబ్బ వచ్చి ఢీకొంటే తాను నిలబడిన గడ్డ విడిపోయి వూరుకుంటుంది. అందుచేత కర్ర చేతబట్టుకొని లేచాడు. ఆ మంచు గడ్డ అల్లంతదూరాన ఉండగానే కర్రతో పక్కకు నెట్టివేయాలి. ఆ మంచుగడ్డ దగ్గరగా వచ్చి నప్పుడే అది ఎంతవేగంగా కొట్టుకొని వస్తోందో అర్థ మైంది. కాళ్ళు రెండు ఎడంగాపెట్టి పదిలంగా మంచుదిబ్బ అంచున నిలబడి వచ్చే వచ్చే మంచుగడ్డను కర్రతో నెట్ట డానికి కెనిరీ ప్రయత్నించాడు. కాని కర్ర జారిపోయింది. కెనిరీ తూలిపోయి పడిపోయాడు. మంచుగడ్డ వచ్చి ఢీకొంది.

వెంటనే ఒక్క గంతులో లేచి కెనిరీ నల్దిక్కులా చూశాడు. చివరకు అనుకున్నంతపని జరిగింది. తన మంచుదిబ్బ రెండింటిక్రింద విడిపోయింది. ఒక ముక్కమీద తానుఉన్నాడు. మరో ముక్కమీద తుపాకి, సంచి, తాడు, వగైరా

ఉన్నాయి. కెనిరీ ఒక్కదూకు దూకాడు. కాని జారిపడ్డాడు. లేచి తనవస్తువు లన్నీ తీసుకుని సీలు జంతువులు చేతికంద ఉన్న భాగంమీదికి తిరిగి దూకుదామని అతని ప్రయత్నం. ఎందుకంటే అదే కొంచం పెద్దదిగా కనుపిస్తోంది. కాని ఏమాత్రం ఆలస్యంచేసినా సమయం మించిపోతుంది. రెండింటికి ఎడం ఎక్కువైపోతుంది. చూస్తూ చూస్తూ ఉంటే దూకే ధైర్యమే ఉండదు. నిజానికి మధ్యనున్న దూరం మొదట ఏమంత ఎక్కువగా లేదు. ఎల్లాగైతేనేం? కళ్ళుమూసుకుని కెనిరీ ఒక్కదూకు దూకాడు. అల్లా దూకడమే మంచిపని అయింది. ఆలోచిస్తూ కూచుంటే చెయ్యిదాటి పోయేది. కెనిరీ వెంటనే కొక్కెంతాడు విప్పి విడిపోయిన మంచుదిబ్బకేసి విసిరాడు. ఆ గేలం వెళ్ళి రెండో మంచుదిబ్బ గొప్పుకు బాగా తగులుకుని పట్టుకుంది. తాడుసాగి పటపట లాడటం మొదలు పెట్టింది.

ఒకవేళ దురదృష్టవశాత్తూ, తాడు తెగిపోయిందో... ఇక చేతులు మొండిపడినట్లే. తుపాకి ఉన్నా ఏమీ లాభం లేదు. తుపాకితో సీల్‌ను వేసినా, నీళ్ళల్లోంచి దగ్గరకు లాగు కునే ఉపాయం ఏమీలేదు. పట్టుతో బిగిసి తాడు తన చేతిని కోసివేస్తోంది. వగర్పు. ఆయాసంతో నోరు ఇగిరిపోయింది కెని రీకి. కాని, ఆ విడిపోయిన మంచుగడ్డ క్రమంగా దగ్గర బడుతోంది. ఎడం తగ్గిపోయింది. తాడుబిగి సడలింది. రెండు దిబ్బలు దగ్గరకు రావడంతోనే కెనిరీ దానిమీదికి దూకాడు. సీళ్ళు యథాస్థానంలోనే ఉన్నాయి. సంచి క్రింద పడేసి, దానిపై చతికిలబడ్డాడు. తడి ఆరిపోయిన పెదవులను

పిడచగట్టుకొనిపోయిన నాలికతో తడిపాడు. ఇంతక్రితం అక్కడ ఉన్న మంచినీళ్ళ గుంటకేసి సాలోచనగా చూశాడు. మంచుదిబ్బ రెండింటిగా విడిపోయింది ఆ గుంటలోంచే. ఆ మంచినీళ్ళ గుంట అక్కడ లేనేలేదు. ఆ నీళ్ళన్నీ సముద్రం లోకి జారిపోయాయి. ఎంతో శ్రమపడి పేర్చిన మంచు అంతా ఎక్కడిదక్కడ పోయింది.

ఈ మానవుడి కాలిక్రింద ఆధారంగా మిగిలిందల్లా ఒక చిన్న మంచుగడ్డ అన్నమాట! ఎంత విచిత్రం? ఈ ప్రపంచ మంతటిలోను తన జీవనానికి ఈ మంచుగడ్డ ఆధారమన్న మాట! ఇదైనా పెద్దదికాదు. రెండు రోజుల ఎండదెబ్బకు తట్టుకుంటుందో తట్టుకోదో! పైపెచ్చు ఒక మంచినీటి చుక్క కూడా లేదే?

* * *

చుకోటస్క సముద్రంలో కెనిరీ కొట్టుకొని పోవడం మొదలై మూడు రోజులైంది. మూడు పగళ్ళు - మూడు రాత్రిళ్ళు గడిచాయి. ఇక తీరప్రాంతం అసలు కన్పించడమే లేదు. దూర దూరంగా ఉన్న మంచుదిబ్బలే ఒక్కోసారి తీర మనిపించేవి. కాని, అవికూడా తనకుమల్లేనే సముద్రంలో కొట్టుకొని వస్తున్నాయని గుర్తించేవాడు.

అంత క్రితం రోజుకంటె ఆకాశం నిర్మలంగా ఉంది. అయితేనేం? దానివలన తనకు ఒరిగే దేమీలేదు. పైపెచ్చు తాను మరో సురక్షిత స్థానం చూచుకోవలసి వస్తుంది సాధ్య మైనంత త్వరలో.

ఇంతకంటే పెద్ద మంచుదిబ్బ చూసి దానిమీదకి మారాలి. ఈ విషయంలో అప్పుడే తాను కొంత అనుభవం కూడా సంపాదించాడు. కాని ఆ నాటి ఉదయం ఒట్టుపెట్టు కున్నట్టు సరియైన మంచుదిబ్బ ఒక్కటికూడా కనపడనేలేదు.

కెనిరీకి కడుపు పట్టినంతా పచ్చిమాంసం తినేశాడు. కాని ఆ తర్వాత విచారించాడు యింత సుష్టుగా ఎందుకు తిన్నామా? అని. అతనికి మరింత దాహం వేయడం మొదలు పెట్టింది.

వాల్రస్‌లు నీటిలో చేసే బుడబుడ ధ్వని వినవచ్చింది. యున్వెనర్ చెప్పినమాట నిజమే. అవి బుడబుడ ధ్వని చేస్తాయి. ఈ ధ్వనిని మహా సునిశితంగా యున్వెనర్ కనిపెట్టగలడు. వాల్రస్‌లు ప్రతీ వసంతకాలం ముందు మందలు మందలుగా సముద్రంలో తిరుగుతాయి. యున్వెనర్ ఎల్లా పసిగడతాడో ...ఏమిటో అతని దళమే ముందు వేటదెబ్బకొట్టేది.

మళ్ళీ కెనిరీ ధ్యాస తన వూరిమీదకు పోయింది. ఈసారి ఏమంత ఉత్సాహం కల్గలేదు అతనికి. తనకోసం ఎవరైనా వెతుకుతూ వస్తారో? ఏమో? మళ్ళీ తన కున్న చెడ్డ పేరంతా జ్ఞాపకం వచ్చింది. అంతక్రితం రోజున ఈ విషయమై తనకు ఎట్టి సందేహము భయమూ ఉండేదికాదు. ఈరోజున ఎందుకో భయం వేస్తోంది. తన రక్షణకోసం ఎవరైనా బయలుదేరతారా? బయలుదేరవచ్చు కాని ఏ పద్ధతిలో అన్నదే సమస్య. ఇదే ప్రమాదం యున్వెనర్, రింటుఘ్లీ లేక వాళ్ళెవ్వరికి సంభవిస్తే వాళ్ళని ఈపాటికి వలలువేసి వెతికినట్టు వెతికి రక్షించి ఉండేవారు. ఒక్క మోటారు బోటు

ఏమిటి ? అన్ని మోటారు బోట్లూ బయలుదేరి ఉండేవి. మోటారు బోట్లేనా ? నాటు పడవలు అన్నీ బయలుదేరి గాలించేవి.

తాను ఎక్కిన మంచుదిబ్బ ఎప్పుడైతే రెండింటి క్రింద విడిపోయిందో అప్పటినుండి తాను మరింత ఏకాకి అయిపోయి నట్లు కెనిరీకి అనిపించసాగింది. బహుశా జీవితంలోనే కెనిరీకి ఏకాకితనం అన్పించింది ఇప్పుడేనేమో !

మధ్యాహ్నం వేళకి తనికి ఒక ఇరవైగజాల దూరంలో ఒక మోస్తరు పెద్ద మంచుదిబ్బ కొట్టుకొని వస్తూండటం కెనిరీ చూసాడు. దాని చుట్టూ విరిగిన మంచుముక్కలు కూడా ఉన్నాయి. కెనిరీ కొక్కెంతాడు విసిరాడు కొక్కెం తగు ల్కొని అదికూడా తనతో కొట్టుకొని రా సాగింది కాని చుట్టు విరిగిన మంచు ముక్క లుండటంవలన కొక్కెం బిగవ లేదు. అందుచేత ఆ మంచు దిబ్బ దగ్గరకు రాలేదు. అయి నప్పటికీ కెనిరీ ఆశ వదలలేదు. ఆ దిబ్బమీాద కొంచెం మంచు కరిగి మంచినీళ్లు దొరికే అవకాశం ఉంది. ఇప్పుడు తనకు అత్యావసరంగా కావలసింది అదే. అంతేకాదు ఇక ఎంతో సేపు తాను ఉన్న మంచుముక్క తనకు రక్షణ యివ్వ లేదు. సూర్యకిరణాలకు క్రమక్రమంగా కరిగిపోయి హరించుకుపోతోంది. అందుచేత మరొక ఆశ్రయం ఎల్లాగూ చూసుకోవాలి.

దగ్గరలో ఉన్న మరికొన్ని మంచుగడ్డలు మనిషి బరు వును ఆపేటంతగా ఉన్నాయి. ఒకదాని మీాదనుంచి మరొక దానిమీాదకు వెళుతూ చివరకు ఆ పెద్దమంచుదిబ్బ చేరుకో

వచ్చు. కెనిరీ ఒక నిశ్చయానికి వచ్చేశాడు. ఈవిధంగా చేయడం ప్రమాదంతో కూడుకున్న పనే. అయితే యిక వేరే గత్యంతరం ఏముంది ?

చెయ్యి ఒక్కసారి విదిపి తోలుసంచిమీంచి లేచి నుంచున్నాడు. తుపాకిని మెడలో ఏటవాలుగా తగిలించు కున్నాడు. కొక్కెంతాడును నడుంచుట్టూ చుట్టుకున్నాడు. "ఈ సీలు జంతువులను ఇక్కడే ఉంచుదాం. ఆ తర్వాత వీటిని నెమ్మదిగా తీసుకోవచ్చును" అనుకున్నాడు.

తనకు దగ్గరగావున్న మంచుగడ్డమీద కాలువేసి అది తన్ను ఆపుతుందో లేదో వూపిచూసి కెనిరీ ముందు దాని మీదకు దూకాడు. అటుపైన ఆ తరువాత దానిమీదకు... ఆ తర్వాత మరో దానిమీదకు గెంతాడు. తాను వెళ్ళ దలచిన మంచుదిబ్బ దగ్గరలోనే ఉంది...ఇంకేముంది ? కెనిరీ కాలుజారిపోయింది. అమాంతంగా ముందుకు పడిపోయాడు. మంచుగడ్డ తల్లక్రిందులై పోయింది. కెనిరీ సముద్రంలోకి దొర్లిపోయాడు. చేతులతో తపతపా కొట్టుకోవడం మొదలు పెట్టాడు. చుట్టూ చేతులకు మంచుముక్కలు తగులుతూ అడ్డుపడుతున్నాయి. ఎల్లాగైనా పెద్ద మంచుదిబ్బను చేరు కోవాలని అతడు విఫలయత్నాలు చేశాడు. వంటిమీద నున్న తుపాకి, బట్టలు తడిసి మోపెడై క్రిందకు దిగలాగుతున్నాయి. అనేకసార్లు కెనిరీ మునకలు వేశాడు. ఒకసారి పైకి రావటం, దుర్ఘటమై పోయింది. ఈ కెరటాలు యిక శాశ్వతంగా తనను మింగివేస్తున్నాయేమో ననిపించింది. చర్మాన్ని చిల్లులు పొడిచేటంత శీతలంగా ఉన్నా, ఆ సముద్రపు నీళ్ళల్లోంచి

ఎల్లాగో మళ్ళీ తలయెత్తాడు. తన ఒంట్లో ఉన్న శక్తినంతా కూడదీసి, భయంకర మృత్యువుతో నిస్సహాయంగా పోరాడుతూ కెనిరీ, మళ్ళీ చేతులతో కొట్టుకోసాగాడు.

తన నడుంచుట్టూ కట్టుకున్న కొక్కెంతాడు చేతికి తగిలింది. ఇంతవరకూ దాని కొక్కెం పెద్ద మంచుదిబ్బకు తగులుకుని ఉన్న సంగతీ, కొసభాగం తన నడుంచుట్టూ ఉన్న సంగతీ స్పృహలో లేదు. ఆ తాడుతో చిక్కుపడిపోతుం దేమోనని ఒక్కసారి తన చేయిని విదిలించుకున్నాడు. మెదడులో ఒక్క మెరుపు మెరిసింది. తన ప్రాణానికి ఇక ఆ తాడు ఒక్కటే ఆధారం. అనుకున్నదే తడవుగా గబగబా నడుం చుట్టూ ఉన్న తాడు ఆధారం చేసుకొని, దాని వెంబడే పెద్ద మంచుదిబ్బ వద్దకు జేరసాగాడు. ఈ లోగా మళ్ళీ ఒకసారి కెనిరీ మునిగిపోయాడుకాని, తాడు ఆధారం దొరికింది గనుక దానినే గట్టిగా పట్టుకొని పళ్ళు బిగబట్టి, ముందు ముందుకు సాగి ఎల్లాగో మంచుదిబ్బ అంచు జేసుకున్నాడు. పట్టు దొరికింది. పైకి ఎక్కాడు. అతని గుండెలు విపరీతంగా కొట్టుకుంటున్నాయి. బరువుగా ఊపిరి పీలుస్తున్నాడు. ఎక్కీ ఎక్కడంతోనే, మంచుదిబ్బమీద వెల్లకితలా పడిపోయాడు. చెవుల నిండా, ముక్కులనిండా, నోటినిండా ఉన్న నీరు కారుతోంది. తల పగిలిపోతోంది. విరిగిన మంచుముక్కలు గీసుకొనిపోయి ముఖం, చేతులు రక్తం కారుతున్నాయి.

అల్లాగే బరువుగా గాలి పీలుస్తూ, మరి రెండడుగులు మంచుదిబ్బ మధ్యకు జరిగాడు. దాహంతో నాలుక ఎండిపోయింది. ఒక్కసారి ఎంతో ఆశతో మంచుముక్కలు నోట్లో

వేసుకుని నమిలాడు. ఆ తర్వాత మళ్ళీ వెల్లకితలా పడు కొన్నాడు. తనకి విశ్రాంతి కావాలి. కాని బట్టలు, వళ్ళు అంతా తడిసి ముద్దక్రింద ఉన్నాయి. చలికి వొళ్ళంతా బిగుసుకు పోయింది. లేచి బట్టలు విప్పుకోడానికి కూడా ఓపిక లేదు.

చన్నీళ్ళలో పడి నీలివర్ణంగా తయారైపోయిన తన శరీరాన్ని మంచుముక్కలు పెట్టి కెనిరీ రుద్దాడు. దానితో వొళ్ళు కొంచెం వేడియెక్కింది. ఆ తరువాత మంచుదిబ్బలో బాగా దిగబడిపోయిన కొక్కెంతాడును నిమ్మళంగా వూడదీశాడు. రెండు మంచుగొప్పులు, కొంచం పెద్దవిచూసి వాటి మధ్య తాడుకట్టి బట్టలు ఆరవేశాడు. తడితో బరువెక్కిఉన్న బట్టలు వేసేసరికి తాడుమధ్య క్రిందికి సాగిందికూడా.

తన చేతికర్ర ఏమైందో నని కెనిరీ అటూ యిటూ చూశాడు. మంచుదిబ్బ అంచున ఉన్న మంచుముక్కల్లో ఉంది. బహుశా తాను జారి పడిపోయేటప్పుడు విసిరిఉంటాడు. దగ్గరలోనే పడిఉన్న ఆ కర్రను తీసుకొని బట్టలు కట్టిన తాడు మధ్య బోటు పెట్టాడు. ఇప్పుడు తన భార్యగనుక ఉంటే తాను ఎంత మంచి గృహస్థుడో, ఎంత చక్కగా వస్తువులను సర్దుకుంటాడో చూచి ఆనందించి ఉండేది.

కెనిరీకి అప్పటికిగాని తాను రెండు సీలు జంతువులను మంచు దిబ్బపై వదలివేసిన సంగతి గుర్తురాలేదు. పోనీ కొక్కెంతాడు విసురుదామాఅని కెనిరీ అనుకున్నాడు. ఇక ఇప్పుడు విసిరితేమాత్రం ఏం లాభం? తాను వదలివేసిన మంచు దిబ్బ ఇప్పటి కప్పుడే కొన్ని వందల గజాలదూరంలో ఉంది. అంతదూరం తాడు అందనే అందదు.

కాని ఇందువలన తనకు వచ్చే ముప్పు ఏమీలేదు. తుపాకి తూటాలు ఉంటె చాలు తన ఆహారానికి కొరతేలేదు. అంత క్రితంరోజున అనేక పర్యాయాలు సీల్ జంతువులు తలెత్తి నీళ్ళలో తనకు కనపడ్డాయి. కాని వాటిని వేటాడాలని తనకప్పుడు అనిపించలేదు. రెండు సీల్ జంతువులు తనదగ్గర పడిఉన్నాయికదా! తోలు సంచిమీద కాళ్ళు దగ్గరకు తీసుకొని కెనిరీ కూచున్నాడు. తుపాకిని శుభ్రంగా తుడిచాడు. ఎండ వెచ్చగా తగులుతూంది కాని సూర్యుడు మబ్బుల చాటుకి వెళ్ళినప్పుడు చల్లటిగాలి వచ్చి తగిలేది. కాళ్ళు చేతులు కొంకర్లు పోయేటంత చలి వేసేది. ఏ కసరత్తు పాఠం పుస్తకంలోనూ చెప్పనన్ని విధాలుగా తన శరీరం వంకరలు తిరిగి పోతోందిప్పుడు,

ఎల్లాగైతేం?...సముద్రపు గాలికి, సూర్యాతపానికి బట్టలు ఆరాయి. కెనిరీ మళ్ళీ బట్టలువేసుకొని తుపాకి చేత్తో పట్టుకొని మంచుదిబ్బ అంచున సీలు జంతువులు కనపడితే వేటాడటానికి సిద్ధంగా కూచున్నాడు.

ఇప్పటి తన వేషం ఎంత విచిత్రంగా ఉంది? మామూలుగా తాను ఎల్లా ఉండేవాడు? మాంచి షోకుగా బట్టలు ఎక్కడా నలగకుండా వుండేవాడు. ఇప్పుడో! తన బట్టలన్నీ చినిగి పేలికలైపోయాయి. దేహం చిక్కిపోయి, కళ్ళు పీక్కుపోయి ఉన్నాయి. మొహం అంతా చీకుకుపోయి గాయాలతో నిండివుంది.

రెండు రోజుల క్రితం ఇల్లాగే తాను సముద్రపు ఒడ్డున సీల్ కనుపిస్తుందేమో......గురిచూచి కొడదామని కాసు

కూర్చున్నాడు. ఇప్పుడు ఒకటి రెండుసార్లు నీళ్ళు కంట బడ్డాయి గాని అంత దగ్గర్లోకాదు. సరిగ్గా తగిలే పక్షంలోనే కొట్టాలి, లేకపోతే వద్దని కెనిరీ నిశ్చయించుకున్నాడు.

ఆకాశంలో తెలిమబ్బులు తేలిపోతున్నాయి. తల పైకెత్తి చూస్తే తానూ, మంచుదిబ్బకూడ గాలిలో తేలిపోతు న్నట్లు, గాలి అలలు మృదువుగావచ్చి కొడుతున్నట్టు కెనిరీకి అనిపించింది. చడీ, చప్పుడూ లేదు. అంతులేని, అవధిలేని నిశ్శబ్దం ఆవరించుకొని ఉంది. ఉండి ఉండి మంచుదిబ్బనుండి చిన్న చిన్న ముక్కలు నీళ్ళలోపడి 'తఫ్' మన్న చప్పుడు వినివస్తుంది. ఆ తర్వాత మళ్ళీ యథాప్రకారం అంతా గాఢ మైన నిశ్శబ్దం అలుముకుపోతుంది.

ఉన్నట్టుండి అకస్మాత్తుగా కెనిరీ చెవులకు ఏదో మోత వినిపించసాగింది. ఇది మోతా ? లేక తనభ్రమమాత్ర మేనా? దూరంగా వినిపించే ఈమోత క్రమంగా దగ్గరకు వస్తూంది. ఇప్పుడు స్పష్టంగా, మరీస్పష్టంగా వినిపిస్తోంది. అది "ఇంజన్ మోత !" లేచి నిలబడి సముద్రంకేసి కళ్ళనొప్పులు పుట్టేట్టు చూశాడు. కెరటాలమధ్య మోటారుబోటు ఏదైనా వస్తున్న దేమో ?

మోటారుబోటు ఏమీ ఆనలేదు దృష్టికి. కాని ఆమోత ఇంజను మోతేనని ఇప్పుడు స్పష్టంగా అనిపిస్తోంది. ఆకాశం కేసి చూడగా చూడగా దూరంగా అతనికి ఒకవిమానం కన పడింది. మంచుదిబ్బమీద కొట్టుకొని వెడుతున్న మనిషిని విమానంలోని వాళ్ళకి కనపడకుండా ఉంటాడా ?

కెనిరీ తుపాకిని చేతబట్టుకొని రెండుసార్లు ధన్ ధన్‌మని ఆకాశంలోకి కాల్చాడు. విమానం కొంచం ముందుకుపోయి ఒక చక్కర్ కొట్టింది.

తన తుపాకి దెబ్బల మోతలు విమాన చోదకుడిక్కి తప్పక వినిపించి ఉండాలి అనుకున్నాడు కెనిరీ. కాని, తన సమీపానికి రాదేం ? తిన్నగా పోతుంది, మళ్ళీ తిరుగుతుంది. ఎక్కడో దూర దూరంగా చక్కర్లు కొడుతుంది. దగ్గరకు రాదు. నన్ను వెతకడానికే విమానాన్ని పంపించారేమోనని కెనిరీ బుర్రలో తళుక్కున మెరిసింది.

మళ్ళీ కాల్చడం మొదలుపెట్టాడు కెనిరీ. ఈ సారి వైమానికుడి దృష్టి నాకర్షించడానికి కాదు. అతనికి శాల్యూట్ చేస్తూ, ఆనందంతో కాల్చిన బారులు యివి. తనంత తాను వైమానికుడు పసిగట్టేవరకు కెనిరీ తాళలేకపోతున్నాడు. ఆనందాతిశయం పట్టలేక ఉబ్బి తబ్బిబ్బు అవుతున్నాడు. అతని చేతులు వాటంతటవి తుపాకిని తూటాలతో నింపుతోంది; తాను కాల్చేస్తున్నాడు ! ఏమో ? తన్ను గుర్తుపట్టకుండా వెళ్ళిపోతాడేమో వైమానికుడు ! ఈ భయం ఆవరించి, కాల్పుమీద కాల్పు చేశాడు. చివరకు తూటాలన్నీ అయి పోయాయి.

ఇక తుపాకి క్రింద పడనేసి కెనిరీ ఆ మంచు దిబ్బమీద అటూ యిటూ తిరగడం మొదలుపెట్టాడు. ఎవడైనా చూస్తే ఇదంతా పిచ్చివాడి వాలకం లా కనిపిస్తుంది. కాని చాలా తెలివి తేటలతోనే ఈ పనిని కెనిరీ చేసాడు. ఇంతా విమానం వస్తే తాను ఉన్నట్టు అలికిడి అయినా లేకపోతే ఎల్లా ?

అందుకే వరసబెట్టి కాల్చాడు. ఆ తర్వాత ఏమీతోచక తచ్చాడుతున్నాడు. కొంచెంసేపటికి కెనరీ నిలబడిపోయాడు. విమానం దూరంగా ఎగిరిపోతోంది. తదేకంగా దానికేసి చూస్తూ ఉండిపోయాడు కెనరీ...

ఇంతకీ ఇప్పుడుజరిగిందేమిటి! విమానం తాను ఇక్కడ ఉన్న సంగతి గుర్తించనూలేదు. ఇక తూటాలూ లేవు; ఆహారమూ లేదు. బైటపడే మార్గమూ, అంతకంటె ఏమీ తోచడంలేదు!

అయినప్పటికీ కెనిరీకి నిరాశాజనకంగా లేదు. మధ్యాహ్నం అనుభవం గడిచిన తరువాత, కొద్దిలో మృత్యువును తప్పించుకొన్న తరువాత, సురక్షితమైన మరో మంచు దిబ్బ దొరికిన తరువాత, విజయం పొందాననే ఆనందాతిశయం అతన్ని వదలలేదు. విమానంమీద తన్ను వెతకడానికి కూడా బయలుదేరారు. ఒకసారి విమానాన్ని పంపిన తర్వాత తన్ను వెతికి పట్టుకోకుండా గాలింపు ఒక్కనాటికి మానరు.

తాను ఎందుకు నిరాశపొందాలి? తానున్న మంచు దిబ్బ తగినంత పెద్దదే?...ఉదయం నిలబడిన చిన్న గడ్డ కాదు. పైన చాల మంచు ఉంది. అందుచే మంచినీటికి కొరత లేదు. పైగా మూడు చిన్న చిన్న గుంటలు కూడా ఉన్నాయి. త్రాగడానికి గనుక నీరుంటే ఎన్నాళ్ళు తిండిలేకపోయినా ఫరవాలేదు. మంచి వేటగాడు ఎప్పుడూ సహనభావంతో, ఓపికతో ఉండాలి.

ఆ సీలుజంతువు లున్న మంచుదిబ్బ క్రమంగా కొట్టుకొని రావచ్చు, అప్పుడు దానిని నెమ్మదిగా దగ్గరకులాగి

వాటిని తీసుకోవచ్చు. అది అల్లంతదూరంలో కనుపిస్తోనే ఉంది. ఏ విధంగా దూరంగా పోయిందో అదేవిధంగా దగ్గరకు రావచ్చు. కెనిరీ యీ ఆశ వదులుకోలేదు.

అసలు సీలు జంతువులను తాను ఆ విధంగా వదలివేసి ఉండాల్సింది కాదు. చిన్న చిన్న ముక్కల క్రిందకోసి సంచిలో వేసి ఉండవలసింది. ఈముందు జాగ్రత్త తీసుకోవాలని తనకి తోచనేలేదు. తనచేతులో అప్పుడు దాదాపు పన్నెండు తూటా లున్నాయని ధీమా ఉండేది!

అసలు తిండిగురించి ఆలోచించ కూడదని కెనిరీ అను కున్నాడు. అయినా ఇంత త్వరలోనే తనకు ఆకలి వేస్తోందని అనుకోవడ మేమిటి? ఆవేళ ఉదయం తాను మస్తుగా మాంసం తిన్నాడు గదా! ఒకవేళ ఇప్పుడు సీలుమాంసం ప్రక్కన ఉంటే మాత్రం ధ్యాస అటు పోయేదేకాదు. కాని తనకడుపు ఎంత చెప్పినా వినేటట్టుగా లేదు. ఒకగుంటలోంచి కొంచం నీళ్ళు తాగాడు. బెల్టు మరీ కొంచం బిగించాడు.

సాయంత్రం అయ్యేసరికి వాతావరణం మరింత పాడుగా తయారైంది. బాగా మబ్బుపట్టింది. క్రిందివాలుగా వీచే గాలి వలన సముద్రం అంతా అలలు అలలుగా లేచిపడుతోంది.

మబ్బువేసి చల్లగా ఉన్నందుకు ఈవేళ కెనిరీకి ఏమీ సంతోషంగా లేదు. విమానం ఈవేళ మళ్ళీ రాకపోతే? ఈ రోజుకి వాయిదా వేసుకుంటే...వాతావరణం సరిగా లేనం దున విమానంలో రావడం కష్టమని భావించుతున్నారేమో?

అల్లకల్లోలంగా ఉన్న సముద్రాన్ని కెనిరీ నిరాశ దృక్కులతో చూశాడు. నూరేళ్ళు నిండిన ముసలమ్మ కడుపు

ముడతలుపడి ఉన్నట్టుగా, సముద్రపు ఉపరితలం ఉందని విసుగ్గా అనుకున్నాడు. క్రమంగా ఈ అలలు కెరటాలుగా మారి పెద్దయెత్తున లేచిపడుతూ నురగలు కక్కసాగాయి.

కెనిరీకి కొత్తకొత్త అనుమానాలు బుర్రలో ప్రవేశించాయి. ఇక తనకోసం విమానం రాదనుకుని కెనిరీ ఒక మాటు అనుకున్నాడు. బహుశా, అది ఇంకెవరికోసమో వచ్చి ఉంటుంది. తనవలెనే ఇంకెవరైనా మంచుదిబ్బమీద కొట్టుకొని పోతున్నారేమో...! ఎందుకు కాకూడదు? సముద్ర తీరం పెద్దది. అనేకమంది వేటగాళ్లు, చేపలవాళ్లు తిరుగుతూంటారు. ఎవరో ఘనత పొందిన ఆసామి కొట్టుకుపోయి ఉండవచ్చు. అతడు విమానంమీద వెతక వలసినంత గొప్పవాడై ఉండవచ్చు.

అసలు నిన్నను వచ్చిన విమానం ఎవరినీ వెతకడానికి కాదేమో? మంచు ప్రాంతాలు పర్యవేక్షించడానికి చేపల మడుగులు ఎక్కడెక్కడ ఉన్నాయో చూడటానికి బయలుదేరి ఉండవచ్చు. ఎవరిపని వారికి ఉంటుంది. యావత్తు ప్రపంచం కెనిరీకోసం వెతుకుతూ కూచోంటుందా?

గాలి వీచి మబ్బుతెర తొలిగేసరికి ఇంకా సూర్యాస్తమయం కాలేదని తెలిసింది. దిక్చక్రంలో స్టీమరు పొగలాంటిది కనపడింది. ఈ పొగ తూర్పునుండి పడమరకు పోతున్నట్లు కనపడింది. ఎంతో దూరాన ఉంది. ఎంత గట్టిగా కేకవేస్తే మాత్రం వాళ్ళకి వినిపిస్తుంది? వాళ్ళ దగ్గరఉన్న దూరదర్శినులతో ఎంత దీర్ఘంగా చూసినా తాను కన్పించడు. సముద్రపు రహదారులు పెద్దవి. డజను ఓడలు చుకోటస్క

సముద్రంలోంచి వెడుతూండవచ్చు కాని కెనిరీకి సమీపంగానే వెళ్ళాలని ఎక్కడుంది ?

ఈలోగా సముద్రపు కెరటాలు మరింత విజృభించి అల్లకల్లోలంగా తయారయ్యాయి. చిన్న చిన్న మంచుదిబ్బలు తిరగబడిపోతున్నాయి. ఎడాపెడావచ్చి తగులుతూ వాటిని చిన్నాభిన్నం చేస్తున్నాయి. కెనిరీ తాను వదలిపెట్టివచ్చిన మంచుదిబ్బకోసం చూశాడు. అది కెరటాల్లో ఒకమూల పైకిలేచి ఇంకో దిబ్బకు కొట్టుకొని ముక్కముక్కలై పోయింది. తానే గనుక దానిమీద ఉండి ఉంటే తన పని ఏమయ్యేది ? కేనిరీ గుండెలు దడాదడా కొట్టుకోవడం మొదలుపెట్టాయి. రోజురోజల్లా ఆలోచనలతోటి కెనిరీ అలిసిపోయాడు. ఒక్క నిముషం కూడా తను ఇక ఆలోచించలేడు. కళ్ళు మూతలు పడిపోతున్నాయి. కాళ్లు తేలిపోతున్నాయి. కెనిరీ తాను నిద్రపడేలోగా మంచుదిబ్బమీద చిన్న జండాలాంటిది కట్టి మరీపడుకోవాలనుకున్నాడు. ఒకవేళ తాను నిద్రపోయినా గుర్తుపట్టడానికి ఎవరికైనా వీలుగా ఉంటుంది. కేనిరీ తన చొక్కా ఊడదీశాడు చేతికర్రకు కట్టాడు. ఈ జండా కర్రను తీసుకొనివెళ్ళి ఎత్తుగా ఉన్న గొప్పుకి కట్టివేశాడు. ఇప్పుడు చాలా దూరంనుంచైనా జండాను చూడవచ్చు. చొక్కా లేకపోవడం మూలాన తనకు ఇంకా ఎక్కువ చలి వేస్తే వేయవచ్చు. అందువలన ఇప్పుడు ఎక్కువ బాధలేదు.

ఇంతవరకు కెరటాల తాకిడికి కెనిరీ వున్న మంచు దిబ్బకు ఏమీ తాకిడి తగలలేదు. వీటి తాకిడికి అది లక్ష్య పెట్టేదికాదు చాలా పెద్దది. అంతేకాదు చుట్టూ మొత్తటి

మంచు వుండుటవలన తాకిడి అంతగా తగలలేదు. కాని పగటిపూటకంటె ఇప్పుడు కెరటాల దెబ్బకి వూగులాడు తూంది.

నిద్రలో తాను దొర్లిపోకుండా, ఏదైనా ప్రమాదం సంభవించ కుండా కెనిరీ ఒక మంచు గొప్పు పక్కన పడు కొన్నాడు. దానికి తాడుతో కట్టి వేసుకున్నాడు. అప్పటి కప్పుడే మాగన్నుగా నిద్రపడుతోంది తనకు. అఖరిచుట్టు తిప్పేలోగా ఎక్కడ మునిగిపోతానో అనిపించింది. ఎల్లాగో ఒల్లాగు ఓపిక తెచ్చుకొని ఆచివరి చుట్టు కూడా తిప్పి వేసుకొని "ఇహ ఇప్పుడు నిద్రపోతాను" అని అనుకున్నాడు. కన్ను మూశాడో లేదో కెనిరీ గాఢనిద్రలో పడిపోయాడు. సముద్రం ఎంతలోతుగా గంభీరంగా ఉందో అతని నిద్ర కూడా అంత గాఢంగాను. గంభీరంగాను పట్టింది.

* * *

ఆ గాఢ నిద్రలో అతనికి ఏ సవ్వడులూ వినపడటం లేదు. కెరటాలహోరుకాని మంచుకొండలు ఒక దాని నొకటి ఢీకొని చేసే ఫెళ ఫెళ ధ్వనులు కాని అతనికి యేమీ తెలియవు. సముద్రపు లోతుల్లో అట్టడుగున శయనించి ఉంటే ఏ విధంగా అనంత నిశ్శబ్దంలో మునిగి ఉంటాడో ఆ విధంగానే అతడు నిద్రిస్తున్నాడు. నిన్న వినపడిన విమాన ధ్వనిమళ్ళీ వినపడసాగినా కూడా అతడిలో ఏమీ చలనం కలుగలేదు.

మొట్టమొదట అతడికి ఈ విమానంధ్వని కలలో విని పిస్తున్నదా అనిపించింది. కళ్ళు తెరిస్తే ఈ ధ్వని ఎక్కడ వినపడ కుండా పోతుందో అని భయంతో అతడు కళ్ళు మూసుకునే

ఉన్నాడు. ఒక నిమిషానికి కళ్లు తెరిచాడు. అయినా ఇంకా ఆ ధ్వని వినిపిస్తూనే ఉంది.

దిగంతంలో అప్పుడే సూర్యు డుదయిస్తున్నాడు. తాను నిద్రపోయింది అరగంటసేపు మాత్రమేనని కెనిరీ గ్రహించాడు. వంట్లో జవ, సత్తువలు మళ్ళీ తిరిగివచ్చాయి. అంతా నిద్ర ఫలితంగా కాకపోవచ్చు. కాని విమానం ధ్వని మూలాన ప్రాణం లేచివచ్చినట్టు, బడలిక అంతా ఎక్కడికక్కడ మటు మాయమైపోయినట్టుకూడా అనిపించింది. విమానం ధ్వని అతని చెవులకు మృదుమధుర సంగీత ధ్వనిలా ఉంది.

తాను ఉన్న మంచుదిబ్బపైన గుండ్రంగా విమానం తిరుగుతోంది. విమానచోదకుడికి కెనిరీ నెలబెట్టిన జండా కనిపించింది. మంచు గొప్పు నానుకొని నిద్రిస్తున్న మనిషీ కన్పించాడు.

ఆ మనిషి లేచి చుట్టుకున్న తాళ్ళు విప్పుతున్నాడు. ఆ తర్వాత లేచి నిలబడి చెయ్యి వూపుతున్నాడు.

విమానం ఒక చక్కర్ కొట్టి తిన్నగా మంచు దిబ్బ మీదికి వచ్చింది. క్రిందికి వాలుతుందా అన్నంత దిగువకు వచ్చేసింది.

"ఏమిటి! నిజంగా క్రిందకు వాలుతుందా ?" అని కెనిరీ ఎంతో ఆశ్చర్యపోయాడు. విమానం తిన్నగా తన దగ్గరకే వస్తు న్నదని భ్రమించాడు. విమాన యానంగురించి కెనిరీకి పెద్దగా అనుభవంలేదు. అయినప్పటికి విమానం దిగాలంటె ఈ మంచు దిబ్బమీాద ఉన్నస్థలంచాలదు నిజమే ఇప్పుడు పెద్దతుఫానూ ఏమీా పట్టలేదు. సముద్రం ఒక రవ్వ ఇప్పుడు సద్దుమణిగింది

కూడా. అయినప్పటికి మంచుదిబ్బ మాత్రం అటూ యిటూ ఊగుతూనే ఉంది. ఏది ఏమైనప్పటికీ విమానం దిగడానికి దీనిమీదస్థలం ఎల్లా సరిపోతుంది? అంతేకాదు; దీని మీదంతా ఎత్తుపల్లాలు గొప్పులు ఉన్నాయి కూడా.

కాని విమానం వేగంగా దగ్గరకు వచ్చేస్తూనే ఉంది. ఇప్పుడది ఏదో దూరంగా వినిపిస్తున్న చప్పుడుకాదు, క్షణ క్షణానికి చెవులు గింగిర్లు ఎత్తిపోయేటంత రొద హెచ్చిపో తోంది. ఈ పెద్ద రొద తన మీదకు రాగానే కెనిరీ అమాం తంగా నేలమీద బోర్లపడి చేతులతో మొహం కప్పేసు కున్నాడు. తాను నేలమీదపడే సమయంలోనే విమానం లోంచి ఏదో క్రిందకు పడినట్లు గుర్తించాడు.

విమానం ఎంత రివ్వున మీదకు వచ్చిందో అంత రివ్వునా దూరంగా వెళ్ళిపోయింది. కెనిరీ తలయెత్తి చూసేసరికి ఒక చక్కని బంగీ రెండు మంచు గొప్పుల మధ్య ఇరుక్కొని ఉంది. అది తీసి విప్పేలోగానే మళ్ళీ విమానం మీదకు వచ్చే సింది. ఈసారి కెనిరీ భయంతో నేలమీద పడుకోలేదు. విమానంరెక్క తనకు తగులుతుందా అనిపించేటంత సమీపం లోకి వచ్చినప్పుడు వెంటనే చదికిలబడ్డాడు. అంటే వైమానికుడు ఇంచుమించుగా తనకు కనపడ్డాడు. సంతో షాతిశయంతో కెనిరీ పెద్దపెట్టున నవ్వాడు. వైమానికుడికేసి ఆనందంతో కుడిచెయ్యి వూగించాడు, ఎడమచేతిలో ఆ బంగీ ఉంది.

మళ్ళీ ఇంకేదో పడినట్లు అయింది. అది మరొకబంగీ, కాని ఈసారి వైమానికుడు గురి తప్పాడు. బంగీ మంచుదిబ్బ అంచును కొట్టుకొని గెంటుతూ నీళ్ళలో వెళ్ళిపడింది.

కెనిరీ గబగబా జెండాకు ముడివేసిన కొక్కెం తాడు విప్పబోయాడు, కాని గట్టిగా ముళ్ళు వేసినందున ఒక్కసారిగా వూడిరాలేదు. ఈలోగా విమానం మంచుదిబ్బమీద చక్కర్లు కొట్ట నారంభించింది. కెనిరీ కొక్కెంతాడు విప్పి విసిరి బంగీని పట్టుకొని దగ్గరకు లాగుకొని తీసుకున్నతర్వాతనే విమానం దూరంగా ఎగిరిపోయింది. ఎత్తుగా వెళ్ళేలోగా మూడుసార్లు రెక్కలల్లార్చింది. అది తనకు అభివందనాలు తెలియజేయడ మని కెనిరీ గ్రహించాడు. "వైమానికులు అభివందనలు తెలియ చేసే పద్ధతి అదన్నమాట" అనుకున్నాడు కెనిరీ. వినయం చూపించడానికిగాను తన చేతులుచాచి, నడుంవంచి మూడు సార్లు చేతులు వూపుతూ...విమానం రెక్కలు అల్లార్చి నట్టే...అభివందన చేశాడు కెనిరీ.

బంగీలలో ఎన్నెన్నిరకాల వస్తువులో ఉన్నాయి. దిక్కు మొక్కు లేకుండా నట్టనడి సంద్రాన ఒక మంచు దిబ్బమీద కొట్టుకొనిపోతూ దౌర్భాగ్య స్థితిలో ఉన్న మానవుడు ఏవేవి కోరతాడో అవన్నీ అందులో ఉన్నాయి. ఆహారం, వెచ్చని దుస్తులు, ప్రథమచికిత్స సామాగ్రి, ఒక చిన్న గుడారం, బ్యాటరీలైటు...కెనిరీ ప్రతీవస్తువును పరీక్షగా చూశాడు. ఆనం దంతోటి, సంతోషంతోటి అతడు గంతులు వేయడం మొదలుపెట్టాడు.

కొద్దిసేపటికి 'స్టవ్' గుడారంలో చప్పుడు చేస్తూ మండ నారంభించింది. కెనిరీ విమానంలోంచి వేసిన వెచ్చని చిన్న బెడ్డింగు పరుచుకుని దానిమీద వాలి టీ కోసం గిన్నెలో నీళ్ళు మరుగుతూంటే గుప్‌గుప్‌మని పైప్ కాలుస్తూ హాయిగా పడు

కున్నాడు. అతడికి ఇప్పుడు ఆకలి వేయడంలేదు. బంగీలు విప్పుతూనే ఒక బిస్కట్ల పొట్లం, గుప్పెడు చాకలెట్ బిళ్ళలు ఖాళీచేశాడు.

బంగీలలో ఉన్న వస్తువు లన్నింటిలోకి అతనికి వింత కల్గించిన వస్తువు ఒకటి ఉంది. ఎంత ప్రయత్నించినా అదేమిటో అర్థంకాలేదు. చిన్నగొట్టంలా ఉంది. తేలికగాను, గట్టిగాను ఉన్న లోహంతో తయారు చేశారు. టిక్ టిక్ మని చప్పుడు చేస్తే లోపల అంతా గుల్లగానే ఉన్నట్టు అర్థమవుతుంది. ఊడదీద్దామంటే ఎటు వూడదీయాలో తెలియడంలేదు.

సంతృప్తిగా టీ తాగిన తరువాత, అదేమిటో అంతు దొరకని గొట్టాన్ని అటూ యిటూ తిప్పి చూసిన తరువాత బెడ్డింగులో దూరి కెనిరీ గాఢనిద్రపోయాడు. ఈ సాహస యాత్ర ప్రారంభించిన తరువాత ఇంత నిర్విచారంగా ఇన్ని గంటలసేపు అతడు నిద్రపోలేదు.

నిద్రలేచిన తరువాత కెనిరీ గుడారం బయటకు వెళ్ళి సముద్రంకేసి, ఆకాశంకేసి, దిగంతాలకేసి పరిశీలనగా చూడసాగాడు. సముద్రం నిర్మలంగా ఉంది. ఆకాశంలో మచ్చుకైనా ఒక్కమబ్బుకూడా లేదు. సూర్యుడు ఎత్తుగా ప్రకాశిస్తున్నాడు. బూడిదరంగు గల్గిన ఒక చిన్నపక్షి ఎగురుతూ వచ్చి ఒక బిస్కట్టుముక్కను ముక్కుతో పొడుచుకొని తినసాగింది. కెనిరీని చూసి ఆ పక్షి ఎగిరిపోయి మంచుదిబ్బకు కొద్ది దూరంలో నీళ్ళమీద వాలింది.

చాలాసేపు ఈవిధంగా గడిచిన తరువాత కెనిరీ లేచి మంచుదిబ్బ అంతా పచారుచేసి ఎక్కడైనా పగుళ్ళు, చిల్లులు ఉన్నాయేమో పరిశీలనగా చూశాడు. అంచులుకూడా పరీక్షగా చూశాడు. ఈ పరిశీలన ఫలితంగా అతనికి నమ్మకం ఏర్పడింది. మంచుదిబ్బకు ఇంతలో వచ్చే ప్రమాదం ఏమీలేదు, తాను ఈ గండం గడిచి ఏదోవిధంగా బైటపడతాననే ఆనందం అతనిలో వెల్లువలై ఒక ప్రక్కన వివశత్వం కల్గిస్తూండగా అతనికి కాలక్షేపం అవడం దుర్లభమైపోయింది. గుడారం బైటకి, లోపలికి పదేపదే తిరగడం మొదలుపెట్టాడు. లైటులో బ్యాటరీలు తీశాడు, మళ్లీ పెట్టాడు. ఆహారం డబ్బాలమీద మెరిసిపోతూవున్న అక్షరాలను, పేర్లను చదివాడు. తన వంటి మీద, మొహంమీద పడిన గాయాలన్నింటికీ అయొడిన్ వ్రాశాడు, ఎడమచేతికి కట్టుకున్నాడు. కుడిచేతికి అంతకంటే తక్కువ దెబ్బలు తగిలాయని కాదు, ఎడంచేతికి కట్టుకట్టుకుంటే దేనికీ అడ్డురాదు; చికాకుగా ఉండదు. మళ్ళీ ఒకసారి ఆకాశం కేసి చూశాడు. చెవులు రిక్కబెట్టి తదేకంగా వినసాగాడు. అంతా నిశ్శబ్దంగా ఉంది. చీమ చిటుక్కుమన్న శబ్దంకూడా వినరావడం లేదు.

పోనీ చదరంగం ఆడుకుంటే...తనకి జోడు లేకపోయినా భేషుగ్గా ఆడగలడు. క్రితంసారి ఐగింటోతో ఆడిన ఆటలో ఎత్తులు ఎల్లా ఉన్నాయో అల్లాపెట్టి ఆడవచ్చు. పైగా తనకు ఎక్కువ పావులు అక్కర్లేదు. సగం పావులు చచ్చినట్టు ఎంచుకొని అయినా ఆట మొదలుపెట్టగలడు. ఆనాడు ఆట

అయిపోయిన తరువాత ఐగింటో యిచ్చిన సూచనలను అనుస రించి యిప్పుడు కెనిరీ చక్కగా ఆడగలడు.

మంచుమీద బిస్కట్లు పేర్చి గడులుగాచేసి కెనిరీ చదరంగపు ఆట మొదలుపెట్టాడు. గుడారంలోకి వెళ్ళి స్టవ్ అట్టపెట్టె ముక్కలుగా చేసి పావులను తయారుచేశాడు. గుడారంలోకి వెళ్ళి వచ్చేలోగా ఆ బూడిదరంగు పక్షులు అమాంతంగా వాలి బిస్కట్లన్నీ నోట కరుచుకున్నాయి. ఇంకా అక్కడ ముక్కు పెట్టి పొడవసాగాయి.

కెనిరీకి యిప్పుడు ఎంత ఉల్లాసంగా వుందంటే ఆ పక్షులు తన చదరంగపు ఆటనంతా పాడుచేసినా వాటితో ఏమీ తగువు పెట్టుకోదలచుకోలేదు; పైపెచ్చు ఇంటికెళ్ళిన తరువాత తన కొడుకులికి ఈ పక్షులకథ చెప్పి ఆ పక్షులతో "ఆటలో ఎల్లా ఓడిపోయిందీ" సరదాగా చెప్పవచ్చు ననుకున్నాడు.

ఎండలోఉంటే గుడారంలోకన్నా వెచ్చగా ఉంది. కెనిరీ తన చొక్కా విప్పేశాడు. విప్పుతూండగా ఆ చొక్కా జేబులోంచి ఆ గొట్టం క్రిందపడింది. దాని రహస్యం ఏమిటో ఇంతవరకు తనకు బోధపడలేదు. ఆ విధంగా పడటం మంచిదే అయింది. అది ఒక స్క్రూ మూతవున్న గొట్టం. క్రింద పడ్డంతోటే మూత కొంచం తొలిగింది. మూతతీసి చూసే సరికి అందులో ఒక ఉత్తరం ఉంది. అందులో త్వరత్వరగా గిలికిన వ్రాతలో యిలా ఉంది:

కామ్రేడ్ కెనిరీ,

నీకోసం మూడు రోజులనుండి గాలిస్తున్నాం. అధైర్య పడకు. నిన్ను తప్పక రక్షిస్తాము. అసలు విషయం నీవు

ఎక్కడున్నావో మాకు తెలియాలి. ఇప్పుడు తెలిసింది గనుక ఇక నిన్ను రక్షించడంలో ఎంతమాత్రం సందేహంలేదు.

నీ దగ్గర పడవేసిన బంగీలలో నీకు కావలసినవన్నీ ఉన్నాయి. వాతావరణం ఈవేళ కంటే చెడుగావుండని పక్షంలో నేను మళ్ళీ రేపు కన్పిస్తాను.

"భక్షేయేవ్"

అంటే ఇందులో ఉన్నది నైమానికుడు వ్రాసిన ఉత్తర మన్నమాట. విమానంనుండి పడవేయడానికి ఈ గొట్టం ఒక కవరు వలే ఉపయోగపడిందన్నమాట. మొదటి బంగీ పడవేసి నప్పుడు తాను నేలమీద పడుకుని చేతుల్లో మొహం దాచు కొని ఉన్నాడు. ఈ గొట్టం అప్పుడు పడవేసి ఉండాలి.

"ఈ బంగీల్లో నీకు కావలసిన సామగ్రి అంతా ఉంది..." కావలసినంతే కాదు - ఇంకా యెక్కువగా కూడా ఉన్నాయి. "వాతావరణం ఈ వేళటికంటే చెడుగా ఉండక పోతే..." ఉదయం వాతావరణం అంతగా బాగాలేదు. ఐనా తెగించి భక్షేయేవ్ బయలుదేరి వచ్చాడు. తన్ని రక్షించే కార్యక్రమంలో ఎంతమంది ఉన్నారో కెనిరీకి ఇప్పటికి బోధపడింది. మళ్ళీ తన భార్య దీనంగా వామ్చెవద్దకు గుండెలు గవుక్కుంటూ పరుగెత్తుకొని వెడుతున్నట్లు అని పించిందిగాని, ఈసారి ఆ దృశ్యం యొక్క తరహా వేరుగా ఉంది. వామ్చె ఎంలో ఆతురతతో పంపవలసిన అధికారు లందరికి రేడియోగ్రాములు పంపుతాడు. అందుమీదట అక్కడ అధికారులు ఒక విమానాన్ని పంపుతారు. ఈలోగా తన కొల్కోజ్ సభ్యులు ఒక మోటారుబోటును ఒడ్డుకు చేర్చి

ఏ క్షణంలోనైనా సరే వేసుకురావడానికి సిద్ధంగా ఉంటారు. భక్షైయేవ్ తిరిగివచ్చి ఏ దిక్కుగా మోటారుబోటు బయలు దేరాలో చెబుతాడు. ఈపాటి కప్పుడే మోటారుబోటు కెనిరీని రక్షించడానికి బయలుదేరి ఉంటుంది.

ఎంతమంది తనకోసం ఎన్ని తిప్పలుపడుతున్నారు? వైర్లెస్ ఆపరేటర్, వైమానికుడు, విమానాశ్రయంలో పను లన్నీ నిర్వర్తించే ఆఫీసరు – ఎప్పుడు తాను జీవితంలో ఎరుగని వారందరూ తనకోసం వెతుకుతున్నారు! అనాదిర్‌లో కూడా తనగురించి తెలిసేవుండాలి. వీళ్ళకి కూడా తనను వెతకవల సిందిగా ఆదేశాలు పంపి ఉండవచ్చు.

కెనిరీకి కొంచెం బిడియం వేయసాగింది. తాను గొప్ప వీరుడూ కాదు, ముఖ్యుడూ కాదు; ఒక సామాన్య చుక్చి వేటగాడు, ఖోల్కోజ్ సభ్యుడు. నిజం చెప్పాలంటే తాను ఏమంత మంచివాడు కూడా కాదు. చాలా విషయాల్లో వెనుకబడినవాడు. ఈ చిక్కు రావడానికి పూర్తిగా తనదే తప్పు. సముద్రపు ఒడ్డున మంచుమీద కూర్చుని జోగిపోతూ ఆ మంచుదిబ్బ ఎప్పుడు తెగి విడిపోయి ప్రవాహంలో కొట్టు కొనిపోతోందో గమనించనే లేదయ్యో!

విమానంనుండి తనకోసం ఎన్ని ఖరీదైన వస్తువులు పడవేశారు? తప్పు తనదే అయినా తనకోసం ఎంత పెద్ద ప్రయత్నం చేశారు? ఉత్తరంలో ఏమని వ్రాసి ఉంది? "కామ్రేడ్ కెనిరీ!" అని ఎంత ప్రియంగా సంబోధించారు!

వైమానికుడు చాలా మంచివాడై ఉండాలి. తనని కనుక్కున్నాడు; తనకు కావలసిన వస్తువులన్నీ అందజేశాడు.

తనంతతానై ఒక ఉత్తరం వ్రాశాడు. ఉత్సాహపరచడం కోసం ప్రయత్నించాడు. "ఏమీ నిరాశ పడకు నిన్ను తప్పక రక్షిస్తాం" అన్నాడు. ఎంత మంచివాడు!

కెనిరీ ఆ ఉత్తరాన్ని మరోసారి చదువుకున్నాడు. అందులో ప్రతీమాట అతనికి ఎంతో ప్రియమైనదిగా అనిపించింది. ఈ వైమానికుడికి ఏదో ఒక మేలు చేయాలి. 'బాక్షయేవ్' అని అతని పేరు రెండు మూడుసార్లు ఉచ్చరించాడు. పేరుగూడా బాగానేఉంది. తన కిష్టమైన పేరు పిల్లలకు పెట్టవలసివస్తే తాను ఒకరికి బాక్షయేవ్ పేరే పెడతాడు, కోల్యాకి నికోలాయ్ కెనిరీవిచ్ బాక్షయేవ్ అని పెట్టకూడదూ? ఏం దీంట్లో బాగుండనిది ఏమున్నది?

*    *    *

నాల్గోరోజు సాయంత్రం మంచుదిబ్బనుండి కెనిరీని "వెల్లెన్" మీాదకు జేర్చారు. కెనిరీ అనుకోనివిధంగా యిది జరిగింది. తనకోసం మోటారు బోటు వస్తుందనీ, తాను జండా వూపి వాళ్ళ కందరికి అభివాదాలు చేసి వామ్చే, యుస్పెనర్, రింటుల్గీ లతో కరచాలనం చేసి అప్పుడు ఆ మోటారుబోటులోకి వెడతాననీ – ఇదీ కెనిరీ వూహించుకున్న దృశ్యం. తనని రక్షించడానికి వచ్చేవాళ్ళలో వీళ్లు తప్పక వుంటారని అతడి అంచనా. ఇక తన సాహసయాత్ర గురించి ముందుగా తాను ఏమీా చెప్పడు. వాళ్ళు అడిగితే అప్పుడు చెబుతాడు. తాను మునుపటివలె గప్పాలుకొట్టే మనిషి కాదని వాళ్ళంతట వాళ్ళే గుర్తించేటట్టు చేస్తాడు! – ఇదీ కెనిరీ తన మనస్సులో చిత్రించుకున్న కథ!

కాని కథంతా మరోలాగ జరిగిపోయింది. కెనిరీని రక్షించడానికి వచ్చింది ఖోల్కోజ్ మోటారుబోటు కాదు. పెద్దదైన ప్రయాణీకుల స్టీమరు వచ్చి నిలిచింది. కెనిరీ జెండా వూపలేదు. చూసి చూసి విసిగి గుడారంలో పడుకుని ఆ సమయంలో నిద్రపోతున్నాడు. స్టీమరు ఆగింది. దాంట్లోంచి ఒక చిన్న నావను నీళ్ళలో దించారు. దానిమీద యిద్దరు నావికులు బయలుదేరి మంచుదిబ్బ వద్దకు వచ్చి దానిమీదకు దిగారు. అయినా యింకా కెనిరీకి మెలుకువ రాలేదు. నావికులకు భయంకూడా వేసింది. అసలితడు బ్రతికివున్నాడా లేదా అని. కాని దగ్గరకు వచ్చేసరికి కెనిరీ హాయిగా గుర్రుపెట్టి నిద్రపోతూండేసరికి వాళ్ళ మనసులు కుదుటపడ్డాయి.

పదినిముషాల్లో మంచుదిబ్బమీద శిబిరం అంతా ఎత్తివేశారు. సామగ్రి అంతా బోటులో జేర్చారు. మరో పది నిముషాల్లో కెనిరీ 'వెల్లెన్' స్టీమరు పైభాగాన తనని చుట్టూ పరివేష్టించివున్న నావికులకేసి నవ్వుతూ నిలబడి వున్నాడు.

బోటులో ఎక్కడంతోనే కెనిరీ తన దగ్గర ఉన్న తిను బండారాలన్నీ నావికుల చేతుల్లో పెట్టేశాడు. జేబులోవున్న చాకొలెట్ బిళ్ళలుమాత్రం వుంచుకున్నాడు. అవి తన ముద్దు పాపలు నికొలాయ్, అలెగ్జాండర్, ఐగెలీ, ఓమ్రిల్కాప్, తన భార్య టెయునీలకు యిస్తాడు. కెనిరీ ఎంత బ్రతిమాలి కోపపడినా నావికులు అతడిచ్చిన వేవీ తీసుకోలేదు. ఖాద్య పదార్థాల టిన్నులన్నీ మళ్ళీ కెనిరీ సంచిలోనే పెట్టేశారు. కాని చుక్కాని మనిషి "ఇదిగో అబ్బాయిలూ! మరీ బెట్టు సరి పోకండి! అవతల పెద్దమనిషి యిస్తోంటే తీసుకోబోమని

అనకూడదు. అతడు లోపల బాధపడడూ? మీారంటే ఎంతో ప్రీతితో అతడు బలవంతం చేస్తూంటే గ్రహించ రేమి?"

స్టీమరుమీాదకు రాగానే కెనిరీని డాక్టరు దగ్గరకు తీసుకొని వెళ్ళారు. నట్టనడి సముద్రంలో మంచుదిబ్బమీాద నాల్గు రోజులు పడివున్నప్పటికీ, రక్తం గడ్డకట్టుపోయే చలిలో చుకోటన్స్క సముద్రంలో మునకలు వేసినా, కెనిరీ ఆరోగ్యం ఏమీా పాడవలేదు. అందుచేత "శుభ్రంగా వేడినీళ్ళుపోసుకో ఇంకేమీా అక్కర్లేద"ని డాక్టరు అన్నాడు. మీాటతిప్పితే పైనుంచి వానజల్లులా పడే ఈ నీటి స్నానం ఎల్లా చెయ్యాలో కెనిరీకి ఇంతవరకు తెలియదు. అందుచేత డాక్టరే స్వయంగా దగ్గరుండి స్నానం చేయిస్తా నన్నాడు. ఇద్దరు కలిసి భోజనాల వేళ అయ్యేదాకా వేడినీళ్ళ జల్లులో ఆడుతూ పాడుతూ సరదాగా స్నానం చేశారు.

ఈలోగా స్టీమరు తీరం దగ్గరకు చేరుతోంది. స్టీమరు కెప్టెన్ వైర్లెస్ ద్వారా డాన్ ఖోల్కోజ్ లోని వారికి వర్తమానం పంపుతూ కెనిరీకోసం ఎవరినైనా పంపమని తెలియపరిచాడు. ఖోల్కోజ్ కు పడమరగా అయిదుమైళ్ళ దూరంలో కెనిరీని దింపుతామనీ అక్కడకు వచ్చి తీసుకొని వెళ్ళవలసిం దనీ తెలిపాడు. మంచుగడ్డలు తేలుతూండటం వలన అంతకంటె వూరు దగ్గరగా రావడానికి వీలు లేదన్నాడు.

ఖోల్కోజ్ నుండి రెండు స్లెడ్జి బళ్ళమీాద బయలు దేరారు. కుక్కలులాగే స్లెడ్జి బళ్ళు మంచు మిట్ట పల్లాలను దాటుతూ ముందుకు పరుగెత్తాయి. ముందు స్లెడ్జిలో వృద్ధ మేమిల్ కూచున్నాడు. రెండవదాంట్లో రింటుగ్గి కూచు

న్నాడు. నేమిల్ కంటె మించి ఆదరంగా మాట్లాడేవారు, అతనికంటె మించి హుందాగా వ్యవహరించేవారు ఖోలోక్జ్ లో లేనందున అతనినే ఇందుకు నియమించారు. నావికులతో మాట్లాడేటప్పుడు, వారిని అభినందించవలసినప్పుడు "మేమ్మేమ్మే" అని నీళ్ళు నమిలేవాళ్లు కాకుండా చక్కగా మాట్లాడేవాళ్లు ఉండాలి! రింటుప్లీ ఖోలోక్జ్ అంతటికి బలిష్ఠమైన యువకుడు. ఒకవేళ కెనిరీ కదలలేని స్థితిలో వుంటె అతనిని తీసుకురావడానికి నేమిల్‌కు సహాయంగా వుంటాడని యితనిని పంపారు.

అనుకున్న సమయానికి స్టీమరు, స్లెడ్జ్‌బళ్లు సంకేత స్థలానికి చేరుకున్నాయి. ఒక నావ వచ్చి ఈ డాన్ ఖోలోక్జ్ ప్రతినిధులను ఓడమీదకు తీసుకొని వెళ్ళింది.

అది మధ్యాహ్నం భోజనాల సమయం. కెప్టెన్ అందరిని భోజనాలకు రమ్మని ఆహ్వానించాడు. ఇంకా స్నానాల గదినుండి బైటపడని డాక్టర్ని, కెనిరీని త్వరగా రమ్మని కబురు చేశాడు.

అందరూ కూచున్నారు. ఆఖరిని వచ్చి కూచున్నది డాక్టరు, కెనిరీలు. ఇద్దరూ హాయిగా స్నానంచేసి, కలకల్లాడుతూ వచ్చారు. డాక్టరు వస్తూ యూనిఫారం తొడుక్కుని బొత్తాలు సరిచేసుకుంటున్నాడు. కెనిరీ వస్తూ వస్తూ తడిగా ఉన్న నల్లటి జుట్టును దువ్వుకుంటున్నాడు.

కెప్టెన్ సరసనే కెనిరీకి గౌరవస్థానం యిచ్చారు. కెప్టెన్ కుడివైపున ఆసీనుడైన కెనిరీ ఎదురుగావున్న రింటుప్లీని చూసి తన కళ్ళను తానే నమ్మలేకపోయాడు; ఉబ్బితబ్బిబ్బై

పోయాడు. అమాంతంగా కౌగిలించుకున్నారు ఇద్దరూ. "ఎల్లా వచ్చావు యిక్కడికి రింటుల్గీ?"

"ఎంతో సంతోషం కెనిరీ! మేము ఇప్పుడే వచ్చాము. నిన్ను తీసుకురావడానికి."

"ఇంకా ఎవరు నీతో వచ్చారు?"

"మేమిల్ !"

"మేమిల్ ఎక్కడ?"

"అదుగో కెప్టెన్ ప్రక్కనే!"

కెనిరీ తన ఎడమవైపు తిరిగాడు. మేమిల్ నెరిసిన తల కన్పించింది. మేమిల్ కెనిరీని చూసి చిరునవ్వుతో తల వూపాడు. కెప్టెన్ వెనుకనుండి యిద్దరూ కరచాలనం చేసుకున్నారు. వెంటనే కెప్టెన్ లేచి మాట్లాడటం ప్రారంభించడంతో మేమిల్ - కెనిరీ ఏమీ మాట్లాడటానికి అవకాశం కలగలేదు.

రింటుల్గీ, మేమిల్ కనపడటంతో కెనిరీ పరమానంద భరితుడయ్యాడు. తాను చిన్నప్పటినుండి తిరిగిన పరిసరాలు, తన వూరుమీద కెనిరీకి ఎంత మనసుపోయిందంటే మేమిల్‌ను చూసీ చూడటంతోనే అతనికి పట్టరాని సంతోషం వేసింది. తన వూరును, తన స్నేహితులను చూసి నాల్గు రోజులు కాక నాల్గు సంవత్సరాలైనట్టు ఉంది. నిజానికి ఈ ముసిలాడు తన వూరికి ప్రాణం వంటివాడు. అతడు లేని వూరును వూహించుకోవడమే దుర్లభం!

కాని ఈ ముసిలాడు యిక్కడ అప్రియమైన విషయాలను ఏకరవు పెట్టడుగదా! నోరు విప్పకుండా ఎంతసేపో

ఇతగాడు కూచోలేడు. ఎప్పుడూ ఏదో ఒకటి వాగుతూ గొడవ చేస్తుండాలి!

క్రమంగా కెనిరీ అనుమానం భయం పెరిగిపోయింది. అవును అతడు తప్పక ఏదో ఒకటి అసహ్యంగా మాట్లాడ కుండా ఉండడు. అసలు అతడు వచ్చిందే అందుకేమో— అ నావికులందరి యెదుట తన్ను అవమానించడానికేనేమో! "ఇదంతా కెనిరీ చేసుకున్న తప్పే...అతడు వట్టి సోమరిపోతు. కార్మిక క్రమశిక్షణను ఉల్లంగించే రకం అని పాతపురాణం అంతా విప్పుతాడేమో? ఇప్పటికి ఎన్నిసార్లు ఈతిట్లు తాను వినలేదూ? ఎన్నిమీటింగులు పెట్టుకొని అందరూ తనని విమర్శించలేదు? అందులో వృద్ధనేమిల్ ఎప్పుడూ తనను విమర్శిస్తూనే ఉంటాడుకదా! వూళ్ళో అంతమంది ఉంటే ఈ ముసిలాడే దొరికాడా...ఇక్కడకు వంపడానికి? పోనీ వామ్చె రాకూడదూ? ఉపాధ్యాయుడు ఐనీస్ రాకూడదూ!

అదే సమయంలో కెప్టన్ తన పేరుయెత్తి ఏదో చెబుతున్నాడు. దానితో కెనిరీదృష్టి ఈ సొదమీంచి మళ్ళింది.

"డాన్ ఖోల్కోజ్ వేటగాడు క్రాస్నేడ్ కెనిరీని, ఏవిధంగా రక్షించిందీ మనందరం చూశాము. అంతో యింతో రక్షణ కార్యక్రమంలో అంతా పాల్గొన్నాము. ఇతనికోసం వెతకడం మొదలుపెట్టగానే చుకోటస్కీ సముద్రంలో గాలించవలసిందిగా మమ్మల్ని కూడా ఆదేశించారు. "వెల్లెన్" అప్పుడే చుకోటస్కీ సముద్రంలో ప్రవేశిస్తోంది. అప్పటికింకా బేరింగ్ జలసంధిలోనే ప్రయాణంచేస్తోంది. ఆ ప్రాంతంలో

ప్రయాణం చేస్తున్న అన్ని ఓడలకు అదే సందేశం అంద జేశారు. బాక్షమేవ్ విమానంమీద వెళ్ళి కెనిరీ ఎక్కడ కొట్టుకొనిపోతున్నాడో తెలిసినప్పుడు అన్ని ఓడలు కంటె కెనిరీకి 'వెల్లెన్' దగ్గరలో ఉంది. అందుచేత మా ప్రయాణ మార్గంనుండి మళ్ళి - కెనిరీని ఆ మంచు దిబ్బలనుండి రక్షించ వలసిందిగా మాకు ఉత్తర్వులు జారీచేశారు. వైర్లెస్ ద్వారా మాస్కోలో వున్న ఉత్తర సముద్రమార్గ నిర్వహణ కేంద్రం నుండి మాకు ఈ వార్త అందజేశారు. దానిని మేము శిరసా వహించాము.

"తనను రక్షించడానికి ఇంత హడావిడి జరిగిందన్న మాట" అని ఆశ్చర్యపోయాడు కెనిరీ. తన వూళ్ళో వుండే వాళ్ళనే కాక అనాదిర్‌లో వాళ్ళను చివరకు మాస్కోలో వాళ్ళను కూడా తాను కష్టపెట్టాడన్నమాట. కెనిరీ సముద్రం పాలు కాకూడదని, చుకోట్‌స్క సముద్రానికి బలికాకూడదని ఇంతమంది తలుచుకున్నారు! తల్లక్రిందులుగా ప్రయత్నం చేశారు!!

తనలో నిండిన ఆర్ద్రభావాల కనుగుణ్యంగానే కెప్టెన్ తన ప్రసంగం కొనసాగిస్తున్నాడు.

"మానవ ప్రాణంకంటె యావత్ప్రపంచంలోనూ విలువైనదేదీ లేదని సోవియట్ ప్రజలమైన మనం ఎంచుతాము. ఈ ప్రబోధాన్ని కమ్యూనిస్టుపార్టీ మనలో కల్గించింది. ప్రజల కోసం మన దేశంలో ఎన్నో జాగ్రత్తలు, రక్షణలు తీసుకున్నారు. అందుచేత కెనిరీ రక్షణార్థం మనం ఎంతో సంతో

పంతో పూనుకున్నాము. మీరు మావోడనుండి వెళ్ళే లోగానే వెల్లెన్ ఓడ నావికులందరి తరఫున కామ్రేడ్ కెనిరీ ఆరోగ్యంగా, ఆనందంగా కలకాలం జీవించాలనీ, ఆయన కృషిలో విజయం పొందాలనీ హృదయ పూర్వకంగా కోరుతున్నాము.

కెప్టెన్ తదితరులందరు కెనిరీ సురక్షితంగా తిరిగి వచ్చినందుకు అతగాడిని అభినందిస్తూ పానపాత్రలను ఎత్తారు. కెప్టెన్ తన పానపాత్రను ఖాళీచేసిన తరువాత కెనిరీతో కరచాలనం వేశాడు. ఆ తరువాత మేమిల్, రింటుప్గీలతో కరచాలనం వేశాడు. అటుపిమ్మట మాట్లాడుతూ "డాన్ ఖోల్కోజ్ దినదినాభివృద్ధి పొందాలనీ, అందులోని సభ్యులందరు పురోభివృద్ధి నందాలనీ, మన పితృభూమి సర్వతోముఖాభివృద్ధి పొందాలని కాంక్షిస్తున్నాము" అన్నాడు.

ఆ తరువాత మేమిల్ లేచాడు. "ఈ ముసిలాడు లేచాడు. ఏమి అవాకులు చెవాకులు మాట్లాడతాడో"నని కెనిరీకి గుండెలు కొట్టుకుంటున్నాయి. మేమిల్ ఇలా మొదలు పెట్టాడు.

"నేను రెండుమాటలు చెప్పదలచాను. కామ్రేడ్ కెప్టెన్ మీకు మా అభివందనలు. కామ్రేడ్స్ నావికులారా! మీ అందరకు మా అభివందనలు. మీరు ఎంతో దయతో వెలిబుచ్చిన భావాలకు, మీరుచేసిన మహోపకారానికి, మా ఖోల్కోజ్ సభ్యుడు కెనిరీని రక్షించినందుకు మా కృతజ్ఞతను తెలియజేస్తున్నాము.

మేమిల్ ఒకమారు అందర్నీ కలియ జూశాడు. అతని దృష్టి ఒక యువక నావికుని మీదకు వచ్చి అక్కడ ఆగి పోయింది.

"కామ్రేడ్ కెప్టెన్ ఎంతో ఉచితమైన విషయం సెల విచ్చారు. అవును, మన దేశంలోని సామాన్య ప్రజకు నేడు జరుగుతున్న సంరక్షణ అమోఘం. ప్రజాసామాన్యం కోసం ఈనాడు తీసుకుంటున్నంత జాగ్రత్త ఒకనాడు లేదు. పూర్వం ఎల్లా వుండేదో నేను కొంచం చెప్పదలచుకున్నాను. నేనొక రోజున మా సోదరునితో కలసి ఇల్లాగే వేటకు వెళ్ళాను. ఇద్దరం ఒక మంచు దిబ్బమీద సముద్రంలో కొట్టుకొని పోయాం. అప్పటికి మేము చిన్నవాళ్ళం. మా అన్నకు ఇరవై యేళ్ళు వుండేవి. నేను ఇంకా చిన్నవాణ్ణి. మమ్మల్ని రక్షిం చడం కోసం ఎవరూ రాలేదు. ఎవరూ అతీ గతీ పట్టించు కోలేదు. ఎవడైనా వేటగాడు ఈ విధంగా సముద్రంలో కొట్టుకొనిపోతే వాణ్ణి సముద్రదేవత 'కెలీ' లాగుకొని పోయిందని ఆ రోజుల్లో అనుకునేవారు. మా శాస్త్రాలు "షా మాన్స్"లో అల్లా వ్రాసేవారు. 'కెలీ' దుష్టదేవతల చర్యగా ఇటువంటి ఘటనలను వర్ణించేవారు. ఆ రోజులనాటి పరిస్థితి అది. పైగా ఆ దేవతను ఎవరూ ఎదిరించకూడదు. దాని నోట్లోపడిన ఎవరినీ రక్షించకూడదని కూడా ఆనాటి నమ్మిక.

మేము ఆ విధంగా రెండు వారాలు సముద్రంలో కొట్టుకొనిపోయాము. చలికి బిగుసుకుపోయి, ఆకలికి దహించుకు పోయి మాడిపోయాము. అది శీతాకాలం అవడంవలన మంచు

దిబ్బ కరిగిపోయి సముద్రంలో కలిసిపోతుందని భయంమాత్రం లేదు. కాని నడిశీతాకాలం అవడంవలన బిగిసిపోయిన మంచు గడ్డకంటె మరింతగా మేము బిగుసుకుపోయాము. మా అన్న రెండు పాదాలు మంచువలన పగిలి శిథిలమై పోయాయి. చివరకు మేము ఒడ్డున చేరాముకాని, అది మా దేశం కాదు. విదేశతీరం. అక్కడ ఉన్న అమెరికా ఎస్కిమోలు మమ్మల్ని రక్షించారు. మా అన్న కొద్ది రోజులకు చచ్చిపోయాడు. నేను ఎట్లాగో బ్రతికి బైటపడ్డాను. ఏడేళ్ళపాటు అష్టకష్టాలు పడ్డాను. చివరకు ఎల్లాగో స్వస్థలం చేరుకున్నాను. మళ్ళీ పుట్టిన ఊరు చూడటానికి ఏడేళ్ళు పట్టింది."

వృద్ధ మేమిల్ ఎంతో నెమ్మదిగా, తాపీగా మాట్లాడుతున్నాడు. ప్రతీ వారూ ఎంతో ఆసక్తితో వింటున్నారు. ఒక్కసారిగా నవ్వుతూ మేమిల్ కెప్టెన్ వైపు తిరిగి ఇలా అన్నాడు.

"నేనుకూడా ఒక నావికుడుగా ఒక అమెరికా స్టీమరు మీద పనిచేశాను. కాని ఆ కెప్టెన్ నన్ను తనదగ్గర ఎప్పుడూ కూచోబెట్టుకోలేదు. అది ఎటువంటి దుర్భర జీవితం అంటే ఓడ కొయ్యకు ఉరితీసుకొని చచ్చినా ఎవడికీ ఏమీ పట్టివుండేది కాదు. అటువంటి నికృష్టపు బ్రతుకు అది! ఇది ఎందుకు చెప్పావంటే నాటికీ, నేటికీ ఎంత తేడా ఉందో చూపడానికే! ఎవడు ఎల్లా చచ్చిపోతున్నా, ఎవడూ పట్టించుకొనేవారు కాదు. "పోయాడా? వాడి గతి అంతే" అసలు వాడు ఉన్నాడో చచ్చాడో ఎవరికీ అక్కర్లేదు. తల్లీదండ్రీ ఉంటే ఒక ఏడుపు ఏడ్చి ఊరుకొనేవారేమో. కాని ఈనాడు?

అప్పటికీ ఇప్పటికీ పోలికేలేదు. కెనిరీ కొట్టుకొనిపోతూంటే అనుభవం గల్గిన వైమానికునితో ఒక విమానం వెతకడానికి పంపారు. రోజుకి మూడుసార్లు కెనిరీ కనడ్డాడా లేదా అని వైర్లెస్ సందేశాలు పంపారు. "కెనిరీ కన్పడలేదా ? అయితే ఇంకా వెతకాలి, కన్పడేదాకా వెతకాలి" అని సందేశాలు పంపుతూండేవారు. మనిషి గురించి అదీ ... అంత జాగ్రత్త ఈనాడూ తీసుకుంటున్నారు.

"ఆ తరువాత నేను కెనిరీ గురించికూడా రెండుముక్కలు చెప్పాల్సిఉంది. అతనిగురించి చెప్పవలసివస్తే చాలాఉంది. వేటలో గురిచూసి కొట్టడంలో అతడు బహునేర్పరి. స్లెడ్జిబండి తయారు చేయడంలోగాని, కయాక్పై చర్మంవేసి కుట్టడంలో గాని అతనితో సమానమైన చెయ్యి ఏదీలేదు. ఈ అన్నిటితో బాటు అతడు చదరంగంకూడా బాగా ఆడకలడు. జిల్లాపోటీల్లో అతడు బహుమతులుపొంది ఖోల్కోజ్కు పేరు తెచ్చాడు,"

కెనిరీ తల పైకెత్తడంలేదు. తలవంచుకొని టేబిల్ వైపే చూస్తున్నాడు. మేమిల్ ఉన్నది ఉన్నట్టే చెబుతున్నాడు. అతిశయోక్తులేమీ చెప్పడంలేదు. కాని చెప్పవలసివస్తే కెనిరీ గురించి ఇంకా చెప్పవలసిన విషయాలు అనేకం ఉన్నాయి. ఈవేళ ఈ ముసలాడు తనమీద ఇంత దయ ఎందుకు చూపిస్తున్నాడో ? కేనిరీమీద జాలిదలిచి ఈ విధంగా చేస్తున్నాడా ? ఆహాఁ అది కాదు. మేమిల్ అలా జాలి తలిచే మనిషి కాదు. ఎవరినైతే నావికులు రక్షించారో అతని లోసుగులను ఇప్పుడు వాళ్ళకు చెప్ప నవసరంలేదని మేమిల్ భావించి వుండవచ్చు. ఇది సమయం

కాదు, కెనిరీ చాలా ఉత్తముడు. మంచివాడు అని మాత్రమే వాళ్ళకు తెలియాలి. ఆ తరువాత కావలిస్తే మేమిల్ కెనిరీ బద్ధకం గురించి తప్పులగురించి ఘాటుగా విమర్శించవచ్చు. ఇంత గందరగోళం జరిపినందుకు, ప్రభుత్వ సొమ్ము తన రక్షణకోసం ఇంత ఖర్చు పెట్టినందుకు తిట్టవచ్చు...కొంప తీసి ఇప్పుడు అదే మొదలు పెట్టడుగదా !

ప్రతివారూ కెనిరీకేసి చాలా గౌరవంగా చూస్తున్నారు. కెనిరీ మనస్సులో జరుగుతున్న యుద్ధం ఏమైతేనేం ? తనని మొట్టమొదట కలిసిన నావికుడు మంచి చదరంగపు ఆటకాడు. కెనిరీ వంటి అందెవేసిన చేయితో చదరంగం ఆడే అవకాశం దాటిపోయింది కదా అని విచారపడ్డాడు. ఈ విషయం తనకి ముందే తెలిస్తే ఎంత బాగుండేదనుకున్నాడు. నీటిజల్లులో అంతసేపు స్నానంచేసి ఉండనిచ్చేవాణ్ణి కాదని అనుకున్నాడు.

మేమిల్ ఇంకా చెప్పుకుపోతున్నాడు. "ఇంత క్రితం జరిగిన ఒక విషయం వినండి. ఈ సంగతంతా నాకు కామ్రేడ్ రింటుప్ఫీ చెప్పాడు. కెనిరీ, రింటుప్ఫీలు ఒకే దళంలో ఉంటున్నారు. కెనిరీని ఆ దళానికి ఈ మధ్యనే బదిలీ చేశాం...... క్రమశిక్షణ బాగుపడేందుకు..."

కెనిరీ ఇంకా తలవంచుకునే ఉన్నాడు. ఉన్నట్టుండి ఒక్కసారిగా ఎత్తి నావికులకేసి చూశాడు. మేమిల్ చెప్పేది తనకర్థమయ్యే తీరు ఒకటి. నావికులు అనుకుంటున్నది మరొకటి. బదిలీచేయడం కెనిరీ క్రమశిక్షణను బాగుచేయడానికా ? లేక దళం క్రమశిక్షణను కెనిరీవెళ్ళి బాగుచేయడానికా ? నావికులు

అర్థం చేసుకొనేది కెనిరీవెళ్ళి దళం క్రమశిక్షణను బాగుచేయ డానికేనని! మేమిల్ ఘటికుడు...ఎంత శ్లేష ప్రయోగిం చాడు!

కాని రింటుప్లీకేసి చూసి కెప్టెన్, నవ్వినసంగతి కెనిరీ కనిపెట్టాడు. బహుశా తాను స్నానం చేస్తున్నప్పుడు మేమిల్ నావికులకు యితరత్రా విషయాలు వూదాడేమో! ఇప్పుడిక ఏమి చెబుతాడో!

వృద్ధ మేమిల్ ఉపన్యాసం కొనసాగించాడు. "ఒకసారి రింటుప్లీ-కెనిరీ దళం ఒక మోటారు యంత్రాన్ని ఎత్తుకొని తీసుకొని వస్తున్నారు. రింటుప్లీ మోటారును బుజాల కెత్తుకొని ముందు నడుస్తున్నాడు. కెనిరీ తరువాత నడుస్తు న్నాడు. రింటుప్లీ బలిష్టమైన వాడని మీరు చూసే ఉన్నారుకదా! మోటారులాంటి బరువు అతనికి ఒక్క లెక్కలోనిదికాదు. కాని అప్పుడు నడిచేది చాలా ప్రమాద కరమైన దోవ. రింటుప్లీ తొట్రుపాటుపడి ముందుకు ఒంగి పోయి మోకాలుపై ఆనాడు పడిపోతానేమోననిపించింది అతనికి. మోటారునైనా క్రిందపడవేయాలి...లేదా మోటారు తాను కలిసి మహా అగాధమైన లోయలోనైనా పడిపోవాలి. ఎంతమాత్రం కాలు నిలవని పరిస్థితిదని రింటుప్లీకి తేలిపోయింది. అటువంటి మహా క్లిష్టసమయంలో కెనిరీ ఒక అంగలో వెళ్ళి అమాంతంగా మోటారు పట్టుకొని తన చేతుల్లోకి లాగు కున్నాడు. రింటుప్లీని కాపాడాడు. ఆ తరువాత మిగిలిన దూర మంతా మోటారును కెనిరీయే తీసుకొనివెళ్ళాడు. ఆ దోవ చివరికంటూ అతి క్లిష్టమైనదే. ఏమి రింటుప్లీ అంతేనా?"

"అవునవును మేమిల్ మామా! సరిగ్గా నువ్వు చెప్పినట్టే ఆనాడు జరిగింది. అదే కెనిరీ గాకుండా మరెవ రైనా అయివుంటే ఆ మోటారు దక్కివుండేది కాదు. నేను ఆ మహా అగాధంలోకి పడిపోకుండా ఉండేవాణ్ణి కాదు."

నిజమే ఆ నాడు జరిగిందంతే. కెనిరీకి ఇప్పుడు జ్ఞాపకం వచ్చింది. అంటే తాను మంచుగడ్డమీద కొట్టుకొనిపోయి నపుడు వ్రాళ్ళో వాళ్లందరు తన గురించి ఈ విధంగా తల పోస్తున్నారన్న మాట. తన మంచితనం గురించిన సంఘటనలు జ్ఞప్తికి తెచ్చుకున్నారన్న మాట.

"నేను నా ఉపన్యాసాన్ని ఈ విషయంతో ముగించ దలచుకున్నాను. డాన్ ఖోల్కోజ్ తరఫున నేను మిమ్మల్ని అభినందిస్తున్నాను. కామ్రేడ్ కెనిరీ భార్య తరఫున, అతని నల్గురు కొడుకులు – కవల జంటలు – పెద్ద జంట ఓమ్రిల్యాకట్, ఐగిలీలు, చిన్న జంట అలెగ్జాండర్, నికోలాయ్‌ల తరఫున మిమ్మల్నందరినీ అభినందిస్తున్నాను.

మేమిల్ చెప్పిన ఈ ఆఖరిమాటలు నావికులందరిని మరింత ఉత్సాహపరిచాయి. అసలు ఈ విషయం – కెనిరీకి కవలజంటలున్న విషయం – మొదట చెప్పకుండా ఉద్దేశ్య పూర్వకంగానే మేమిల్ ఆఖరువరకూ అట్టేపెట్టాడు. కెనిరీకి నల్గురు కొడుకులు – ఇద్దరు కవలజంటలున్న విషయం వారంద రికీ మరింత ఆనంద కారణమైంది నావికులందరికీ తమ తమ పిల్లలు జ్ఞాపకం వచ్చారు. ఎప్పుడో ఇళ్ళవద్దనుండి తాము బయలుదేరారు. తమ పాపలందరు ఇప్పుడు కళ్ళల్లో మెదల సాగారు. కెనిరీ కుమారులందరు ఆరోగ్యంగా ఉండాలని

కోరుతూ నావికులందరు – పానపాత్రలెత్తారు. ఒకొక్కరి పేర్లు చెపుతూ అభినందించారు.

వెలుగులు విరజిమ్ముకొన్న ఆరాత్రివేళ మంచుదిబ్బలను, ఎత్తు పల్లాలను దాటుకుంటూ రెండు స్లెడ్జిబళ్ళు వేగంగా డాన్ ఖోల్మోగ్స్ కేసి తీరంవెంబడే పరుగెత్తాయి. ముందు స్లెడ్జిమీద రింటుల్తి ఉన్నాడు. వెనుకనున్న స్లెడ్జిమీద వృద్ధ మేమిల్, కెనిరీతో కలిసి కూచున్నాడు !

# పదిరోజుల సాహచర్యం

తెల్లవారింది. కిటికీ తెరవ త్తిగించి బైటికి చూశాను. రైలు ఒకవంతెనను దాటుతోంది. రైలుచక్రాల చప్పుడు అమాంతంగా మారిపోయి డబడబా మనడంతో నాకు మెళుకువ వచ్చేసింది.

ఆ నది, బహుశా అది వియాత్కా అయివుండవచ్చు, ప్రశాంతంగా ప్రవహిస్తోంది. వియాత్కా అవునో కాదో అడుగుదామంటే మెళుకువగా ఎవరూ లేరు. గెయుటీగిన్ కప్పుకొని మరీ పడుకున్నాడు. గాఢనిద్రలో ఉన్నాడు కాళ్ళ దగ్గర దుప్పటి ముడతలు పడిఉంది. ఒకకొస క్రిందికి వేళ్ళాడుతూ రైలుపెట్టె అటూ యిటూ వూగుతున్నప్పుడు అదికూడా వూగుతోంది. క్రింద బెర్తుల్లోని తోటి ప్రయాణీకులుగూడా నిద్రలు పోతున్నారు. రైలులో ఇంకా అంతా చీకటిగా ఉంది. కిటికీ తెరలు దట్టంగా ఉన్నాయేమో ... వెలుతురు లోపలకు ఏమీ చొరడంలేదు. కిటికీ తెర కొద్దిగా ఒక పక్కకు వొత్తిగించి వంతెన ఇనుప దూలాల్లో నుంచి చూస్తే సువిశాల మైన నదీ ప్రవాహంలో ఉదయాకాశపు కాంతులు ప్రతిఫలిస్తు న్నాయి. నిర్మలంగా ఉన్న నీటి ఉపరితలంమీద కుంకుమ,

బంగారం రంగులీనుతున్న మేఘాల కాంతులు కన్పిస్తున్నాయి. ఈ దృశ్యాన్ని చూడటానికి మోచేతులమీద ఆనుకొన్నాను. అంతలోకే నది తళుక్కున మాయమైపోయింది. నది దాటేశాం గాని ఇంకా వంతెన చివరి భాగం కనపడుతూనే వుంది. నది వెడల్పు కంటె వంతెన వెడల్పు రెండింత లున్నట్టుగా ఉంది. ఒకవేళ నది వరద వచ్చినప్పుడు గట్లు తాసి మరింత వెడల్పు అవుతుందిగా ........ అందుకే అటూ యిటూ అదనపు ఖానాలు కడతారు. వంతెన పూర్తిగా దాటేశాం. ఆ వెంటనే ఒక బర్రి చెట్టు మోడు, ఆ తరువాత కొన్ని గుడిసెలు, ఒక లెవెల్ క్రాసింగ్ ఒకదానివెంట ఒకటి వెనక్కు దాటిపోయాయి. లెవెల్ క్రాసింగ్ వద్ద మూడు లారీలు, ఒక 'పోబేదా' కారు, సైకిళ్ళమీద ఉన్న కొందరు కన్పించారు. బహుశా ఆ లారీలనిండా ఉన్నది కొత్తగా నూర్చిన ధాన్యం అయి ఉండాలి. వాటిమీద ఎర్రటి జండాలు, వాటిమీద అక్షరాలతో అటు యిటూ కట్టి ఉన్నాయి. లెవెల్ క్రాసింగ్ వెళ్ళిపోయింది. ఆ తర్వాత కూరగాయల తోటలు యిళ్ళు వచ్చాయి. ఇప్పుడు రైలు నెమ్మదిగానే నడుస్తుంది.

బండి ఒక స్టేషనులో ఆగింది. మా పెట్టె చిట్టచివర ఉండటంవలన పేరేమిటో కన్పించలేదు. ఇటుకతో కట్టిన ఒక కట్టడం దానిమీద 'లగ్గేజి' అని వ్రాసి ఉన్నది. బండి కదిలినప్పుడు స్టేషన్ పేరు ఏమిటో చూద్దామని అనుకున్నాను.

ఈలోగా కళ్ళు మూసుకుని ఒక వారంరోజుల క్రితం ప్రారంభించిన కథ గురించి ఆలోచించడం మొదలుపెట్టాను. కళ్ళు అల్లాగే మూతలు పడిపోయాయి. నిద్ర పట్టేసింది. ఆ

నిద్ర, నిద్ర మళ్లీ లేచి చూసేసరికి పదిగంటలైంది. పొద్దున్న పూట అంతా నిద్రపోతూనే ఉన్నానన్నమాట.

కిటికీ తెరలు పూర్తిగా ఎత్తివేశాం. ఎండ లోపలికి పడుతోంది. గెయుటీగిన్ తనపక్కను జాగ్రత్తగా చుట్టబెట్టి క్రిందికి దిగి కూచుని తోటి ప్రయాణీకులతో మాట్లాడుతున్నాడు.

తోటి ప్రయాణీకులు వచ్చిరానీ రష్యాభాషలో మాట్లాడుతున్నారు. నిన్న వాళ్ళు రైలు ఎక్కుతున్నప్పుడే ఈ విషయం కనిపెట్టాం. గెయుటీగిన్, నేను మాకు వీడ్కోలివ్వడానికి వచ్చినవారు బండి బయలుదేరటానికి అరగంట ముందే స్టేషన్‌కి వచ్చిచేరాం. సామాన్లు పెట్టెలోపల పడేసి తిరిగి ప్లాటుఫారంమీద స్నేహితులతో మాట్లాడుతూ నుంచున్నాము. ఈలోగా పెట్టెనిండటం ప్రారంభించింది. ఇద్దరు దంపతులు పెట్టెదగ్గరకువచ్చారు. ఆయనకి ఏభైయేళ్ళుంటాయి. ఆవిడకు నలభై ఉంటాయి. చాలా ఆకర్షణీయంగా ఉంది. అట్టెండెంటుకు టిక్కెట్లు చూపించి ఏపెట్టె అని అడిగారు. అట్టెండెంటు, మీది మూడవపెట్టె అని చెప్పాడు.

వాళ్ళమాట యాసగా కనపడింది మాకు. ఆయన దుస్తులు, ఆవిడమైన తొడుక్కున ఓవర్‌కోటు సామాన్లపై నగిషీలు ఇవన్నీ మాకు కొత్తగా వింతగా కన్పించాయి. గెయూటీగిన్ "వాళ్ళు బహుశా విదేశస్తులై ఉండాలి" అన్నాడు.

ప్లాటుఫారం మీద మేము మాట్లాడుతూ నుంచున్నది గెయుటీగిన్ స్నేహితులతో. వాళ్ళందరు మాస్కోయూనివర్సిటీ

విద్యార్థులు. గత శీతాకాలం సెలవుల్లో గెయుటీగిన్ వీళ్ళందరు కరేలియన్ ప్రాంతంలో మంచు ఆట ఆడినప్పుడు స్నేహితులయ్యారు. లెనిన్‌గ్రాడ్‌నుండి ఉదయం మేము వచ్చినతరువాత గెయుటీగిన్ వాళ్ళకు ఫోను చేశాడు. వాళ్లు స్టేషన్‌కువచ్చి కలుసుకున్నారు.

బండి బయలుదేరేవరకు మేము ప్లాట్‌ఫారంమీాదే నుంచుని మాట్లాడుకున్నాము. బండి బయలుదేరినతరువాత పెట్టెల్లోకి ఎక్కి అక్కడనుండి గట్టిగా అరుస్తూ మాట్లాడ్డం మొదలుపెట్టాం. బండివేగం అందుకోవడంతో మా టోపీలు ఊపుతూ వారినుండి వీడ్కోలు తీసుకున్నాం. ఆ తర్వాత తీరా పెట్టెలో కలియజూసినమీాదట ఇందాక చూసిన దంపతులు ఈ పెట్టెలోనే ఉన్నారనిగాని, వారితో పదిరోజులు, పాటు ఖబరోవస్కదాకా సాహచర్యం నెరపాలనిగాని మాకు తోచలేదు.

గెయుటీగిన్ చెప్పినమాట నిజం. వాళ్ళు విదేశీయాత్రీకులే. ఆయన 'లీడ్జ్' లో భాషాశాస్త్రాధ్యాపకుడు. ఆయన భార్య చిత్రకారిణి. ఆయన రష్యన్‌భాష ఒక మోస్తరుగా మాట్లాడుతున్నాడు. ఆవిడ తప్పులతో వచ్చీరాని విధంగా మాట్లాడుతోంది. కాని వారు మాట్లాడే రష్యన్‌భాషలో విదేశీయాస కొట్టవచ్చినట్టుగా కనబడుతోనే ఉంది. ఆయన మాట్లాడేటప్పుడు తప్పులువస్తున్నా, భార్య తప్పుల్ని దిద్దడంలో మాత్రం వెనుకబడటంలేదు.

మేము చుక్చీ విద్యార్థులమనీ, వేసవి సెలవులకు ఇళ్ళకు వెడుతున్నామనీ విన్నతర్వాత వాళ్ళఆశ్చర్యానికి అంతులేదు.

"మేము అంగార గ్రహవాసులమైనట్లు తిరిగి అంగారక గ్రహానికి వెళ్ళి పోతున్నట్లుగా వాళ్ళ మాటలు ఉన్నాయి.

వాళ్ళు చాలా యుక్తిపరుల్లా కనిపించారు. మమ్మల్ని వింతమనుష్యుల్లా చూస్తున్నప్పటికి దానిని పైకి ఏమాత్రం కనిపించ నివ్వకుండాను, మమ్మల్ని ఏమాత్రం నొవ్వజేయ కుండాను జాగ్రత్త పడుతున్నారు.

ఆయన కళ్లల్లో దయార్ద్రిత, తెలివి తేటలు ఉట్టిపడు తున్నాయి. పైగా నవ్వు మోహం. ఆయన భార్య, ఆయన మాతో ఎంతో కలిసి మెలసి సహజంగా ప్రవర్తిస్తున్నారు. కాని వాళ్ళు చెప్పే ప్రతీమాటలో, చూసే ప్రతీచూపులో మేమంటే ఏమిటో అపనమ్మకం, శంక తొంగి చూస్తూనే ఉన్నాయి. మొదటమాకది సరదాగానే ఉంది. కాని ఆతర్వాత ఇది కొంచెం అసహ్యకరంగాను, అవమానకరంగాను అనిపించి మేము అక్కడనుండి తప్పించుకొని ఫలహార శాల ఉన్న పెట్టెలోకి వెళ్ళాం. తిరిగి వచ్చేసరికి దంపతులు నిద్రపోతున్నారు.

ఒకరోజు గడిచింది. పైన బెర్తులపై మేము పడు కున్నాం. క్రిందవాళ్లు మాట్లాడుకుంటున్నారు. మళ్ళీ అదే విషయం : ఉత్తరధృవవాసుల గురించి, వాళ్ళ ఆచార వ్యవ హారాలు గురించి, వాళ్ళ అసాధారణ స్వభావాలు, ముచ్చట గొలిపే ఆదిమవాస లక్షణాలు గల వారి కళలు గురించి మాట్లాడుతున్నారు. నేను నిద్రబోతున్నట్టు నటిస్తున్నాను.

"మా కుతూహలం...మీకు మరీ చికాకుగా ఉందేమో...విసుగెత్తడంలేదుకదా! మరేమీ అనుకోకండి

సుమా! మేము మిమ్మల్ని కలుసుకోవడం చాలా అదృష్ట మనే చెప్పాలి. చుకోట్కా గురించిన ఆ నవల బాగానే ఉంది...ఏమిటి...దాని పేరు నోరు తిరగడంలేదు?

"అలిఔట్ పర్వత ప్రయాణం" అన్నాడు గెయుటీగిన్.

"అవునవును అరిఔట్...భగవాన్...నోరు తిరగ దాయే...చాలా సరదాగా ఉందే ఆ పేరు. నాభార్యవద్ద... ఆతాలూకు బొమ్మలన్నీ ఉన్నాయి. రెయిన్‌డీర్, వాల్రస్, ధృవప్రాంత ఎలుగుబంటి...ఇంకా అవీయివీ...అన్నీ. అదేమిటి ఆ పొడుగాఉండే స్లెడ్జి...దాని పేరు ఏమిటి?

"నార్తి?"

"అవును, అవును..."నార్తి!" ఇదంతా ఏదో దేవ, గంధర్వలోక కథ లా వుంది. ఎక్కడి ఉత్తర ధృవం ఎక్కడి లోకం ఓయ్...బాబోయ్! ఆ ప్రాంతాల్లో బ్రతికే మీతో ఇలా కూచుని మాటాడ్డం...ఇదంతా కలా...నిజమా? సజీవులుగాఉన్న చూక్చీలతోనే మేముమాటాడుతున్నామా?

ప్రొఫెసర్ "హిహిహి" అని నవ్వాడు. ఆయన భార్య విరగబడి నవ్వసాగింది. నేను గెయుటీగిన్ మొహం చూడలేక పోయాను. నేను పైన పడుకున్న దానికి క్రింద సీటులో అతడు కూచున్నాడు.

"ఆః మాకేమీ బాధలేదు...పై పెచ్చు......మీ కూతూహలం చూసి మాకు సంతోషంగానే ఉంది. మీకు ఆసక్తి గొలిపే అనేక విషయాలున్నాయి. కాని నేనుకూడా ఒక విషయం చెప్పకుండా ఉండలేకపోతున్నాను. "సజీవంగా ఉన్న బెల్జియన్లను నేనుకూడా ఎప్పుడూ చూడలేదు సుమండీ!

"ఆఁ ఏమిటీ ? పరిహాసోక్తులుకూడా చుక్చీలు మాట్లాడ గలరన్న మాట !

"మాట్లాడ్డంకాదు...విసరడం అను" అని సరిచేశాడు ప్రొఫెసరు.

"పరిహాసోక్తులు...సరస..."

"సరసోక్తులు...అవును సరసోక్తులు"

"ఇదిగో చూశారా ... దయుంచి మాకు లేనిపోని నాజూకుతనం, నాగరికత అంటగట్టకండి. దక్షిణాది వారివలె మాకు అంతమాటకారితనం, అంత పరిహాసోక్తి రమ్మన్నా రావు. మాగురించి మొట్టమొదట మీరు పడిన అభిప్రాయమే సరియైనది. మా వంట్లో ఉన్నది రక్తం కాదు...మంచు నీరు...మేము ముప్పొద్దూలాతినేది అన్నంకాదు ఐస్క్రీము !"

"మమ్మల్ని వేళాకోళం పట్టించకండి గెయుటీగిన్ గారూ ! వివిధ జాతులు వివిధ మనస్తత్వాలు, స్వభావాలూ కల్గివున్న విషయాన్ని మీరు కాదనలేరు."

"ఎన్నటికీ కాదండి లీర్లింక్ గారూ ! భౌగోళిక కారణాలవలనే అటువంటి తేడా పాడాలు ఏర్పడతాయని మేము అంగీకరించమండీ. పైగా ఈ మనస్తత్వాలూ, స్వభావాలూ మార్పుకు అసాధ్యమా ? కొన్ని కొన్ని పరిస్థితుల్లో కొన్ని కొన్ని జాతులు ఇంచుమించు నాశనమైపోయి తిరిగి నూతన జవసత్వాలు పొందిన ఉదాహరణలు అనేకం ఉన్నాయి.

"మానుషశాస్త్రం వదలి రాజకీయాలలోకి దిగితే ఎల్లాగ ?"

"మానుష శాస్త్రాన్ని మీరు తప్పుగా ఉదహరించి నేను రాజకీయాల్లో వేలు పెట్టానంటా రేమిటి ?"

ఇక ఆ సమయంలో నేను జోక్యం చేసుకోక తప్పదని నిశ్చయించుకున్నాను. అప్పుడే నిద్ర లేచినట్టు అభినయిస్తు "అందరికీ శుభోదయం" అన్నాను. బెల్జియన్లు శుభోదయ మేనని అన్నారు కాని ఆచి తూచి మాటాడే గెయుటీగిన్ శుభోదయం కాదు "శుభ దినమ"ని అన్నాడు. అప్పటికే మధ్యాహ్నం అయిపోతూంది కదా !

ఏదో మిషతో బెల్జియన్లిద్దరూ నడవలోకి వెళ్ళారు. నేను ఇంకా రాత్రి దుస్తులతో నేఉన్నాను. బహుశా నాదుస్తులు వేసుకోడానికి వీలుగా వెళ్ళారనుకుంటాను. నేను క్రిందకు దూకి బట్టలు వేసుకున్నాను. "బేష్, శ్రీయుత గెయుటీగిన్‌గారు ఏమిటి ఆలోచనలో పడ్డారు ?"

"వ్యవహారం ఏమంత బాగో లేదోయ్ మిత్రుడా ! ఏమిటో మనల్ని మనుష శాస్త్ర మ్యూజియంలో మైనపు బొమ్మల మాదిరిగాచూసి వాళ్ళు మాట్లాడుతున్నారు !"

"మైనపు బొమ్మకు జీవ నే ఉం టే వచ్చేవారి దృష్టి ఆక ర్షించగల్గినందుకు, వారి విజ్ఞానపరిధిని విశాలవంత మొనర్చి నందుకు గర్వపడాలి. ఏమంటావ్? అంతేకాని చూడవచ్చే వారితో వాదులాడుతూ మైనపు బొమ్మ కూచుంటుందోయి వెఱ్ఱిబాగులవాడా !"

"ఏం ? నేను దురుసుతనంగా పోయానా ?" అని ఆతు రతగా అడిగాడు గెయుటీగిన్. వాళ్ళని దెబ్బకొట్టాలని నేను చూడటంలేదు. మర్యాదస్తులైన ముసలివాళ్ళే వాళ్ళిద్దరూను"

"చాల్లే ! క్లాడిన్‌ను ముసలిదనే వాడవే ? చూడ్డంలేదా ఆ హావభావాలు ?

"అయితే మారిస్ కూడానా ?"

"ఆయన పేరు మారిస్ అన్నమాట"

"ఊఁ, మనకు ఊసుపోడానికి ప్రయాణంలో మంచి వాళ్ళే దొరికారు కావలసినంత కాలక్షేపం ! అయితే మన ల్నేదో విచిత్ర జంతువులా చూసి మాట్లాడకపోతే ఏమీ బందిలేదు. వాళ్ళు మాట్లాడినంతసేపూ మనం నిజమైన మనుష్యులం అవునో కాదో ముట్టుకుని చూడాలన్నంత వింతగా వాళ్ళ ధోరణి వుంది. చుక్చీలంటే ఏదో ఉత్తర ధృవ ప్రాంతపు వింతప్రాణులు, జంతువు లన్నట్టు వాళ్ళు చూశారు. వాళ్ళు ఏమి మాట్లాడినా మనం చుక్చీలన్న సంగతి ఏమర పాటున కూడా మర్చిపోయేటట్టులేదు. మనం లేడి చర్మాలు కట్టుకొని వుండకుండా వున్ని సూట్లు వేసుకొని పాపం వాళ్ళకు ఆశాభంగం కల్గించాము.

"ఏదో వాళ్ళపిచ్చి వాళ్ళ కానందం ! కొంచం ఓపిక పట్టు. వాళ్లు ఎక్కడినుండి వచ్చారో మర్చిపోకూడదు మనం."

"నేను మర్చిపోలేదు" అని నిట్టూర్చాడు గెయు టీగిన్. "వాళ్ళతో ప్రయాణంచేసే ఈ పదిరోజులు మనం ఎంతో ఓపికతో వ్యవహరించి శ్రామికవర్గ అంతర్జాతీయత అంటే ఏమిటో తెలుసుకొనేటట్టు చేయాలి. మనమీదవున్న బాధ్యత ఏమిటో తెలిసిందా ?

"పోనీ మనం ఈపెట్టెలోంచి ఇంకోపెట్టెలోకి మారి పోతే... స్వెర్దలోవస్క్‌లో యిద్దరు దిగిపోతున్నారు పక్క పెట్టెలో..." అన్నాను నిరుత్సాహంగా.

గెయుటిగిన్ ఒక్కక్షణం ఆలోచించాడు.

"ఛా...ఛా...మనం అల్లా చేయకూడదు. అది అమ ర్యాదకరంగా ఉంటుంది."

"చడీచప్పుడు లేకుండా పారిపోవాలని కాదు. చెప్పే పోదాం ... మీకు మేము అడ్డుఎందుకు ... వేరేపెట్టెలో ఎక్కుతాం అని"

"మనం వెడితే మన స్థానంలో ఎవరో ఒకరు వస్తారు కదా! మనం అభ్యాగతులమనీ వారు మన అతిథులనీ ఏమాత్రం మరచిపోకూడదు. మనం ఏమిటి మాట్లాడినా చాలా బాధ్యతతో మాట్లాడాలి. రైల్లో నంటావా, వాళ్ళూ మనం ఒక టే...ప్రయాణీకులమే కాని దేశంలో పౌరులుగా మన బాధ్యత ఏమిటి? వాళ్ళు మన అతిథులు...అందులో వాళ్ళు కొంచెం స్థాయికి చెందిన అతిథులాయె"...

"సరె, సరే...అల్లాగే కానియ్ ఇక్కడే ఉండిపోదాం లే..." అన్నాను. బుజంమీద తువ్వాలు వేసుకొని స్నానా నికి వెళ్ళిపోయాను.

* * *

రోజు తర్వాత రోజు గడుస్తోంది. మోలటోవ్ ... సెర్దలోవస్క్, ఓమస్క్, నోవోసిబిరిస్క్ ... మైదానాలు దాటి పర్వతాలు ... పర్వతాలు దాటి పల్లపు నేలలు ...

చెట్టుడవులు దొర్లిపోతున్నాయి. మేము పశ్చిమ సైబీరియా మైదానంలో ప్రయాణం చేస్తున్నాము.

మాతోటి ప్రయాణీకులు ప్రతీ విషయంలోను ఎంతో ఆసక్తి చూపుతున్నారు. ఆసియా యూరప్‌ల ప్రకృతి సంపదల మధ్య తేడా ... ఒక మండలంనుండి మరొక మండలానికి వెళ్ళినప్పుడు వచ్చిన భేదాలు, సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో పనిచేస్తున్న ఒక ముసలమ్మ, ప్రక్కపెట్టెలో వున్న సోషలిస్టు శ్రామిక వీరనారి, సైబీరియా నదుల గతులను మార్చే సమస్య యివన్నీ మా సంభాషణల్లో దొర్లిపోతున్నాయి. మేము మాకు తెలిసినదంతా వారికి వివరిస్తున్నాము. మ్యాపులు ముందరపెట్టి ఇర్టిష్ నది గమనాన్ని ఉత్తరానికి బదులు దక్షిణానికి ఏ విధంగా మళ్ళించ వీలవుతుందో, అందు వలన ఖజక్‌స్తాన్ మరు భూములన్నీ ఏ విధంగా సుభిక్ష మవుతాయో తెలియజేశాము. ప్రొఫెసర్ లీర్‌లింక్, ఆయన భార్యా ఎంతో శ్రద్ధాసక్తులతో మేము చెప్పిన విషయాలన్నీ విన్నారు. దురుద్దేశ్యాలు కల్గివున్నవాళ్ళలా కన్పించలేదు. అసలు యీ దేశ విశాల సరిహద్దులు వారికి ఎంత ఆశ్చర్య జనకంగా తోచాయో చెప్పలేము. ఒక్క మండలం చాలు బెల్జియాన్ని మించిపోతుందని వారన్నారు. ఎక్కడికక్కడ రూపొందుతున్న మహా నిర్మాణాలు వారికి అచ్చెరువు కల్గించాయి. ప్రకృతిని మార్చివేసే కార్యక్రమం విన్నతర్వాత వారి ఆశ్చర్యానికి అంతేలేదు.

సోవియట్ దేశం సాధించిన విజయాలు గురించి వారికి చెప్పటం మాకు ఎంతో సంతోషదాయకంగా ఉంది. ఆయన

ఈ విషయాలన్నీ డైరీలో వ్రాసుకుంటున్నాడు. ఇవన్నీ బెల్జియం వెళ్ళిన తర్వాత ప్రచురితమయ్యే అవకాశం ఉంది. అందుచేత మేము మరికొంచెం సంతోషపడ్డాం.

మాకు మహాయిబ్బందికరంగా పరిణమించిన విషయం ఏమంటే అసలు మేమే వాళ్ళ పరిశోధనలో ఒక భాగం అయ్యాము! ప్రొఫెసర్ లీర్‌లింకు ఎడతెగకుండా చుక్కోట్కా గురించి ప్రశ్నలు వేస్తూనేఉన్నాడు.అంతావిని"సరే నిజమేనను కుందాము. యరంగాల బదులు...మంచి యిల్లు, వత్తిదీపాల బదులు ఎలక్ట్రిసిటీ లైట్లు రావడం అభివృద్ధే అనుకుందాం. కాని ఉత్తరధృవ మండల జాతిలక్షణాలు...మహా తమాషాగా ఉండే వాళ్ళ వేషభాషలు...వాళ్ళ శృంగారము, కవిత్వము నశింపు అయిపోవడంలేదా ?" అని అడుగుతూండేవాడు.

పాతబదులు కొత్త ఆవర్భిస్తున్నందుకు ఈ ప్రొఫెసరుకు ఇంత బెంగ ఎందుకు ? దీనికి గెయుటీగిన్ ఏమి సమాధానం చెబుతాడో నాకు తెలుసు.

"అయ్యా! మీకు వెయ్యి నమస్కారాలు. మీరు సెలవిచ్చిన ఆ తమాషా ఉత్తర ధృవ పదాలూ, ఆ విలక్షణా లన్నీ పోయినా మేము సుఖంగా జీవించగలము" అంటాడు.

మా ప్రాంతపు మత్స్య పరిశ్రమలో యంత్రాలను ప్రవేశపెట్టారని విన్న మా విదేశీ యాత్రీకులకు ఎంత విచారం కల్గిందో చెప్పలేము. మా పాత శాస్త్రిలు 'షామాన్'లు మా గ్రామములనుండి అదృశ్యమై పోయాయని విన్నప్పుడు కూడా వారు బహు చింతాక్రాంతులయ్యారు. ఇవన్నీ అభివృద్ధి నిరోధక చర్యలని కాదు. ఇప్పుడు చుక్చీ ప్రజలు

చాలా పురోభివృద్ధి నందారని ఒకప్రక్క గుర్తిస్తూనే ఆపాత కాలపు నాగరికతనూ, ఆదిమ వాస లక్షణాలను ఎంతో మెచ్చుకుంటూ మాటాడేవారు. వెనుకబడిన జీవితానికి చిహ్నాలుగా ఉన్నవన్నీ వారి కంటికి ఎందు కంత ఇంపుగా కనపడుతున్నాయో మాకర్థం కాలేదు. వారికి ఆనాటి అంధకార జీవితాల్లోనే ఏవో కవిత్వపు వెలుగులు కనబడుతున్నాయి. మా సంగతంటారా? అజ్ఞానాన్ని అంధకారాన్ని చీల్చుకొని అరుణరేఖలు ప్రకాశించుతున్న ఉచ్ఛదశలోకి మేము ప్రవేశించామని అనుకుంటూంటే వారు మమ్మల్ని ఆషామాషీగా, జీవితపు లోతుపాతులు తెలియని వారివలె...జీవితంమీద నాగరికత ప్రభావాన్ని అర్థం చేసుకోలేని వారివలె చూచారు.

"చూడండి ప్రొఫెసరుగారూ!"అని గెయుటీగిన్ చల్లగా నచ్చచెప్పడం మొదలుపెట్టాడు" "ఇంతవరకు మాజాతి ప్రజలు అనుభవించింది జీవితమే నంటారా? అది నిజంగా నరక యాతన...అంటే నమ్మండి. చావు ఒక్కసారిగా వచ్చినా సుఖమే. క్రమక్రమంగా చనిపోవడం ఉంది చూశారూ, అంత కంటే భయంకరవిషయం వేరే ఏమైనా ఉంటుందంటారా?అదే ఇంతవరకు మా ప్రజలు అనుభవించిన జీవితం. అందుచేతనే ఈ అనాగరిక జీవితాన్ని మేము ద్వేషిస్తున్నాము. ఇక ఆనాటి జీవితంలో శృంగారమూ, కవిత్వమూ అంటారా? వాటిని పూర్తిగా ఇతరవిషయాల్లో ఈనాడు మేము చూస్తు న్నాము. ప్రకృతి ప్రతిబంధకాలను జయించడంలోనే మేము శృంగారమూ, కవిత్వమూ చూస్తున్నాం. మాజాతి ప్రజల

పునరుజ్జీవనంలో, చుక్చీ నివాసకేంద్రాల్లో విద్యుద్దీపాల వెలుగుల్లో మేము నవజీవన సౌందర్యాన్ని చూస్తున్నాము.

'విద్యుచ్ఛక్తి - కవిత్వమూ రెండూ రెండు విభిన్న విషయాలు శ్రీ గెయుటీగిన్‌గారూ. పూర్తిగా భిన్నమైన విషయాలు."

"మీ దృష్టిలో యీ రెండూ వేరే... గాని, మా దృష్టిలో యీ రెండూ ఒకదానికొకటి పెనవేసుకున్న విషయాలు. చుక్చీ ప్రజల పురాతన జీవితానికి - కవిత్వానికి ఎంత సాన్నిహిత్యం వుందని మీ రనుకుంటున్నారో : అంతకంటె ఎక్కువ సాన్నిహిత్యమే యీ రెంటికీ ఉంది."

"చుక్చీ జాతికి యీ గత జీవితం ఒక శాపంలాంటిది. మీ అభిప్రాయంలో ఒకటి నాకు స్పష్టంగా గోచరిస్తూంది. పెట్టుబడిదారీ సమాజం విషఫలితా లన్నింటిని, దానిలోని నిస్సారత్వాన్ని మీరు మా నాగరికతకు అంటగడుతున్నారు... ఒక్కమాటలో చెప్పాలంటే మేము పెట్టుబడిదారీ విధానంతో నిమిత్తంలేని ఒక నూతన సమాజాన్ని నిర్మించుకుంటున్నామని మీరు గుర్తించటంలేదు."

ఈ అసలు విషయాన్నే దాటవేయాలని ప్రొఫెసరుగారు తంటాలు పడుతున్నారు. ఉద్రేకపడకూడదనుకుంటూనే గెయుటీగిన్ యింకా యిలా మొదలుపెట్టాడు : "రెండు రకాలు బూర్జువావర్గ జాతీయత లున్నాయి. రెండు రకాల జాతీయ దురహంకార ధోరణు లున్నాయి. మొదటిది బహిరంగంగాను, జబర్దస్తీగాను ప్రదర్శిత మవుతూనే వుంది. ఆ విషయంలో మీరూ మేము ఒకలాగానే భావిస్తున్నాము.

అందుచేత ఆ విషయంలో మీకూ మీకూ వివాదం లేదు. కాని యింకోరకం వుంది. అదే అనుకోకుండా ప్రదర్శితమయ్యే జాతీయ దురహంకారం. అన్ని దేశాలకు జాతులకు స్నేహితుణ్ణని అనుకుంటాడొకవ్యక్తి. కాని ఒక చిన్న జాతిలోని ఉత్తమ లక్షణాలను కాక లోట్లను మాత్రమే చూస్తాడు. అంతేకాదు, లేనిపోని గుణాలనుకూడా అంటకడతాడు."

ప్రొఫెసర్ నవ్వాడు. తాను ఓడిపోయానన్నట్లుగా తమాషాగా చేతులెత్తాడు. మొత్తం వాదోపవాదాలన్నీ నవ్వులతో సమాప్తమయ్యాయి. ఊరడింపుకోసమా అన్నట్లు నేను ఈ వాదనలను సమాప్తి చేస్తూ "ఇదిగో చూడండి మేము మా పట్టాలు పుచ్చుకొన్న తర్వాత మా వూళ్ళకు వెళ్ళినప్పుడు అక్కడ ఎప్పుడూ మోటారెక్క... తిరగంలెండి - మీరు చెప్పిన పాతనాగరికత చిహ్నాలున్నాయి చూశారూ సైడ్జిబళ్ళు... కుక్కలు లాగుకొనివెళ్ళే బళ్ళుకూడా ఎక్కితిరుగుతూంటాం లేండి" అన్నాను.

* * *

రైలుబండి క్రాస్నోయార్స్క సమీపించింది. నడవలో నుంచుని కిటికీలోంచి చూస్తున్నాను. గెయుటీగిన్ వచ్చి "ఆ బెల్జియన్లు ఎందుకు ఫ్రెంచిలో మాటాడుకుంటారు ?"

"ఎందుకా ! వాళ్లు బెల్జియంలో దక్షిణ ప్రాంతంలో ఉన్నారు గనుక"

"దానికీ దీనికి సంబంధం ఏమిటి ?"

"దక్షిణ బెల్జియంలో ప్రతివారు ఫ్రెంచి మాటాడుతారు. అసలు బెల్జియం భాష అంటూ వేరే ఏమీలేదు."

"నిజమేనా ?"

"నామాట నమ్మకపోతే వాళ్ళనే అడుగు. బెల్జియంలో రెండు భాష లున్నాయి. దక్షిణంలో ఫ్రెంచి మాటాడు తారు. ఉత్తరంలో ఫ్లెమిష్ మాటాడుతారు "

"ఫ్లెమిష్ భాషా ?"

"అవును డచ్చిభాష లాంటిదే అది"

"కాదు వాళ్ళు మాటాడింది ఫ్రెంచి భాషే."

"అయితే వీళ్ళు దక్షిణ బెల్జియంనుంచి వచ్చారన్న మాట."

గెయుటీగిన్ "హిహిహి" అని నవ్వాడు. వాళ్ళు మాటాడుకున్నదంతా నాకు అర్థమైంది. వాళ్ళు మనగురించే మాటాడు కుంటున్నారు. నాకు మహా యిబ్బంది కరంగా తోచింది కూడాను."

"యిబ్బంది తోచవలసింది వాళ్ళకి -- నీకుకాదు. వాళ్ళ సమక్షంలో మనం చుక్చీ భాషలో మాటాడుకో లేదుకదా !"

"నాఉద్దేశం అదికాదు...నాకు యిబ్బందితోచింది... వాళ్ళు మనల్ని పొగుడుతూండటంవలన !"

"నిజంగానా ? ఏమిటి ?...ఏమనుకుంటున్నారు మన గురించి...చుక్చీజాతి వాళ్లుకూడా యితరులవలెనే ఉన్నారనా?

"అబ్బేకాదు. వాళ్లు మనగురించి మన జాతి గురించి కాచు పొగడ్తలు కురిపించింది ! మనం బలే హుషారుకల్గిన యువకులమని! లీజ్ నుండి కొంతమంది విద్యార్థులను ఇక్కడకు పంపి మనల్ని అక్కడకు తీసుకుపోడానికి ఎంతో సంతోషంగా సిద్ధపడతాడట."

"అల్లాగా?"

"అటువంటి ఏర్పాటే ఒకటి చెయ్యాలని వాళ్ళు అనుకున్నారు. కాని వాళ్ళు మాటాడే ఫ్రెంచిభాష మన ఫ్రెంచి అధ్యాపకుడు మాటాడే విధంగా లేదు. పోతే మన ఉత్తరాది విద్యాశాఖ గురించి చెప్పావా?" లేదు నేనుఅక్కడ విద్యార్థినని మాత్రమే చెప్పాను. దాని సంగతి ఎందుకు?"

"ప్రొఫెసరుగారు...మన ఉత్తరాదివాళ్ళు చాలా వెనకబడిన వాళ్ళు గనుక వారిపాఠ్యాంశాలు చాలా తేలికగా ఉండాలనీ; వాళ్ళు అట్టే కష్టపడి చదవలేరనీ ఇంకా అనుకుంటున్నాడు."

"ఓహో...అల్లాగా? ఏమని సమాధానం చెప్పావు?"

" ఇది వాళ్ళల్లో వాళ్ళు మాట్లాడుకొంటున్న విషయమని చెప్పానుగా? వాళ్లు మాట్లాడుకుంటున్నది నాకు తెలిసిపోయినట్టుగా ఆచూకీ యివ్వకూడదు."

"అవునవును...నేను ఆమాట మర్చిపోయాను. నిన్న నువ్వు ఎల్లా నిగ్రహించుకున్నావో గాని...గమ్మత్తుగానే ఉంది ఇదంతా. కాని అల్లా తెలియనట్టు నటించడం బాగుండ లేదేమో?

వాస్తవం ఏమంటే గెయుటీగిన్ ఉత్తరాది విద్యాశాఖలో కాదు చదువుతున్నది. గణితశాస్త్రంలోనే అతడు అధ్యయనం చేస్తున్నాడు. కాని యీ విదేశీ యాత్రికులున్నారే ... వీళ్ళు చుక్చీ జాతివాళ్ళు యితరులతో సమానంగా చదవలేరనీ, అంత మేధాశక్తి వారికి లేదనీ అనుకుంటు

న్నారు. అందుచేతనే వాళ్ళకి ప్రత్యేకంగా తేలిక విషయాలు నేర్పుతారని వాళ్ళ ఊహ.

ఆ రోజున మీా విదేశీ మిత్రులతో మాట్లాడుతూ యీా విషయం తీసుకురాలేదు. కాని ఆ తరువాత రోజున 'లీజ్' లోని యూనివర్సిటీ గురించి అడిగాను. అదే అదనులో లెనిన్‌గ్రాడ్ యూనివర్సిటీ గురించి కొన్ని విషయాలు చెప్పాను. నేను చదువుతున్న విద్యాశాఖలో ఉత్తరాది ప్రాంతవాసస్తులే గాక యితర ప్రాంతాల విద్యార్థులు కూడా వుంటారని, ఉత్తరాది భాషల పరిశోధన మీాద ఆసక్తితోనే వీరందరూ చేరారనీ తెలియజేశాను. ఒకోసారి యిందుకు సరిగ్గా విరుద్ధమైన విషయం జరుగుతుందన్నాను. ఉత్తరాది జాతుల విద్యార్థులు యితర శాస్త్రాలలో జేరుతుంటారని అన్నాను. ఉదాహరణకు గెయుటీగిన్ గణితశాస్త్రం తీసుకున్నాడని అన్నాను.

"ఓహో అల్లాగా ?" అని ప్రోఫెసరుగారు ఎంతో గౌరవంగా గెయుటీగిన్ వైపు చూసాడు. "అంటే నువ్వు చాలా గొప్పవాడ వన్నమాటే...లెక్కల్లో నాకు ఎప్పుడూ మార్కులు వచ్చేవికావు. అసలు లెక్కలంటే భయం నాకు. ఇదిగో క్లాడిన్ విను " శ్రీ గెయుటీగిన్ గణిత శాస్త్రజ్ఞుడట... ఏవీ...మీా క్లాసు మార్కులేవీ...చూడనివ్వండి !"

అది సరదాకు అడిగినట్టూ ఉంది...నేను చెప్పిన మార్కులు నిజం అవునో కాదో తేల్చుకోవాలని అడిగినట్టూ ఉంది. గెయుటీగిన్ తన క్లాసు రికార్డులు తీసి యిచ్చాడు. ప్రొఫెసర్ లీర్‌లింక్ వాటిని చూస్తూ భార్యతో "ఉత్తమ

శ్రేణి...ఉత్తమశ్రేణి...ఉత్తమం...మరోసారి ఉత్తమశ్రేణి" అంటూ చదివి వినిపించాడు.

అదే సాయంత్రం ఖబరోవస్క్ గురించి మేము మాట్లాడుకున్నాము. ఖబరోవస్క్ మ్యూజియంలో చక్కని దంతపుపని నిపుణుడు మా గ్రామవాసి గామజాజ్ తయారుచేసిన వస్తువు లెన్నో ఉన్నాయని చెప్పాను. ప్రొఫెసరు భార్య గామజాజ్ పేరు వ్రాసుకుంది...అతడు తయారుచేసిన వస్తువులను చూడాలని ఆమె కుతూహల పడుతుంది. కాని ఆ పేరు ఫ్రెంచిభాషలో వ్రాసుకోలేక తికమక పడుతూంది. ఆమెప్రక్కనే కూచున్న గెయుటీగిన్ ఆమెపడుతున్న ఇబ్బంది చూసి ఫ్రెంచివర్ణక్రమం అక్షరం తర్వాత అక్షరం చెబుతూ ఆమెకు సాయపడ్డాడు. వ్రాయడం ముగించిన తర్వాత మదాం లీర్‌లింక్ "అంటే మీకు ఫ్రెంచిభాష వచ్చునన్నమాట" అని అంది.

"అబ్బెబ్బే లేదులెండి...ఏదో అంతంత మాత్రం." అన్నాడు గెయుటీగిన్.

"ఎందుకంత బిడియం? నేను మీ పుస్తకంలో చూశానులే...చక్కని ఫ్రెంచిభాష వచ్చు మీకు" అన్నాడు ప్రొఫెసర్‌గారు.

మదాం లీర్‌లింక్ సిగ్గుపడింది. వచ్చే నవ్వును ఆపుకో డానికి పెదిమలు నొక్కిపట్టుకుంటూంది. కాని ఆపుకోలేక పోయింది. నవ్వేసింది. మేముకూడా నవ్వేశాం. మొత్తంమీద ఆ యిద్దరూ చాలా యిరుకునబడే సమయాన్ని మేము ఈ విధముగా తప్పించేశాం. ఆఖరున మానవ్వుల్లో వంతు కలిసింది

ప్రొఫెసర్ గారు. మొదట ఆయన కీ తిరకాసేమిటో బోధపడ లేదు. చివరకు ఆయనకూడ గ్రహించి నవ్వసాగారు. "మేము ఎంతగొప్పవాళ్ళమో చూశారా. మీకు ఫ్రెంచిభాష రాదనుకుని మీముందే మీ గురించి మాట్లాడేశాం" అని అంటూ మళ్ళీ అదే పనిగా నవ్వులోపడ్డాడు.

*　　　*　　　*

'బైకాల్' సరస్సు చేసుకున్నాము. తన దివ్య లోకాల సౌందర్యంతో బైకాల్ సరస్సు మా సహచరుల హృదయాలను ఆకట్టేసింది. ఈ దారిని ప్రయాణం చేయడం మాకు కొత్త గాకపోయినా కిటికీల దగ్గరనుండి మేము ఆ సుందర దృశ్యాన్ని చూస్తూ కదలలేక పోయాం. అనేక చోట్ల పర్వతశ్రేణులను దొలిచి నిర్మించిన సొరంగాలగుండా మా రైలు వెడుతోంది. పైకుగాలికి బైకాల్ సరస్సులో నీలి చిరు కెరటాలు నృత్యం చేస్తున్నాయి. పడవలు పైకిక్రిందికి వూగుతూ తేలిపోతూ కెరటాలమీద స్వారీ చేస్తున్నాయి. దూర దూరంగా పర్వత శిఖరాలు రేఖామాత్రంగా మనోహరంగా కనిపిస్తున్నాయి. అనంత సుందరప్రకృతి మాముందున్నది. సరస్సు నీళ్లు ఇంచుమించు రైలు పట్టాలు తాకుతున్నాయి. ఆ తరువాత స్టేషనులో ఒక ఆఫీసరు, అటెండెంటును అడిగి ఒక గిన్నె తీసుకొని గబగబా పరుగెత్తుకొని వెళ్ళి సరస్సు జలాలతో నింపుకొనివచ్చాడు. పెట్టెలో ఉండే ప్రతీవారూ ఆ జలాలను రుచిచూచారు. ఉండిండి ఎవరో ఒకరు "బంగారు కెరటాల బైకాల్ సరసూ" అన్న ప్రఖ్యాత గేయాన్ని ఆలపిస్తున్నారు.

ప్రొఫెసర్ లీర్‌లింక్ అందరితోపాటు బైకాల్ సరస్సు జలాలను రుచి చూచాడు. బుర్యాట్ చేపలవాళ్ళు కాల్చి అమ్ముతున్న 'ఓముల్' చేపనుకూడా రుచి చూచాడు. బైకాల్ సరస్సు పాటకూడా వ్రాసుకున్నాడు. మలయ పవనం లాంటి ఒక పవనం 'బర్గూసిన్' అనే పదం ఆ పాటలో వచ్చేసరికి ప్రొఫెసర్ "ఎవరీ బర్గూసీన్?" అని అడిగాడు. రష్యన్ పేర్ల చివర 'ఇన్' అని ఉంటుందికదూ...అందుచేత అదొక వ్యక్తిపేరు అనుకుంటూ అడిగాడు. అంతవరకు కిటికీలోంచి తదేకంగా సరస్సు దృశ్యాలను అవలోకిస్తున్న మదాం లీర్‌లింక్ నిట్టూర్చుతూ భర్తతో ఇల్లాఅంది" ఏమండీ! నా కుంచెలు రంగులు వుంటే ఎంత బాగుండిపోనండీ! ఎంత సుందర దృశ్యం!"

ఖబరోవస్క్ దగ్గరపడుతోంది. మా పదిరోజుల సహచర్యం ముగింపుకు రానున్నది. "నాభార్య చిత్రాలు గీస్తుంది. మీ రిద్దరు కూచోవాలని" ప్రొఫెసర్ అన్నారు. తమ యాత్రా స్మృతి చిహ్నంగా మా యిద్దరి చిత్తరువులను తీసుకువెళ్ళాలని వాళ్ళ కుతూహలం. మేము కాదనడానికి ఏమీ కారణం లేదు. కాని రెయిన్‌డీర్లు, వ్రాలస్‌లు ఇతర జంతువుల చిత్తరువులతోబాటు మా చిత్తరువులను కూడా జతచేర్చేస్తారేమోనని మా అనుమానం...అంతే!"

"ఒక్క షరతుమీద మా చిత్తరువులను మీరుగీయవచ్చు. మీఫొటోలుకూడా మాకు ఈ ప్రయాణ చిహ్నంగా మాకివ్వాలి." అన్నాడు గెయుటీగిన్.

తనదగ్గర ఉన్న ఉత్తమశ్రేణి కెమేరాతో ఈ విదేశీ యాత్రీకుల నిద్దరిని ఒకస్టేషన్‌లో చిన్నతోట ఉంటే అక్కడ నుంచోబెట్టి గెయుటీగిన్ ఫొటోలు తీశాడు. ఆ స్టేషన్ పేరు "యెరోపై పావలోవిచ్."

ఆతర్వాత మదాం లీర్‌లింక్ మా చిత్తరువులను గీయడం మొదలుపెట్టింది. కర్రబొమ్మల్లా కదలకుండా మెదలకుండా నల్భైయ్యేసి నిముషాలసేవు ఒక్కొక్కళ్లం కూచునేసరికి చచ్చినంతపనైంది. నేను ఈ అవస్థపడుతున్న సమయంలో గెయుటీగిన్ ఆవిడతో పిచ్చాపాటీ మొదలుపెట్టాడు. "మదాం లీర్‌లింక్ మన చిత్రాలను 'లీజ్' తీసుకుపోతుంది. అక్కడ తన స్నేహితులందరికి చూపిస్తుంది. మనం ఎంత వింతగా వున్నామో చెబుతోంది. అంతేనా తాను రెయిన్‌డీర్ బండి ఎక్కి ఎల్లా స్వారీచేసిందో, ఉత్తర ధృవప్రాంతపు ఎలుగులను ఏ విధంగా వేటాడిందో ఈ కథలన్నీ పూసగుచ్చినట్టు చెబుతూంది..."

మదాం లీర్‌లింక్ గ్రహించింది గెయుటీగిన్ వేళాకోళం పట్టిస్తున్నట్టు ... ఆవిడ నవ్వుతూ యిలా అంది: "మా స్నేహితు లందరికి మేము ఆర్కిటిక్ మండలం దాటి ముందుకు వెళ్ళేదిలేదని నిక్షేపంలా తెలుసు. మేము మహా వెడితే ఉత్తరానికి లెనిన్‌గ్రాడ్‌గాకానే వెళ్ళేది."

"అయితేం ? మరేమీ ఫరవాలేదు. మీరు ముందు అనుకున్న పథకాలు మర్చేసుకున్నారేమో ? ఎవరు చూడొచ్చారు ? రైలు ప్రయాణంలో యిద్దరు చుక్కీ యువకులు తటస్థపడి మీరు మా ప్రాంతాలవరకు వస్తేనేకాని వీల్లేదని

పట్టుబడితే కాదనలేక మీరు వెళ్ళివుండవచ్చునేమో! అందులో ఒకతడు తన పెంపుడు సీల్ జంతువును మీకు యిచ్చి వుండవచ్చు... ఏమంటారు? "అటువంటి సందర్భంలో ఏది... ఆ సీలు జంతువు అని అడిగితే... ఎక్కణ్ణుంచి తీసుకురమ్మంటారు?"

"ఆఁ దానికేముంది లెద్దురూ! బెల్జియం తీసుకు వస్తూంటే... దోవలో అది యింటిమీద బెంగతో కృంగి కృశించి చచ్చిపోయిందని చెప్పవచ్చు. పోతే అప్పుడు మీ దగ్గర సీలు చర్మం వుండక తప్పదు. అందుచేత ఖబరోవస్క్‌లో ఒక సీలు చర్మం కొనేయండి. కాని ఒక్కమాట! దానిమీద ఉన్న కంపెనీ చీటి చింపివేయటం మరచిపోకండేం?

ఇప్పటికి గెయుటీగిన్ వాళ్ళతో ఎరమరికలు లేకుండా కలిసిపోగల్గాడు. లెనిన్‌గ్రాడ్ హాస్టల్లో తన స్నేహబృందం మధ్య వేళాకోళాలు వెక్కిరింతలతో ఎంత చలాకీగా వుండే వాడో యిప్పుడంత సరదాగానూ వుండగల్గుతున్నాడు. తన హాస్యోక్తులతో మమ్మల్ని కడుపుబ్బ నవ్విస్తున్నాడు. "నవ్వితే నీ చిత్రం చెడిపోతుంది సరిగ్గా కూచోవాలి" అని మదాం లీక్‌లింక్ హెచ్చరించేది...చివరకు మా యిద్దరి చిత్రాలు పూర్తిఅయ్యాయి. అవి బాగానేఉన్నాయని మాకు అనిపించింది.

* * *

ఆఖరిరోజున ఇక ఖబరోవస్క్ వస్తుందనగా గెయుటీగిన్ ప్రొఫెసర్ లీక్‌లింక్ మరోవాదం వేసుకున్నారు. సామూహిక

వివాహాల ఆచారంగురించి చర్చ ప్రారంభమైంది. చుక్కో ట్కాలో సోవియట్ అధికారం ఏర్పడేవరకు తొలిగిపోని ఆచారం చట్టం చేసినంతమాత్రాన తొలిగిపోయిందా ? అని ఆయన సందేహం. పరిణామం ఇంత త్వరగా తీసుకురావడం సంభవమా ? అని ఆయన ప్రశ్న. "ఎన్నో తరాలు గడిస్తేగాని ఇటువంటి ఆచారాలు ఎల్లా తొలుగుతాయి. "పిల్లలు...ఏపిల్ చెట్టునుండి అమాంతంగా వూడి పడతారా ? (ప్రొఫెసరుగారు ఇక్కడ రష్యన్ సామెతను తప్పుగా ఉదహరించారు. ఏపిల్ పళ్ళు అమాంతంగా ఒక్కనిముషంలో చెట్టుకు పడతాయా ? అని అసలు సామెత) ప్రేమగురించి నూతన భావాలు అంకు రించాలి. నూతన మనస్తత్వం ఏర్పడాలి అందుకు కొన్ని తరాలు పడుతుంది.

"ఈ ఆచారం తొలిగిపోయిదంటే నేను నమ్మలేనయ్యా! నిషేధ చట్టాలైతే చేయగలవు కాని ప్రజలభావాలను శాసించగలరా ?"

గెయుటీగిన్ చాలా ఓపికగా శాంతంగా ప్రొఫెసర్ గారికి చుక్చీప్రజలకు హృదయాలున్నాయనీ, ప్రేమభావం ఇతరజాతి ప్రజలవలెనే వారికి సహజంగా అంకురించేదేననీ చెప్పుకొచ్చాడు. సామాజిక పరిస్థితులు మారిపోయేసరికి పాతవివాహాల పద్ధతికూడా దానంతటదే క్రమంగా నశించి పోయిందని చెప్పాడు. "సమాజ జీవిత విధానాన్నిబట్టే గదా వివాహాల పద్ధతికూడా ఆధారపడివుండేది ? జీవిత విధానాలు ఎప్పుడైతే మార్పుచెందాయో వారిసాంఘికాచారాలుకూడా అప్పుడే మారిపోవడం సహజం. కొన్ని సామాజిక ప్రాథమిక

సత్యాలను అన్వేషిస్తేనే కాని ఇది బోధపడదు." అని గెయుటీగిన్ వాదించాడు. కాని ప్రొఫెసరుగారు సుతరామూ ఒప్పుకోవడం లేదు. "అటువంటి మార్పులు ఎన్నటికీ ఇంత చప్పున రావు. రావడానికి అవకాశంలేదు.' అని ఆయన వాదన.

"కాని ఈ విషయం ప్రత్యక్షంగా ఎవరికి తెలుసునంటారు ? తెలిన్ గ్రాడ్ దాటి ఉత్తరానికి వెళ్ళిచూడనిమీకా? చుకోట్కాలో పుట్టి పెరిగినమాకా? ఎన్ని ఆచారాలు, ఎన్ని సంప్రదాయాలు ఈ ఆదిమవాస ప్రజల జీవితాలనుండి ఇప్పటికీ అదృశ్యమైపోలేదు ? నేను ఇందాక చెప్పిన మార్పు చాలా శీఘ్రంగా రాదనీ, అది సంభవంకాదనీ మీరంటారు. కాని అది మున్నాటికీ జరిగింది. అంత శీఘ్రంగా పరిణామం రావడం మా అదృష్టమంటాను. ప్రొఫెసర్ గారూ ! అసలు విషయం ఏమిటో చెబుతాను వినండి. మధ్యయుగపు అంధకారంనుంచి అమానుష జీవితాన్నుండి మా చుక్చీజాతిప్రజలు నేరుగా సోషలిస్టు సమాజ జీవితంలోకి వచ్చిపడ్డారు. సాంఘికంగా అంతకంటె వెనుకబడిన అంతర్దశ లన్నింటిని అవలీలగా దాటి ఒక్కసారిగా వాటిని వెనుక వదలి ముందుకు దూకేశారు. మీరు ప్రస్తుతం వున్న పెట్టుబడిదారీ సమాజ విధానాన్నుండి కూడా వారు విముక్తులయ్యారు.

మదాం లీర్ లింక్ కూడా చర్చలో పాల్గొనడానికి రాకపోతే యీ వాగ్వివాదం ఎల్లా ముగిసేదో నేను చెప్పలేకపోయేవాణ్ణి. "సామాజిక పరిణామాలు, జాతుల సంవిధానం ఎల్లా ఏర్పడతాయో నాకైతే తెలియదుగాని ప్రేమ ప్రసక్తి వచ్చింది గనుక నేను తీర్పు యివ్వడానికి సంసిద్ధమే" అన్నది.

మదాం లీర్‌లింక్ "నేను చెప్పేది వినండి స్త్రీలకు మాత్రమే ప్రేమ అంటె ఏమిటో తెలుసు" అన్నది.

"నిజమైన ప్రేమకిసామూహికవివాహాలు సరిపడనిసంగతులు" అని ఆమెఅన్నప్పుడు, మేమందరమూ అది నూటికినూరుపాళ్ళు నిజమని ఒప్పుకున్నాము. ఆ వివాహ పద్ధతి చుకోట్కాలో ప్రబలి వుండడానికి కారణం దక్షిణ ప్రాంత జనులలో ఉన్నంత మానసిక వికాసం, ఆర్ద్రత, ఉత్తర ప్రాంత జనులలో వుండకపోవడమేనని అన్న దావిడ.

"నేను చెప్పింది కాదనకండి" మదాం లీర్‌లింక్ మధుర మందహాసంతో అంది. "కోప్పడకండి యువకులూ! గడ్డ కట్టిన మంచు మరుభూముల్లో, విసిరేసినట్టు ప్రపంచానికి మామూలల మీరు మీ జాతి ప్రజలు జీవిస్తున్నారు. ప్రేమార్ద్రత, స్నిగ్ధత మీకు ఎల్లా తెలుస్తాయి ? రమ్మంటే ఎల్లా వస్తాయి ? ప్రేమ అనేది అర్థం చేసుకోవాలంటే మరో రకమైన హృదయం అవసరం" చుకోట్కా మరీ విసిరేసినట్టు ఉత్తర ప్రాంత కొసలనుండేది గనుక మదాం లీర్‌లింక్ సిద్ధాంతం మరింత బాగా వర్తిస్తుందట. "ప్రొఫెసర్ మార్రిస్ చెపింది వాస్తవం. మీరు సామూహిక వివాహాల ఆచారన్నుండి ఇంత త్వరలో బైటపడటం అసంభవం" మదాం లీర్‌లింక్ చెప్పిన నిర్ణయం కడకు ప్రొఫెసరుగారికి కూడా ఆశ్చర్యకారణమయింది.

"కాదు...క్లాడిన్...నువ్వు నాకు మద్దతు ఇవ్వనక్కర లేదు. సామూహికవివాహాలను ఉత్తర ప్రాంతాలకు మాత్రమే

ముడిపెట్టడం తప్పు. ఉన్న మండల ప్రాంతంలో కూడా ఈ వివాహాల ఆచారం ఉంది. నేనుమాట్లాడేదే వేరు విషయం. నువ్వు చెప్పేదికాదు."

ఎందుకోగాని గెయుటీగిన్ మొహంలో హాస రేఖలు కన్పించాయి. "ప్రేమ గురించి మాకు మాట్లాడటానికే హక్కు లేదని మీరు అంటున్నారు. అటువంటి సందర్భంలో ఇక ఇద్దరు యువతీమణుల సాక్ష్యాన్ని నేను మీముందు పెట్టవలసి వస్తుంది. ఆ యిద్దరు యువతీమణుల్లో ఒకామె లెనిన్‌గ్రాడ్‌లో నాస్నేహితునికి వీడ్కోలు యిచ్చిన ఆమె! మరొక ఆమె అనాదిర్ స్టేషన్‌లో నాకోసం ఎదురుచూస్తూ ఉంటుంది!! మదాం లీర్‌లింక్‌గారూ ఉత్తరాది మనుషులకు హృదయాలు లేవనీ, వారిహృదయాల్లో ప్రేమ ఉండదనీ అంటే మీమాటలతో ఈ యిద్దరు యువతీలలామలు సుతారామూ ఒప్పుకోరే! ఏం చేస్తారు మీరు?"

అంతే... యిక ప్రొఫెసర్ దంపతులు మాట్లాడితే ఒట్టు! వారి వాదనలన్నీ పూర్వపక్షమైపోయాయి. మమ్మల్ని ప్రేమించిన యువతుల ప్రసక్తి ఎత్తడంతో! అప్పటికప్పుడే ఆమూర్ నీలిరంగు కెరటాలు మాకు ప్రత్యక్షమయ్యాయి. ప్రయాణీకులు దిగడానికి సామాన్లు సర్దుకుంటున్నారు. మా విదేశీ మిత్రులనుండి సెలవు తీసుకోవాల్సిన సమయం వచ్చింది. మా మీద వారిరువురు అభినందనల వర్షం కురిపించారు — హృదయపూర్వకంగానే అనుకోండి — మేముకూడా సముచిత రీతిని వారికి వీడ్కోలు వచనాలు పలికాం. నా పెట్టె తాళం వేసుకునేముందే నేను ఒక చక్కని గ్రంథాన్ని వారికి మా జ్ఞాప

కార్థం బహుమతిగా యిచ్చాను. అది పుష్కిన్ గీతాలకు నా చుక్కీ అనువాదం. నా బహుమతికి వారెంతో ఉప్పొంగారు.

"బహుశా బెల్జియంలో అడుగుపెట్టే మొట్టమొదటి చుక్కీ పుస్తక మనుకుంటాను యిది" అని ప్రొఫెసర్ అన్నారు.

"సాక్షాత్తు గ్రంథకర్త అభివందన వాక్యాలతో" అని పూర్తిచేయబోయింది మదాం లీర్ లింక్.

"ఆగండి...అనువాదకుని అభివందనాలతో అనండి" అన్నాను నేను నవ్వుతూ.

వారితో కరచాలనంచేసి మా సూట్ కేసులను పట్టుకొని మేము ముందు దిగాం. వాళ్ళకి రైల్వే కూలీలను పంపిస్తామని చెప్పి వారికి కూలీని పంపి ప్లాట్‌ఫారం వెంబడి నడుస్తున్నాం.

"చూచావా...ఎంత చక్కగా గడిచిపోయిందో... నువ్వు ఇంకో పెట్టెలోకి వెళ్ళిపోదామా అన్నావు...జ్ఞాపకం ఉందా?" అన్నాడు గెయుటీగిన్.

"ఈ పది రోజులనుంచీ నువ్వు తల్లక్రిందులుగా కష్టపడి నచ్చచెప్పడానికి చేసిన ప్రయత్నం ఫలించిందనీ, నువ్వు చెప్పింది వారు అర్ధం చేసుకున్నారనీ గ్యారంటీ ఏమిటి? అన్నాను.

"కాదు కాదు...చెప్పిందాంట్లో మూడువంతులైనా వాళ్ళు అర్థంచేసుకొని ఉంటారని నా నమ్మకం."

ఆ క్షణంలో మళ్ళీ వాళ్ళిద్దరు నాకు కన్పించారు. టాక్సీలోకి ఎక్కుతున్నారు. బహుశా ఆమూర్ హోటల్‌కు

గాబోలు వారు వెళ్ళేది. మేము మళ్ళీ అభినందనలు తెలువుతూ చేతులు వూపాము. ఖబరోవస్క్‌లో మూడురోజు లుండి అవీ యివీ చూసి అక్కడనుండి విమానంపై మాస్కో వెళ్ళి ఆ తరువాత వాళ్ళ దేశం వెళ్ళిపోతా మన్నారు.

మేము సరాసరి బుకింగ్ ఆఫీసుకు వెళ్ళి లెనిన్‌గ్రాడ్‌లో కొన్న టిక్కెట్లపై వ్లాడివోస్టక్ స్టేషన్‌కు వెళ్ళటానికి గుర్తు పెట్టించుకున్నాం. వ్లాడివోస్టక్‌లో రైలుదిగిన తరువాత ఒకో టస్క్, బేరింగ్ సముద్రాల్లో మేము ఇంకా ప్రయాణం చేయ వలసివ్వంది. గెయుటీగిన్ వేసవికి అనాదిర్‌లోనే ఉండిపోతు న్నాడు. నేను అనాదిర్‌నుండి బయలుదేరి నాస్వస్థలానికి ప్రఖ్యాతిపొందిన డాన్‌ఖోల్కోజ్‌కు వెళ్ళాలి. మా తల్లి దండ్రులు పుట్టి పెరిగిన వూరు; – అఖండుడు మేమిల్, దంత నిపుణుడు గామాజ్ . . . సాంకేతిక ప్రవీణుడు కెర్విగీ లను కన్న మా వూరు; ఇగ్రిన్, కెనిరీ, గామల్కాట్, మిగిలిన వాళ్ళందరూ పుట్టిన మా వూరు ?. . . నేను వెడుతున్నాను ! .

అప్పుడే వాళ్ళందరి మధ్య వున్నట్టు నా కనిపిస్తోంది. నా వూహాపథంలో అప్పుడే నా ప్రియమైన జన్మస్థలంపై అడుగు పెట్టినట్టు, ఆ వీధుల్లో తిరుగుతున్నట్టు అనిపిస్తోంది. "అదిగో ! స్కూల్లో ఉపాధ్యాయిని వెలంటీనా అలెగ్జియేవా పాఠాలు చెబుతోంది . . . నా చిన్నారి చెల్లెల కాటుక కళ్ళు మెరుస్తుంటె ఏదో ప్రశ్నకు సమాధానం చెబుతోంది . . . మరో క్లాసులోని బాల్యస్నేహితుడు పాఠాలు చెబుతూ బ్లాక్ బోర్డుమీద ఏదో వ్రాస్తున్నాడు. . .మావూరు తీరం వెంబడే

అలలువచ్చి విరిగి పడుతున్నాయి ... బొమ్మరాళ్ళు "వొడ్డుకు కొట్టుకు వస్తున్నాయి. ఒడ్డునే ముగ్గురు వేటగాళ్ళు యున్నె నార్, రింటుఫ్లీ మరొకరు ఉన్నారు...వాళ్ళు ఒక మోటారు బోటును సముద్రంలో వేటకు సంసిద్ధం చేస్తున్నారు !"

స మా ప్తి

